# ఆంధ్రపత్రిక

## క్రోధి సంవత్సరాది సంచిక

[ఏబదిఐదవ సంచిక]

[1964-65]



సంపాదకులు:
శివలెంక శంభుప్రసాద్



వెల రూ. 2

ఆంధ్రపత్రిక కార్యాలయమున ముద్రితము.

# ADVERTISER'S INDEX

సంచిక 55

# క్రోధి సంవత్సరాది సంచిక

## విషయానుక్రమణిక

సంవత్సరము 1964 - 65



**త్రివర్ణ చిత్రము :**

చిత్రకారుడు : శ్రీ దాసరి నాగవర్ధనరావు

ఓమ్

# ప్రస్తావన

ఇది ఆంధ్రపత్రిక యాభై అయిదవ సంవత్సరాది సంచిక. దీని ప్రచురణకు తోడ్పడిన రచయితలకు, తదితరులకు వందనములు. వారికి, పాఠకులకు మా ఉగాది అభివందనములు; ఈ సంచిక ఆశించినరూపంలో రాలేదు. రావలసిన వ్యాసములు, వ్యాసకర్తలనుంచి చివరి ఘడియవరకు కూడా చేరలేదు. రచయితలు రచనను వ్యాసంగముగా కాక, ప్రధాన వృత్తిగా స్వీకరించి నప్పుడే ఇలాంటి సంచికల ప్రచురణ, కొంతవరకైనా తలపెట్టిన రీతిగా రావడం సాధ్యంఅవుతుంది. రచనను వృత్తిగా స్వీకరించడానికి పరిస్థితులు పూర్తిగా అనుకూలంగా లేకపోవచ్చును. అంత మాత్రంచేత రచనాభివృద్ధి నిలిచిపోనక్కరలేదు. రచయితలలో సంకల్పం, ఆవేశంవుంటే సాహిత్యాభివృద్ధికి ఏవీ అడ్డురావు. ప్రపంచసాహిత్యంలో మహాగ్రంథము లనేకములు, ఆ గ్రంథకర్తల దేశములు వెనకబడిన స్థితిలోవున్నప్పుడు రచించడం జరిగింది.

"శుభకృతు శుభము నేమీ ఇవ్వలేదు. పైగా చైనా దురాక్రమణను తెచ్చిపెట్టినది. ఈ దురాక్రమణను శోభకృతు తొలగించి దేశసహజ శోభను పునః ప్రతిష్ఠచేయవలెనని అందరి ఆశ. అయితే ఆ ఆశ ఫలించునా, ఫలించదా అనునది జాతిస్వశక్తిమీద, దేశనాయకత్వముమీద ఆధారపడియున్నది." ఇవి గత సంచిక ప్రస్తావనలోని మాటలు. కాని శోభకృతులో జాతి హర్షించవలసినది ఒక్కటీ జరగలేదు. దురాక్రమణను తొలగించడంలో దేశనాయకత్వం సర్వతోముఖంగా విఫలమైనది. పరులు ఆక్రమించిన ప్రదేశమును పునఃస్వాధీనము చేసుకొనే ప్రాథమిక ధర్మమును నిర్వర్తించలేకపోయినది. కమ్యూనిస్టు చైనాతో పోరాటమువున్నట్టూలేదు, లేనట్టూలేదు. యుద్ధాన్ని యుద్ధం అనడానికి ఇష్టములేదు. శత్రువైన చైనానుశత్రువుగాచూచి, వ్యవహరించడానికి, ధైర్యమూలేదు. పైగా చైనా కమ్యూనిస్టు ప్రభుత్వంవేరు, చైనాప్రజలు వేరు అనే వింత సిద్ధాంతము బయలుదేరతీసింది. ఒక మహా అయోమయస్థితిని తెచ్చింది. ఇవన్నీ చూడగా క్రోధిలో కూడా ఈ పరిస్థితులు మారగలవనే ఆశ కలుగుటలేదు.

నాయకులమాటలకు (శ్రీ నెహ్రూనుండి సామాన్య నాయకునివరకు) వారి చేతలకు నేడున్న ఎడము విపరీతము. సామ్యవాది అని చీటీతగిలించుకొని, అసామ్యవాదిగా వ్యవహరించడం నేడు మామూలు అయిపోయింది. మననాయకుల సామ్యవాదం ఒక నిర్వచనానికి నిలబడదు అందుకనే దేశంలో నేడు చెలామణి అవుతున్న సోషలిజం, "నెహ్రూ-ఇజం". గాంధీ ఇజం పోయి, నెహ్రూ-ఇజం వచ్చింది.

ప్రజాస్వామ్యంఅనుపేరున్నప్పటికి, శ్రీ నెహ్రూయే గత పదేళ్లుగా ఈ దేశాన్ని వాస్తవానిక పాలించాడు. ఇంచుమించు ఒక నియంతగా చెల్లిపోయాడు. అందువల్లే నియంతృత్వంవల్ల వచ్చే విపరిణామాలు నేడు దేశాన్ని బాధిస్తున్నవి. నెహ్రూ తర్వాత ఎవ్వరు అన్నది ఒక పెద్ద సమస్యగా ప్రచారంలోకి వచ్చింది. ప్రజాస్వామ్యంలో ఇలాంటిప్రశ్న నిజానికి రాదు. రాకూడదు. నెహ్రూ అంతటి గొప్పవాడు మరి లేడుకాబట్టి — అనే ఆలోచనలే ఈ ప్రశ్నకు కారణమైనవి. ఈ భావానికి కారణం శ్రీ నెహ్రూయేనా? లేక ఇతరులా? ఈ ప్రశ్నలకు వచ్చే సమాధానమే గత దశాబ్దంలో దేశానికి జరిగిన మంచిచెడులను నిర్ణయిస్తుంది. గొప్పతనం అనేటటువంటిది నిర్ణయించడం భవిష్యత్ చరిత్రకారుల పనిగాని, సమకాలినులది కాదు. రాజకీయాలలో ముఖ్యంగా కావలసిందిశీలం. (integrity) కాని తెలివి (Brains) కాదు అని ఒక ప్రసిద్ధ బ్రిటిష్ రాజకీయవేత్త చెప్పాడు. నేడుమన దేశంలో మేధావులకు లోటులేదు. కాని కావలసింది శీలం. ఇతరులకు ధర్మబోధనలవల్ల ఇదిసమకూరదు. అత్యుత్తమైన, ఆచరణసాధ్యంకాని, ఆశయాలనుగురించి మాట్లాడక మానవప్రకృతికి అనుగుణంగా సామాన్యులుగా మాట్లాడుతూవ్యవహరిస్తే, మన సమస్యలు సగం పరిష్కారం అవుతాయి. దేశంలో రాజకీయపరిణామాలు, సహజ, సామాన్యధోరణిలో నడుస్తాయి. అత్యున్నతధోరణిలో నడవాలంటే, అత్యున్నతస్థాయిగల వ్యక్తులు కూడా కావాలి. వారు సమకూరడానికి వ్యవధికావాలి; ఈ వ్యవధి ఎంత అన్నది-మనది ప్రజాస్వామ్యం కనక-ప్రజలమీదే ఆధారపడివుంటుంది. పూర్వం 'యథా రాజా తథా ప్రజాః'. నేడు యథా ప్రజాః తథా రాజా.



సూసిందె సూత్తావు యేమిటా సూపు
నువ్వలా సూత్తేను సిగ్గేత్తదీ నాకు...

చిత్రకారుడు : దాసరి నాగవర్ధనరావు.

# క్రోధిన్!

శ్రీ జటావల్లభుల పురుషోత్తము

సాధు ర్దయాళుః ప్రతిభాసి వర్ష
స్యా తో౽ధినామ్న స్తవ లక్షణార్థః
సా లక్షణా హి వ్యతిరేకవృత్తి
రక్రోధనం త్వాం కుపితం వ్యనక్తి.

కే చిద్బహి ర్వేషధరా ఇవార్యా
అంతశ్చ తేషాం మలినా ప్రవృత్తిః.
నామ్నైవ కేచిద్బహు భీకరాస్తు
భవాదృశా లోకహితప్రవృత్తాః.

క్రోధస్వభావో యది వర్తతే తే
సంకృధ్య చీనేభ్య ఉదాత్త బుద్ధే
తాన్ సాధు శత్రూన్ దమయస్వ శక్త్యా
రక్షస్వ పుణ్యాం మమ మాతృభూమిం.

ధర్మః స్వభావానుగుణః ప్రశస్తః
సర్వస్య లోకే తవ చైవ మస్తు
అజ్ఞానదారిద్ర్యరుగాదికేభ్యః
ప్రముష్య లోకస్య శివం కురుష్వ.

శివాచ ఘోరా చ యథా తనూర్ద్వే
శివస్య వేదే ప్రథితే తథా తే
తనుద్వయం తత్ర శివైవ నిత్యం
సత్సు ప్రవర్తేత పరత్ర క్రుద్ధా.

---

# స్వాగత గీతము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

కోరిక దీర మామిడి చిగుళ్ళను మెక్కి కషాయ కంఠ శో
భా రమణీయ పంచమ రవమ్మున మైఁబులకాంకురమ్ములం
గూరిచి శ్రోత్రపర్వముగ కోయిల మా వన వాటిలోన నిం
పారగ పల్కుచున్న దిదె స్వాగత గీతము క్రోధివర్షమా !

దారుణ మారణాయుధ వితాన సమార్జన మగ్నులౌచు ని
ష్కారణ మెంతయో ధనము, కాలము, వ్యర్థము సేయబూను
న్నారు సమస్త దేశముల నాయకు లిప్పటిదాక ఈర్ష్యతో;
వారల కన్నువిప్ప నిదె స్వాగత గీతము క్రోధివర్షమా !

అర్వది యేండ్ల చక్రము లనంతముగా గతియించె నీ విశా
లోర్వి జనించి యిప్పటికి; నొక్కొక యేడు దరుదెంచుచుండగా
సర్వ విధాల నభ్యుదయ సాధనకై కృషి సాగుచుండెడిన్;
సర్వను శోభకృత్తి దిదె స్వాగత గీతము క్రోధి వర్షమా !

ఉల్లము పల్లవించు మధురోక్తుల నూతన భావపుష్టి శో
భిల్లగ కావ్యగానమొనరించు కవీంద్రులతో పరీమళో
త్ఫుల్ల లతాంతమందిర మధువ్రతముల్ శ్రుతిగల్పి పాడెడిన్
పల్లెల పూలతోటలను స్వాగతగీతము క్రోధి వర్షమా !

ఎన్ని విధాల జూచిన గతించిన కాలమె మేలటంచు రా
నున్నది యెట్టిదో తెలియనోపమటంచు దలంతు రెల్లరున్
నిన్నటికంటె రేపె పయనింపగ సౌఖ్యపు బాటగాగ సం
పన్నులమై తనర్ప నిదె స్వాగతగీతము క్రోధి వర్షమా !

అన్ని విధాల దేశము శుభాభ్యుదయమ్మును గాంచునంచు నిం
కెన్నడులేని ఆశలొదవించిన ఆ శుభకృత్తు మా పవి
త్రోన్నత శీతశైలమున నుద్ధత శత్రుబలాల దింపి చూ
పెన్ని జయాప మాజ్యమది "బీర"నుకల్గునె పేరుదాల్చినన్ ?

ఏగిన శోభకృత్సమ మహీస్థలికిన్ సకలార్థ దాయియై
యోగకరంబె యా ననెడి యూహలు వమ్మొనరించి ధారుణీ
భాగము దిగ్భ్రమన్ నిలువ బ్రాణములన్ "కెనెడీ"వి తీసె; నీ
వేగతి తత్పశుత్వము హరింతువొ శాంతినిగూర్చి క్రోధివై.

# ఆధునిక సాహిత్యంలో 'కాలం'

ఆర్. ఎస్. సుదర్శనం

సాహిత్య సౌధంలో అధికారంతో విహరించేందుకు శాస్త్రపరిజ్ఞానం తాళం చెవిలాంటిది శాస్త్రపరిజ్ఞానం అంటే అలంకారశాస్త్ర పరిజ్ఞానం మాత్రమే కాదు ఆ పాత తాళంచెవిలో ఆధునిక సాహిత్యసౌధం ద్వారాలు తెరవ బడటం లేదు! పాతతాళంచెవితో కొత్త ఇంటికి వెళ్ళితే చుట్టూ తిరిగిచూచి వెనక్కి మళ్ళవలసి వస్తోంది లోపలికి ప్రవేశం లభించడంలేదు ఈ కొత్త యింటి తాళం చెవులెక్కడున్నాయి? ఈ శతాబ్దిలో అభివృద్ధి చెందిన శాస్త్ర పరిజ్ఞానాన్ని మూడు శాఖలుగా విభజిస్తే, అవి 1) మనస్తత్వ శాస్త్రం 2) సాంఘిక—ఆర్థిక శాస్త్రాలు 3) భౌతిక—రసాయనిక—జీవశాస్త్రాలు, అవే తాళం చెవులు ఈమూడింటివల్లా ప్రభావితమైన దార్శనికభావాలు (Philosophical ideas) ఆధునిక సాహిత్యానికి కొన్ని అపూర్వ లక్షణాలను— భాషలో, వస్తువులో, ప్రక్రియా నిర్మాణంలో—ప్రసాదించినట్లు తెలుస్తోంది. ఒక విధంగా సాహిత్యాన్ని మూడు విధాలుగా విభజింపవచ్చు ; 1) వ్యక్తి ప్రాధాన్యమిస్తూ, వ్యక్తిగతమైన మనో విశ్లేషణం ధ్యేయంగా పెట్టుకున్న రచనల్లో మనస్తత్వ శాస్త్ర ప్రభావం—అంటే ఫ్రాయిడ్, యుంగ్, ఆడ్లర్, పావ్లావ్, వాట్సన్ మొదలగు వారి పరిశోధనల ప్రభావం ఎక్కువగా కలిపిస్తుంది 2) సంఘంలో పరిణామాలను ప్రధానవస్తువుగా చిత్రిస్తూ సామూహికప్రయోజనం ఆకాంక్షించే రచనల్లో సాంఘిక—ఆర్థిక శాస్త్రాల ప్రభావం అంటే మార్క్స్, టాల్‌స్టాయ్, గాంధీ వంటి వారి ప్రభావం—వ్యక్తమౌతూ వుంటుంది. 3) సైంటిఫిక్ రొమాన్సస్, డిటెక్టివ్ సాహిత్యంలో భౌతిక—రసాయనిక—జీవశాస్త్రాల విజ్ఞానం ఎదురౌతూ వుంటుంది కాని ఈ విభజన కేవలం స్థూలవిభజన మూడురకాల ప్రభావాలూ సమ్మేళనం చెందటం, కాని అవి ఏఏ పాళ్ళలో ఏ విధంగా కలిశాయి అనే విషయంకాని, రచయిత ప్రతిభావ్యుత్పత్తుల మీద ఆధారపడక తప్పదు

శాస్త్రాలు భిన్నశాఖలుగా ప్రవృద్ధమాన మౌతున్నప్పటికి, కొన్ని శాస్త్రాలమధ్య విభేదం అంతరిస్తూ ఉండటం, ఒక శాస్త్రం మరియొక శాస్త్రంమీద ఆధారపడుతూ ఉండటం ఇరవయ్యోశతాబ్దంలో ఏర్పడు తున్న కొత్తపరిస్థితి ఉదాహరణకు రసాయనికశాస్త్రం, భౌతికశాస్త్రం ఆదిలో ప్రత్యేకశాస్త్రాలుగా ఉంటూ ఉన్నా, చరమదశలో వాటికి అద్వైతం పట్టే పరిస్థితి ఉంది విశ్వంలో మూలవస్తువు పదార్థమా (matter) శక్తియా (Energy) అనే జిజ్ఞాస వచ్చేటప్పటికి ఆ శాస్త్రాలు రెండింటికీ భేదం అంతరిస్తోంది. భౌతిక, రసాయనిక శాస్త్రాలు సాధించిన ప్రగతి తత్త్వ జిజ్ఞాస మీదా, ఆ తత్త్వ జిజ్ఞాస వ్యక్తిదృక్పథం మీదా విస్తరిస్తున్న సంఘ జీవనంమీదా, ఆ విస్తరిస్తున్న సంఘజీవనంలో పారిశ్రామిక వ్యవస్థయొక్క అవసరాలూ, అపేక్షలూ మళ్ళీ శాస్త్రపరిశోధనమీదా — ఇలా ఒకదానిమీద ఒకటి ప్రభావం చూపుతూ, ఆధారపడుతూ ఆవర్తం కావటం, దాని ననుగమించి మానవ దృక్పథం, జీవితం, మారుతూ ఉండటం యీ యుగంలో ముఖ్యంగా మనించి అర్థం చేసుకోదగిన సంగతి. ఎవరైనా ఈ మార్పుని గుర్తించటానికి నిరాకరించినప్పుడు, ఈ యుగం సాహిత్యాన్ని అర్థం చేసుకునే అధికారం వారికి లభ్యం కాదన్నమాటకు తిరుగులేదు

ఈ శతాబ్దిలో మారినదృక్పథాన్ని అవగాహన చేసుకోవాలంటే స్పృశించవలసిన కీలకమైన విషయాలో 'కాలం' ఒకటి శాస్త్రపరిజ్ఞానాన్ని ఉన్నదున్నట్లు సేకరించటం శ్రమతోకూడిన పని దానికి ఓపికా, తీరికా అందరికీ ఉండదు. కాని, సాహిత్యానికి సంబంధించినంతవరకు ఆధునిక శాస్త్రవిజ్ఞానంవల్ల, కొన్ని కీలకమైన విషయాల్లో ఎటువంటి భావపరివర్తనం, భావవిప్లవం జరిగిందో చర్చించటం, వివరించటం, ప్రస్తుతం సాహిత్యవిమర్శ చేయవలసిన ముఖ్యకార్యాల్లో ఒకటి అని తోస్తుంది. కాలాన్ని గూర్చి జరిగిన శాస్త్రపరిశోధనలూ, తాత్త్విక జిజ్ఞాసా, ఈ శతాబ్ది సాహిత్యంలో ఎలా ప్రతిఫలించాయో కొంతవరకు పరిశీలించటమే ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యం. ఇది పెద్దవిషయం దీన్నిగూర్చి విపులంగా ఒక గ్రంథం వ్రాయవచ్చు. ఇక్కడ కేవలం ఆంగ్లాంధ్రసాహిత్యాలను రెండింటిని మాత్రమే తడవుతూ కొన్ని ఉదాహరణలు ఇవ్వటానికే సాధ్యమౌతున్నది

ఐన్‌స్టీన్ 'సాపేక్షతా సిద్ధాంతము' (Theory of Relativity వలన సర్వత్ర ఒకటియైన విశ్వజనీనమైన కాలమంటూ (Universal Cosmic Time) ఏదీ లేదని నిరూపణ అయినది సంఘటనల క్రమం కాని (Order of events), యౌగపద్యముగాని (Simultaneity), ద్రష్ట (Observer) మీద ఆధారపడి ఉంటుంది ద్రష్టనుబట్టి మారుతుంది అందువల్ల రెండుసంఘటనలమధ్య యింత కాలవ్యత్యాస మున్నదనీ, రెండుప్రదేశాల మధ్య ఇంతదూరం ఉన్నదనీ మామూలుగా వ్యవహరించటంలో వస్తుతః యథార్థత్వము (Objective truth) లేదు. 'కాలా

నికి 'దేశ' నిర్దేశమూ, 'దేశా'నికి 'కాల' నిర్దేశమూ అవశ్యమౌతున్నది. ఈ దేశ కాల సంయోగమునకు దేశకాలా విరతకము' (Space - time - continuity) అని పేరు. ప్రతివస్తువుకూ, మనిషికీ తన చలనంతో సంబంధించి కాలం' భిన్నంగా ఉంటోంది దీన్నే ఆ వస్తువుకూ ఆ మనిషికి సంబంధించిన 'ప్రత్యేక కాలం' అంటారు [For each body, there is a definite time - order for the events in its neighbourhood; this may be called the 'proper' time for that body. Our own experience is governed by the 'proper' time for our own body — 'ABC of Relativity' by B. Russell.] పురాణాల్లో కల్పము, బ్రహ్మకల్పము మానవకాలాపేక్షముగా ఉంటాయనటం ఎటువంటి వైజ్ఞాని సత్యమో దీనివల్ల విదితమౌతుంది ప్రతిమనిషికీ, వస్తువుకూ, కాలం భిన్నంగా ఉంటున్నప్పటికీ, మనమందరూ ఒకే భూమి మీద యించుమించు చలనం లేకుండా ఉండటంవల్లా, మన మధ్య చలనభేదం ఉన్నా అది వెలుతురుయొక్క వేగంతో పోలిస్తే అల్పాతిఅల్పం కావటం వల్లా, వ్యవహారరీత్యా మనందరికీ సామాన్యమైనకాలం ఒకటి ఉన్నట్లే భ్రమించటానికి వీలౌతున్నది .. కాలాన్ని గూర్చిన ఈ యథార్థాన్ని నిరూపించిన పరిశోధనల్లో వెలుతురు వేగం (సెకనుకు 186,000 మైళ్ళు) కీలకమైన హద్దుగా ఉంటోంది మానవుని శక్తికి యిది అన్నివిధాలా అనుల్లంఘనీయమైన హద్దుగానే కనిపిస్తోంది

కాని ఆశకూ ఊహకూ హద్దుల లేవు ఒక సంఘటన తాలూకు వెలుగు కిరణాలు రోదసిలో అనంతంగా ప్రయాణం చేస్తుంటాయని భావిస్తే, నూరేళ్ల క్రితం జరిగిన సంఘటనల తాలూకు వెలుతురు కిరణాలతో మనం పోటీపడి వాటిని అందుకోగలిగితే, మళ్ళీ అనాటి సంఘటనల్ని కళ్ళతో దర్శించగలుగుతా మనటంలో ఆక్షేపణ లేదు వెలుతురువేగాన్ని మించిన వేగంతో ప్రయాణంచేసే యంత్రం ఇందుకు అవసరం ఈ ఊహ ఆధారంగా తీసుకుని హెచ్ జి వెల్స్ "టైమ్—మెషిన్" (Time machine) అనే కాల్పనిక నవల వ్రాశారు

దేశకాలావిరతకము (Space-time Continuity) ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన తరువాత, దాన్ని ఆధారంగా తీసుకుని దర్శనములు నిర్మించినవారిలో ఎన్నదగినవాడు గణితశాస్త్రజ్ఞుడు, మేధావి, యోగి అయిన పి డి ఆస్పెన్‌స్కీ (P. D Ouspensky)[1] 'దేశా'నికి మూడు పరిమాణాలు—పొడవు, వెడల్పు, ఎత్తు లేక లోతు—ఉన్నాయి, ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన ననుసరించి కాలాన్ని నాలుగవ పరిమాణంగా (Fourth Dimension) తీసుకొనవచ్చు. ఈ ఆధారంమీద ఆస్పెన్‌స్కీ శాశ్వతత్వాన్ని గూర్చి, చావు బ్రదుకులను, జన్మపునర్జన్మలను గూర్చి జిజ్ఞాస చేశారు ఇందులో పునరావృత్తిని (Recurrence) గూర్చిన విచారణ ముఖ్యమైనది హైందవ విశ్వాసమైన పునర్జన్మకు, జన్మపరంపరకు ఇదొక వ్యాఖ్యానము వంటిది ఆస్పెన్‌స్కీ ప్రబోధంవల్ల ప్రభావితుడై ప్రసిద్ధ ఆంగ్లరచయిత జె బి ప్రీస్ట్లీ (J. B. Priestley) 'టైమ్ అండ్ ది కాన్వేస్' (Time and the Conways), ఐ హేవ్ బీన్ హియర్ బిఫోర్' (I Have Been Here Before) అను నాటికలు వ్రాశారు మొదటి నాటికలో కాన్వే కుటుంబంలోని వ్యక్తులమీద కాలం తెచ్చే మార్పు హృదయంగమంగా చిత్రింపబడ్డది. రెండవ నాటికలో ఒక వ్యక్తి, కీలకమైన ఒక ప్రవేశంలో పూర్వజన్మ స్మృతివల్ల మళ్లీ మొదటి జన్మలో చేసిన నిర్ణయమే చేస్తాడా లేదా అనే విషయం తర్కించబడ్డది. జీవితంలో మనిషి చేసే నిర్ణయాలు కామ, క్రోధ, లోభ, మోహాది ప్రవృత్తులకు లోబడి ఉంటాయి. ఆ నిర్ణయాలు విపరీత ఫలితాల్నీ, దుఃఖాల్నీ యిస్తాయి. కాని, మనిషి పాఠం నేర్చుకుంటాడా ? అతనికి మరుజన్మలో మళ్లీ అటువంటి అవకాశమే ఎదురైనప్పుడు, పూర్వజన్మ స్మృతి ఛాయ కొంతకు కొంత కామాదిప్రవృత్తులనుండి విముక్తుడయ్యేందుకు తోడ్పడవచ్చు., అందువల్ల నిర్ణయాలు మారవచ్చు. అప్పుడు ఆ వ్యక్తి జీవనపథం ఒక మెట్టు పైకి వెళ్తుంది ఇది ప్రీస్ట్లీ నాటకంలో సారాంశము తెలుగులో ఈ వ్యాసకర్త 'భారతి' లో ప్రచురించిన 'కాలం తెచ్చిన మార్పు', 'అమృతుడు' [2] అన్న కథల్లోనూ ఆస్పెన్‌స్కీ యొక్క పై భావాల ప్రభావం చూడవచ్చు.

కాలానికీ జీవితానికీ గల సంబంధాన్ని గూర్చి కవులూ, దార్శనికులూ పూర్వంనుంచీ వ్యాఖ్యానిస్తూనే ఉన్నారు. కాని 20 వ శతాబ్దిలో యీ భావాలకు శాస్త్రవిజ్ఞానం ద్వారా మంచి ఆలంబనం లభించటంతో ఎక్కువ ప్రాముఖ్యత, స్పష్టత ఏర్పడుతోంది షేక్స్‌పియరు నాటకం 'హెన్రీ IV—1 భాగం' లో క్రింది వాక్యాన్ని చూడండి

"...... thought's the slave of life, and life time's fool,
And time, that takes servey of all the world,
Must have a stop." (Act V. Sc. 4)

జీవితం కాలానికి దాస్యం చేస్తున్నది, కాలంచేత మోసగింపబడుతున్నది కాలం నిల్చిపోతే తప్ప, అంటే మానవుడు కాలాన్ని జయిస్తే తప్ప, సత్యదర్శనం కాదు, మానవునికి విముక్తి లేదు. ఈ విశేషార్థాన్ని పై వాక్యంలో దర్శించిన ఆలస్ హక్స్‌లీ "టైమ్ మస్ట్ హేవ్ ఎ స్టాప్" (Time must have a stop) అను నవల వ్రాశారు ఇందులో మంచీ — చెడూ' అన్న విభేదాన్ని గూర్చి తర్కిస్తూ, ఈ విభేదం కాలానికి లోబడినంత మేర ద్వైధీభావంచేత కలుషితమౌతూ ఉంటుందనీ, (అంటే వెలుగుతోపాటు చీకటిలాగా, మంచితోపాటు చెడూ తోడై ఉండటం), కాలానికి అతీతమైన మనస్థితి — నిస్సంగత్వం (Detachment) ఏర్పడటమే — కలుషితం కాని మంచి అనీ, అదే విముక్తి మార్గమనీ హక్స్‌లీ గ్రహించాడు లోకవృత్తంలో మనిషి మనస్సులో 'మంచీ—చెడూ' అనే ద్వంద్వాన్ని సమదృష్టితో—అనగా ద్వంద్వాతీతమైన అద్వైత Non - dual దృష్టితో చూడగలగటమే కాలాన్ని జయించట మని చెబుతుంది యీ నవల

తెలుగులో కాలాన్ని జయించటాన్ని గూర్చిన యిలాంటి వ్యాఖ్యానమే శ్రీ శ్రీ రచించిన "చతురస్రం" [3] అనే నాటికలోనూ ఉంది. "రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినా, ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చినా, మానవజాతి కింకా మానసిక స్వాతంత్ర్యం ఏర్పడలేదు. .. అరణ్యాలు మన మనస్సులు .... మానసిక స్వాతంత్ర్యం సాధించటమే ఈనాటి మానవ సమస్య. ." అని గుర్తించటం శ్రీ శ్రీ దృక్పథంలో ఇటీవల వచ్చిన మార్పుగా తెలుస్తోంది ఈ నాటికను బట్టి మానవుల మనస్సుల మధ్య విభేదాలను జయించడం ఎలా ? అనే

---

1 ఈయన ముఖ్యగ్రంథాలు New Model of the Universe, Tertium Organum, In search of the Miraculous

2 ఈ కథలు ఎం శేషాచలం కంపెనీ, మచిలీపట్నంవారు ప్రచురించిన "కాలం తెచ్చిన మార్పు" అను సంపుటిలో ఉన్నాయి.

3 "చతురస్రం" నాటిక ఆంధ్రపత్రిక శ్లవ సంవత్సరాది సంచిక (1962) లో ప్రచురింపబడి, తర్వాత రేడియోలో కూడా ప్రసారమైనది.

సమస్యకు పరిష్కారం అన్వేషిస్తూ శ్రీశ్రీ కాలాన్ని జయించటమే దానికి పరిష్కారం అనే నిర్ణయానికి వచ్చారు "సృష్టి సమానాంతర రేఖలలో ప్రవహిస్తోందని నేటి వైజ్ఞానికులలో కొంద రంటున్నారు ఇది ఐన్‌స్టీన్ సిద్ధాంతానికి విరుద్ధమని కొంద రంటున్నారు .... మరికొంత తెలిసేదాకా దీని విషయము యిదమిత్థమని నిర్ణయింపలేము కాని, ఒకటి నిశ్చయమనే చెప్ప వచ్చును మానవ మనస్సులో అనేక చతురస్రా లున్నాయి. రెండేసి రెండేసి సమానాంతర రేఖలు నిలువుగా ప్రవహిస్తున్నా యనుకోండి. అప్పుడు వాటి మధ్య ఎన్నో చతురస్రాలు ఏర్పడుతాయి కదా ప్రవహిస్తున్న అడ్డు నిలువు సమానాంతర రేఖలుగా కాలాన్నినేను భావిస్తున్నాను మానవుడు టైమ్‌ని స్క్వేర్ చెయ్యాలి " చతురస్రాన్ని, కాలాన్ని జయించిన మానవుని మనస్సుకు ప్రతీకగా తీసుకుని శ్రీశ్రీ ఈ నాటిక వ్రాశారు మరో విధంగా కూడా చతురస్రానికి స్ఫూర్తి ఉంది మనస్తత్వ శాస్త్రవేత్త యుంగ్, 'చతురస్రం', అనాదిగా, ఆత్మజ్ఞానం సాధించి అతీతుడైన పూర్ణ మానవుని మనస్సుకు యోగవిద్యలో ప్రతీకగా ఉంటోన్న దంటాడు శ్రీశ్రీ తన నాటికలో చంద్రమండలం నుంచీ అమృతం వచ్చినట్లు, అది అందరికీ పంచిపెట్టడంతో వయోభేదాలు నశించి పిల్లలు, పెద్దలూ అందరూ 30 ఏళ్లవాళ్లయిపోయినట్లూ ఒక సన్నివేశం, పరిపూర్ణ మానవత్వ సిద్ధికి (Integration of human personality) సంకేతంగా ప్రవేశపెట్టారు దాని ద్వారా పరిపూర్ణత (Integration) అంటే ఏమిటో కాలాన్ని జయించటమంటే ఏమిటో నాటకాంతంలో వివరించటానికి అవకాశం కల్పించుకొని, వివాహం వంటి సాంఘిక వ్యవస్థ దేనిమీద ఆధారపడి ఉంది ? అని ప్రశ్నించారు యౌవనాన్ని కాలం హరించగానే స్త్రీ—పురుష బంధం సడలిపోతుందేమో నన్న భయం ఆ వ్యవస్థకు ఒక ముఖ్య ఆధారం అనుకుంటే కాలాన్ని జయించటం యీ భయాన్ని జయించటమే ఈ భయం పోగానే వివాహ వ్యవస్థే అవసరమై పోతుందేమో ! 'అసలీ పెళ్లి అవసరమా ?' అనే సందేహం వెలిబుచ్చుతారు నాటికలో పాత్రలు పెళ్లి వద్దనుకున్నా ఎవరిని ప్రేమించాలి నేను ?' అనే ప్రశ్న మాత్రం మిగిలే ఉంది కాని, నిజానికి యీ ప్రశ్నకు అర్థంలేదు నేపథ్యం నుంచీ ఒక స్త్రీ కంఠం వినిపిస్తుంది. 'నేను దైవాన్ని, నేను సత్యాన్ని, దైవాన్ని నేను మాట్లాడుతున్నాను. మానవుణ్ణి నేను సృష్టించలేదు. మానవుడే నన్ను సృష్టించాడు అతని మనస్సు నన్ను సృష్టించింది నాకు ఆకారంలేదు, వయసు లేదు నేను ఆడా కాదు, మగా కాదు. నేను దైవాన్ని, నేనే కాలాన్ని, నేనే సత్యాని మరణాన్ని మానవుడు జయిస్తే కాలాన్ని మానవుడు జయిస్తే, తన మనస్సునే మానవుడు గెలిస్తే —అప్పుడు నేను లేను ఇప్పు డున్నాను నేను . " ప్రచారంలో ఉన్న దైవం మానవునికి భిన్నంగా ఊహి పబడుతున్న దైవం, కేవలం మనసు కల్పిస్తున్న భ్రమ, కాలం చేస్తున్న గారడీ అని నొక్కి చెప్పటం యిది అయితే కాలాన్ని జయించటం ఎప్పుడు, ఎక్కడ ? అని ప్రశ్న. ఇప్పుడు, ఇక్కడే అని సమాధానం కాలాన్ని జయించగా మిగిలింది నీవే—నేను, నేనే—నీవు, అనే భావం, ఆడా—మగా మానవుడూ—మాధవుడూ ఒక్కటే అనే సత్యం. 1+1=1 "గణితాని కతీతమైన భాషలో ఒకటీ ఒకటీ ఒకటే" ఈ అతీత స్థితిని పొందినా, కవి పాడటం మానగలడా ? అయితే దేన్ని గురించి పాడుతాడు ? "రెండు గురించి" కాలాన్ని జయించిన కవి, మనస్సును చతురస్రం చేసుకొన్న కవి, ఈ లోకంలో ఉన్నంతకాలమూ "రెండు" గురించి పాడక తప్పదు. కాని అతని 'రెండు—పాట' లో ఎప్పుడూ ద్వంద్వంతోపాటు ఐక్యత ధ్వనిస్తూనే ఉంటుంది. ఉ "రెలి గ్రామ్య భాషలు" అనటంలో నగరాన్నీ గ్రామాన్నీ ఆ రెండు జీవనవిధానాల మధ్య భేదాన్ని సూచిస్తూనే కవి తన దృష్టిలో వాటి ఏకత్వాన్ని ధ్వనింపజేస్తాడు. నాటకాంతంలో ఉన్న యీ గీతం ఆధునిక కవిత్వంలో ఉత్తమశ్రేణికి చెందిన ఉదాహరణ అని చెప్పాలి "భ్రమర భ్రమర భ్రమణ భ్రమరణ భ్రమావరణ బ్రహ్మ వైరాస్వత మన్వంతరాలు" అనటంలో యీ సృష్టి, విశ్వం, కాలం, సర్వం భ్రమ అనే అనుభూతిని విశ్వరూప సందర్శనంలా కలిగిస్తున్నాడు కవి ఆ భాషాశిల్పం ఎటువంటిదో గ్రాహ్యం గీతం చివరి వాక్కు "రెండు కళ్ళు తెరిచినా పిడికిళ్ళు బిగించిన మానవసరోవరంలో వికసించిన మందారాక్షరాల మరలిపోలేని మద్రాక్షసముద్రాక్షసరాలు" విజ్ఞానం అనే కళ్ళు తెరిచినా మా వాళ్ళి పిడికిళ్లు బిగించటం మానలేదట ఈ మానవ సమాజంలో వికసించిన అందరి ఎట్టిటి కళ్ళూ తనవేనని, ఆ రాక్షసముద్ర యొక్క దృక్కులే తన కవితా ముద్రాక్షరాలని, చివర మా వాళ్ళతో కవి ఆత్మైక్యాన్ని పలుకుతున్నట్లుగా తోస్తుంది ఈవిధంగా తన నాటికలో శ్రీశ్రీ ఆధునిక కవిత్వం ఎన్నుకున్న భాషకూ, ముక్త చందస్సుకూ తాత్త్వికమైన ఆధారం ఏమిటో కూడా నిరూపించారు—కవి వస్తువుకూ భాషకూ ఇలాంటి అవినాభావ సంబంధం ఉండటమే ఉత్తమ శిల్పం.

ఆధునిక కవిత్వంలో శ్రీశ్రీ మొదలైనవారి మార్గదర్శి అయిన ఆంగ్లకవీ, యుగకర్తా, టి. ఎస్ ఎలియట్ ఆయన కావ్యాలలో ఉత్తమమైనదీ, నోబెల్ బహుమతిని లందుకున్నదీ అయిన 'ఫోర్ క్వార్టెట్స్' కావ్యములో వస్తువు కూడా కాలాన్ని జయించటమే, అంటే కాలాతీతమైన అద్వైతానుభూతిని అనన్య సామాన్యమైన కవితాశిల్పం ద్వారా వ్యక్తంచేసే ప్రయత్నం

'ఫోర్ క్వార్టెట్స్' నిర్మాణానికీ అందులోని వస్తువుకీ అవినాభావ సంబంధం ఉంది భూత భవిష్యాల నుండి విడదీయబడిన క్షణమే అనంతానికి ద్వారం, అది ద్వారం కాదు ఒక నిశ్చలితకేంద్రం, నిశ్చలిత కేంద్రమైనా అది స్తబ్దంకాదు ఆనందమయ నృత్యం, నృత్యంకాదు, గులాబిపూవు, పూవు కాదు ప్రజ్వలిస్తున్న అగ్ని—ఆ కేంద్రం యివి అన్నీ, యివి ఏవీ కాదు .. ఆ కేంద్రం నాలుమూల తత్త్వాల సంగమం—ఈవిధంగా తన్ను మాచేసి చెప్పటం టి ఎస్ లియట్ కవిత్వానికి కేవలం అపచారం చెయ్యటమే అవుతుంది

'Not the intense moment
Isolated, with no before and after
But a life-time burning in every moment
And not the life-time of one man only
But of old stones that cannot be deciphered"

అనంతానుభూతిని కేంద్రీకరించుకున్నక్షణంలో నిశ్చలిత బిందువును గూర్చి యిలా అంటాడు

"At the still point of the turning world Neither flesh nor fleshless
Neither from nor towards, at the still point, there the dance is
But neither arrest nor movement And do not call it fixity
Where past and future are gathered Neither movement from nor towards,
Neither ascent nor decline. Except for the point, the still point,
There would be no dance, and there is only the dance."

ఆ బిందువుతో అద్వైతస్థితి, సమాధ్యవస్థను గూర్చిన వాక్యాలు,

"Quick now, here, now, always—
A condition of complete simplicity
(Costing not less than everything)
And all shall be well and

All manner of thing shall be well
When the tongues of flame are infolded
Into the crowned knot of fire
And the fire and rose are one "

వర్తమానక్షణంలో ఆత్మానుభూతి ద్వారా అనంతకాల, అనంత విశ్వానుభూతిని పొందటమనే విషయం పూర్వంనుంచీ యోగులు చెబుతున్నమాటే ! కాని, సాహిత్యదృక్పథం యింత స్పష్టంగా, అసందిగ్ధంగా కాలాతీతమైన అనుభూతివైపు మొగ్గటం ఈశతాబ్దిలోనే జరుగుతున్నది. "మాయా కల్పిత దేశకాల కలనావైచిత్ర్య చిత్రీకృతం" అని శంకరులు జగత్తును గూర్చి అన్న వాక్కునే దృష్టిలో పెట్టుకున్న రీతిగా 'మాయ' నుండి విడివడటాని ఆధునిక సాహిత్యం కాలం మీదా, తార్కిక నియమాలకు లోబడిన భాష మీదా, హేతువాదంమీదా తిరుగుబాటు చేస్తోంది

తెలుగులో కాలాన్ని కాదు—తెలంగాణా ఉద్యమాన్ని ప్రధాన వస్తువుగా తీసుకొన్న కావ్యం, ఆరుద్ర వ్రాసిన "త్వమేవాహం " "ఎందులోంచి ఎప్పుడు ఎలాగ పుట్టింది కాలం?" అన్న 'ఆవాహన'తో ప్రారంభం అవుతుంది కావ్యం కాలాన్ని లొంగదీయటానికే కవి ప్రయత్న అటః

"ఊహకందని ఊహల కీకారణ్యంలో
కాలాన్ని పట్టితెచ్చి రాటకేసి కట్టేస్తాను. ..
కాలాన్ని మీకు బానిసగా చేస్తాను
కళ్లల్లో జ్యోతులు వెలిగిస్తాను
భూతలస్వర్గానికి తలుపులు తీస్తాను." అంటాడు. తర్వాత కావ్య

భాగాలకు ఇసుక గడియారం, నీటి గడియారం, పెద్దముల్లు, చిన్నముల్లు, సెకండ్లు, నిముషాలు వగైరా పేర్లు పెట్టటం కాలాన్ని సూచించటానికే ! కాని కావ్యమంతా చదివాక కాలతత్వం నిరూపణ కావటం కాని, కాలాన్ని జయించటం కాని ఏమీ జరగలేదని తెలుస్తుంది. జరిగింది అప్పటి తెలంగాణా ప్రభుత్వ వ్యవస్థలోని కుళ్లును, అన్యాయాన్ని దౌర్జన్యాన్ని చిత్రించి, విప్లవం యీ వ్యవస్థకు స్వస్తి చెబుతు ది అన్న హెచ్చరికతో ముగించటం. ఇందులో కవి' కాలా'నికీ తెలంగాణా వ్యవస్థకీ, తాదాత్మ్యం ఊహించుకొని భ్రమపడ్డాడు శ్రీశ్రీ ఉదారంగా యీ భ్రమను సమర్థించాడు. "కావ్యం అంతటా తీవ్రమైన మృత్యుఝంఝ ప్రసరిస్తుంది అల్లకల్లోలమైన అశాంతిచేసే రణగొణధ్వనులు మనకి వినబడుతూ ఉంటాయి కాని, అదే ఈ నాటి యథార్థ్యం. సమకాలిక సంక్షోభంతో కవి తన అవినాభావ సంబంధం 'త్వమేవాహం' అనే శీర్షికలో ప్రకటిస్తున్నాడు ఈ సంబంధం మృత్యువును కూడా అధిగమించి కాలంతో తన ఏకత్వాన్ని స్థాపించుకుంటుంది " త్వమేవాహం' అన్న శీర్షిక శ్రీశ్రీ ప్రసాదించిందే అన్న సంగతిని గుర్తుంచుకుంటే. ఇందులో ఔదార్యం మరీ అర్థమౌతుంది. కాలంతో కవి తన ఏకత్వాన్ని స్థాపించుకోవటం కాలంమీద విజయం సాధించటమనే తాత్త్వికదృష్టి ఆరుద్రకు శీర్షిక ద్వారా శ్రీశ్రీ ప్రసాదించాడు అని చెప్పాలి.

తర్కమునందు 'అతీతాదివ్యవహారహేతుః కాలః ' అని కాలము నిర్వచింపబడినది. కాలానికీ కార్య—కారణ నిర్ణయానికీ గల సంబంధము తెలిసే యున్నది ఐన్‌స్టీన్‌కు పూర్వం కాలం విశ్వజనీనమైనదనుకోవటంలో, కార్య కారణ సంబంధానికీ వస్తుతః యథార్థత్వమున్నదనీ అభిప్రాయంవుండేది సంఘటనల అనుగతిక్రమంకాని యౌగపద్యము Simultaniety) కాని ద్రష్ట మీద ఆధార పడివుంటుంది.అన్నభావం నేటి సాహిత్యంలో నవలానిర్మాణంలో, పాత్రోనీ లనంలో పెద్ద మార్పు తెచ్చింది. ఈ మార్పున ు కాలాన్ని గూర్చిన భావమే కాదు మన స్తత్వ శాస్త్రమూ ఎక్కువగా దోహదం చేసిందని చెప్పుకోవాలి. కాని నవలా నిర్మాణంలో కాలం మీద ఆధునిక ప్రక్రియ చేసిన తిరుగుబాటు గమనింపదగ్గది. స్కాట్‌డికెన్స్‌వంటి వారి నవలల్ని వర్జీనియా ఊల్ఫ్,జేమ్స్‌జాయ్స్ వ్రాసిన నవలల్తో పోలిస్తే రెండూ ఒక ప్రక్రియకి చెందినవేనా? అన్న సందేహం రాక తప్పదు. 18, 19 శతాబ్ది నవలల్లో కార్య—కారణ సంబంధాన్ని మనస్సులో పెట్టుకొని సంఘటనలను కూర్చటం పద్ధతి. 20—శతాబ్ది నవలలో—ముఖ్యంగా 'చైతన్య స్రవంతి' శైలిలో వ్రాయబడిన నవలలో—కార్య—కారణ సంబంధానికి గౌరవం లేదు. ఇది హేతువాదంమీదా, కాలంయొక్క కర్కశ నిర్బంధంమీదా తిరుగుబాటు తర్కానికి, కాలానికీ అతీతమైన మానవత్వపు విలువల కోసం అన్వేషణ ఒక వ్యక్తి జీవితంలో ప్రతి క్షణమూ అతని మొత్తం జీవితకాలానికి సమానమే, ఆ వ్యక్తి తత్త్వం, గుణగణాలు తెలుసుకోవటానికి కొన్ని సంవత్సరాల జీవిత కాలంలో ముఖ్యఘట్టాలనే తడవ నవసరంలేదు. ఒక్క గడియ, ఒక్క రోజు చాలు—అని యీ తిరుగుబాటు 'యులిసెస్'(Ulysses)'మిసెస్‌డాలోవే' (Mrs Dalloway) వంటి నవలలు ఇందుకు ఉదాహరణలు ఇక్కడ నవల మొత్తం ఒక వ్యక్తి యొక్క ఆంతర్యానికి దర్పణం వ్యక్తిలోని చైతన్య స్రవంతిని ఆలోచనా స్రవంతిని యథాతథంగా రూపొందింటమే పద్ధతి కాని ఎంత యదార్థం అయినా కళకూ, సాహిత్యానికీ ముఖ్యమైన 'ఎన్నిక (Selection) 'నేర్పు' (Skill) రచనలో వుండక తప్పదు. ఇది కేవలం శిల్పంలో కొత్త పద్ధతి అని భ్రమించి అనుసరించటానికి ప్రయత్నాలు జరిగాయి కాని రచయిత యధార్థాన్నిదర్శించే విధానంతో అతని తాత్త్విక దృష్టిలో అవినాభావ సంబంధం కలిగినట్టి శైలి కావటంతో యిది తప్పదు అందరికీతప్పదు తెలుగులో ఈపద్ధతిలో వచ్చినరచన బుచ్చిబాబు "చైతన్యస్రవంతి" విశ్వనాథశాస్త్రిగారి "అల్పజీవి" ఈ వ్యాస కర్త "మళ్లీ వసంతం," వినుకొండ నాగరాజు "తాగుబోతు" అచ్చంగా 'చైతన్యస్రవంతి' నవలలు కావు— అంటే జాయ్స్, ఊల్ఫ్ ధోరణిలో కాని యీ నవలల్లోనూ పై చెప్పిన కాలం మీద తిరుగుబాటు లక్షణాలు ఉన్నాయి.

ఆధునిక నవలా నిర్మాణంలో గమనింపదగిన సంగతి మరొక్కటి వున్నది. కాలం విశ్వ జనీనం అనుకున్నప్పుడు రచయిత సర్వజ్ఞుడు అనే ధీమాతో తన కథలోని పాత్రలందరిమనస్సుల్లోనూ ఏమి జరుగుతూవుందో స్పష్టంగా,నిర్దిష్టంగా చెప్పేవాడు ఒక కథ జరిగిన తీరు, దాని తాలూకు యధార్థ్యం రచయితకు తెలుసనీ, అంతకు మించిన యథార్థ్యంలేదనీకూడాఅప్పటి అభిప్రాయం. ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతం వచ్చిన తర్వాత రచయిత తన సర్వజ్ఞత్వాన్ని వదలుకో వలసి వచ్చింది. ఎవరైనా తన మనస్సులో తన ఎదుట జరుగుతున్న దానికి సాక్షి భూతులు కావటమొక్కటే సాధ్యం. అదైనా ద్రష్ట ఊహాపోహలతో రాగద్వేషాలతో రంగులు దిద్దుకున్న సంకీర్ణ చిత్రంగానే వుంటుంది. ఇలా దృశ్యమౌతున్న యథార్థాన్ని ఒక వ్యక్తి మనస్సు ద్వారా చిత్రించటమే జీవితపు యథార్థ చిత్రణ అనే భావం ఆధునిక నవలకూ, చైతన్యస్రవంతిపద్ధతికీ మూలాధారం. లారెన్స్‌డరెల్ (Lawrence Durrell) వ్రాసిన "అలెగ్జాండ్రియా క్వార్టెట్" అను నాల్గు నవలల సంపుటిపై సూత్రానికి చక్కని ఉదాహరణ. ఇందులో వస్తువు అలెగ్జాండ్రియా పట్టణంలో కొందరు వ్యక్తుల మధ్య జరిగిన కొన్ని సంఘటనలు. ఈ సంఘటనలు కార్య—కారణ సంబంధం, సంఘటనలను పాత్రలను అర్థం చేసుకునే తీరూ అందులోని ఒక్కొక్కవ్యక్తి దృష్టిని బట్టి ఎంత విచిత్రంగా భిన్నమై ఉంటుందో నిరూపించేందుకు అవే సంఘటనలను ముగ్గురు వ్యక్తులు భిన్న దృక్పథాల నుంచి మొదటి మూడు నవలల్లోనూ వ్యాఖ్యానించాడు రచయిత. నాలుగవ నవలలో పై సంఘటనల వరుస తర్వాత జరిగిన పర్యవసాన్ని వివరించాడు. ఇది ఆకర్షణీయమైన ప్రయోగము ఇందులోనూ ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతము ఎలా సాహిత్యాన్ని ప్రభావితం చేస్తున్నదో గమనించవచ్చు.

ఇరవయ్యో శతాబ్దిలో కాలాన్ని అధిగమించాలనే ఆకాంక్ష, హేతువాదాన్ని తర్కాన్నీ దాటిన మానవత్వపు విలువల్ని అందుకోవాలనే ఆశయం మేధావుల్లో రచయితల్లో, కవుల్లో, దార్శనికుల్లో సర్వత్ర కనిపిస్తోంది ఈవిషయం సమగ్రంగా అందరికీ గోచరంకావటానికి యింకా కాలం పట్టుతుంది కాలాన్ని కాలమే జయిస్తుంది— అంటే మనిషి తనను తనే జయిస్తాడని ఆశిద్దాం!

"కాల మడగించు జనుఁగ
లోఁబడి గిౕ ద్రెంచు కరణి, లోభ క్రోధా
శిలత్వ కామ భయములఁ
దేలు జనుఁడు గాలవృత్తి తెఱఁగు నెఱుఁగునే!
—తిక్కన. శాంతి పర్వము.

# అనిబద్ధకవిత్వము

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

తరతరాలుగా కవిత్వపు కళతో చేరి చేరి—గంగిరెద్దుకు బొంతలవలె—బలహీనతను కప్పిపుచ్చే బరువులైపోయిన కవిసమయాల్ని అలంకారాల్ని, అనుప్రాసాల్ని, చందోకల్పనల్ని, భాషాభేషజాల్ని వదిలేసి సర్గ—, అనిబద చైతన్యంతో ''చెప్పవలసినదున్నట్లయితే శక్తివంతంగా చెప్పండి'' అని కవులను కోరినాను. ఈ కోరికలో పై సాధనాలమీద ద్వేషము ఉన్నదని కొందరు భావించినట్లు కనిపించినది నాకున్నది ద్వేషము కాదనీ క్షాళనాభిలాష మాత్రమే ననీ మనవిచేస్తున్నాను. వెనకటి రోజులలో ఏ ప్రయోజనము సాధించినవో కాని ఈనాడు, చిరపరిచయమువల్ల నైతేనేమి, కృతకత్వ పేలవత్వములవల్ల నైతేనేమి, బేషజ సాధనాలవడమువల్ల నైతేనేమి: అవి నిరుపయోగము లైనాయనీ, అంతమాత్రము అంటే చాలదు 'అక్కరలేని బరువులైనాయ' నీ అంటున్నాను వాటికొరకు యత్నము చేయడము కానీ' అవి ఉన్నాయని సంతోషించుకోడము కానీ ఆరోగ్యచిహ్నాలు కావంటున్నాను.

కవిత్వానికి వలసినంత చేవలేనప్పుడు పాకింగు దూదిగా అవతరించాయి కవి సమయాలు. 'చంద్రోదయము కాగానే సముద్రము పొంగుతుంది' అన్నది నిజమే కవులు కల్పించుకున్నది కాదు. ఇక్ష్వాకుల నాటి నుంచి నిన్నటివరకూ 'చంద్రోదయము కాగానే సముద్రము పొంగింది' అని వ్రాయడము చాలా అనుకూలమైన అలవాటయిపోయింది, ఈ ఊహ కోసము కవిగారు తాళీదళసంపుట ప్రకరకాంతారములో వెతుకుతున్నారు. గాని, అనుభవములో వెతకడము లేదూ అంటున్నాను. ఇలాటివే విరహసమయోపాలంభనాలూ, చకోరికలు వెన్నెలను తింటాయనీ, ముడిగే పద్మాలలో తుమ్మెదలు బిగించుకు పోతాయనీ చెప్పే అష్టాదశ వర్ణనలలోని అసందర్భాలనీ మనవిచేస్తున్నాను. కచ్ఛపము తోకతో నీరు త్రాగదు, గబ్బిలము నాగుదము కాదు, స్వాతివాన చినుకు ముత్యము కాజాలదు, భూమికి కుల పర్వతాలూ అష్టదిగ్గజాలూ భూదేవి, మరొకటే ఆధారాలు కావు. ఆ నమ్మకాలు వట్టి అబద్ధాలు. ఆ అబద్ధాలు కవితావస్తువు కాగూడదు అంటాను అంటే ''సైన్సు తెలుసుకున్న 'నిజాలు' మాత్రమే కవిత్వములో ఉండా లంటావా'' అని అడుగుతారేమో! కాదు. సైన్సు వ్రాతలు కవిత్వము కాదు. నిజాలు మాత్రమే ఉండాలని కాదు నా ఉద్దేశము, అబద్ధపు సామగ్రిని తరతరాలుగా వాడేసుంటూ సంతుష్టి పడరాదని మాత్రమే. కవిత్వానికి లక్ష్యము సత్యము కాదు, మరి సౌందర్యము. ఈ సౌందర్య సాధనలో ఒక కవి చాతకపక్షులు వెన్నెలని తింటున్నాయః మొదట చమత్కరిస్తాడు. అదే పనిగా చూచేవారిని కూడా 'ఏం తినేసేటట్టు చూస్తున్నావు' అంటాము. అలాగే వెన్నెల పులుగులు పల్లటీలు కొట్టుతూ ఎగురుతూంటే చూసిన కవి 'చకోరికలు వెన్నెలవిందు చేసుకుంటున్నాయి' అంటాడు. మరొక కవి 'విరహాలమై సోకి వేడియే వెన్నెల వచ్చి వెన్నెలమ నులివెచ్చజేసి, కలువపువ్వుళ్ళ పిసాళించు వెన్నెల తనువు వెన్నెల రసాయనము గూర్చి' అంటూ పై కల్పననుంచి త్రాళ్ళు పేనుతాడు ఈ అలిక చెయ్యడానికి వెన్నెలని గాని, వెన్నెల పులుగుల్ని కాని చూడనే అక్కరలేదు. చకోరికలు వెన్నెలని తింటాయన్నది ఈ రకపు ఉపయోగాలవల కవిసమయము అయిపోతుంది. వెన్నెల సంగతి వచ్చినప్పుడలా ఈ కవి సమయము అవతరిస్తూంటుంది. సూర్యోదయానికి పద్మాలూ చంద్రోదయానికి కలువలూ వికసిస్తా యన్నది ఇంతే. ఇది పరమ సత్యం కాదు. ఒక కవి మొదట చెప్పినప్పుడీ వస్తువు ఇంపుగా ఉంటుంది ఆ తర్వాత ప్రతీ కవీ ఊదర గొట్టుతూంటే ఇవేవో సిద్ధ ఘటనలు అన్నట్టుగా వర్ణనలలో ఇవే దొర్లుకుపోతూంటాయి వీటి సౌందర్యము పొడచూపలేకపోవడముతో 'ఇవి అబద్ధాలు, నిజాలు కావు' అనే స్ఫురిస్తుంది. నేను అబద్ధా లన్నది ఈ దృష్టితో, అంతేకాని 'చంద్రముఖి' అంటే అది నిజము కాదు' అని వాదించే దృష్టితో కాదు కవి సమయాలు నా దృష్టిలో కవులు జాగ్రత్త పెట్టుకున్న తోలుబొమ్మలు. కథ ఏదయినా ఆ బొమ్మలే తెరమీద తాండవ మాడతాయి

'అలంకారములు' అన్న మాటలను బట్టే అవి సహజములు కావనీ తెచ్చిపెట్టుకున్నవనీ తెలుస్తుంది. కవిత్వములోని భావాలు చదువరులను జల్లుమనిపించడము సహజము, భావాలవల్ల కాకుండా కల్పనల వల్ల చదువరుల అనుభవాన్ని కాక మెప్పుదలను రేకెత్తించడము కవిగారి స్వార్థపరత్వానికి నిదర్శనము. కవిత్వమును చూచే అక్షరాస్యులు కొద్దిమందే ఉండి, రాజ్యాలు వేర్వేరైపోయి ప్రయాణ సౌకర్యాలు, పత్రికలూ లేని రోజుల్లో 'గడియకు నూఱు పద్యములు గంటములేక రచించ' డపు గొప్పనే ఎక్కువగా పూజించారు. ఆశ్చర్యమేమిటీ ? ఆ కవులు తమ కల్పనల్ని గుచ్చెత్తి తమగొప్పని ఇంకా పెంచకున్నారు. అలంకారాలు కవుల కల్పనలే. రానురానూ ఈ కల్పనలు కవిత్వపు సంపర్కము వదిలేసి తాముగానే నిలబడి ప్రదర్శించుకున్నాయి. గజేంద్రుడు ప్రవేశించిన కాసారమును వర్ణించారు పోతనగారు. ''వైకుంఠ పురంబునుం బోలి శంఖచక్రకమలాలంకృతంబై, భాగ్యవంతుని భాగధేయంబునుం బోలె గురు మకర కుళీర మీన మిధునంబై'' అంటూ ఇక్కడి పోలిక అందము స్ఫురింపజేసేటిది కానేకాదు మరి మాటలకు ఉన్న ద్విముఖాల్ని స్ఫురింపజేసేటివి. ఈ పోలిక కవిగారి వైదుష్యాన్ని ప్రకటించేటిదే. రామకృష్ణ కవి కాబోలు, ''ఘనకేశయని నీవు చెనకరాకు సమీర భుజగరోమాళి ఈ పువ్వుబోడి'' అన్న పద్యము చెప్పారు ఈ చమత్కారమూ, శ్లేషమీద ఆధారపడినదే. సౌందర్యము మీద కాదు. పెద్దనగారి ''మరున కొసంగకాలము .....'' ''జలజాగార పరంపరల్ ......'' వంటి పద్యాలలోని పోలికలు అందము సాధించడానికి కాదూ, చదువరులకు వర్ణించేదృశ్యము కళ్ళకు గట్టి వారిని తన్మయులను చేయడానికీ కాదు. ''అక్కడ అదీ ఇక్కడ ఇదీ, అక్కడి

దానికి ఇక్కడి ఇది ప్రతి'''' అని పోలికను సాధించిన మేధాశక్తి చదువరులకు కనబడడానికే పోలికలవల్ల వర్ణించబడినవస్తువు సౌందర్యము కాక, రంగూ, చలనమూ సంఖ్యామాత్రము స్ఫురిస్తే చదువరికి దాని అందము అనుభవానికి రాదు. కవి మేధాశక్తే స్ఫురిస్తుంది. ఒక వస్తువు, ఒక దృశ్యము, ఒక కథ వర్ణించేటప్పుడు నైసర్గికంగా కవికి ఉండే అభిలాష ఆ సౌందర్యాన్ని చదువరికి కూడా కళకు కట్టేటట్టు చెయ్యాలనీ, కావ్యము ఉపక్రమించేటప్పుడు పెద్దనాదులు "మనువులలో స్వారోచిషమను సంభవము .." ఇలాంటిదీ, అలాంటిదీ అని కథయొక్క గొప్పదనాన్ని వర్ణించడము మన మెరిగినదే కదా ? మరి వర్ణించేసందర్భాలలో మాత్రము కొంత తమ స్వంత పాండిత్యపు గొప్పను చూపించుకునే చాపల్యము అలాంటి వారిలో మెరిస్తే, 'అది కాలప్రభావమూ, ఆనాటి పరిస్థితుల ప్రభావమూనూ' అనుకోవాలి గాని, దాన్ని మడతపెట్టి అదీ కర్తవ్యమే అని వాదించుకోరాదేమో నంటాను.

అలంకారాలు కవిత్వానికి సహజములు కావు వర్ణనలో అలంకారాన్ని ప్రవేశపెట్టాడంటే, కవిగారు తన ప్రత్యేకానుభవములోని తునకనో, తన కల్పనాశక్తివల సాధించిన ఊహనో ఇస్తున్నా డన్నమాట "తారలో ఇవి కావు తారాపథాంభోధి కమనీయపులినసంఘములుగాని" అని శ్రీనాథు డన్నాడంటే "అంభోధిలో పులిన సంఘాలా ? ఎక్కడ నుంచి చూచాడబ్బా యీ దృశ్యాన్ని ? కాకపోతే నీలాకాశాన్ని నీలి సముద్ర మన్నాడు సరే, ఇసకతిప్పల్ని నక్షత్రాలహోదాకి తీసుకెళ్ళాడేమి చెప్మా ?" అని అనిపించింది నాకు ఆధునిక కవి ఒకరు "హృదయపుస్తకములో నదికింపబడిన, ప్రేమ గీతాలపుట్ట జింపివేయు బెటు ?" అన్నప్పుడూ ఇంకొకరు "జీవిత వనాంతరసీమల వశ్రువాహిని సైకతమందు హృత్పుమ విషాద దళమ్ముల జిమ్మి పోతివి భీకర కాళరాత్రి" అన్నప్పుడూ ఏమిటీ కట్టుడు అలంకారాలు ? అనిపించింది పరాభిగారు 'అమృతాంజనం పూసినట్లుంది, ..... నోరూరుతుందా నాకు . . ఊలక్సు కుషన్‌మీద చదికిలబడినట్లుంది" అని స్వానుభవాల్ని వర్ణనలలో ఇమిడ్చినప్పుడు సంప్రదాయజ్ఞులు నవ్వి ఉంటారు వారే "ఖండపరశుగళ కపాలగణముల కనుకొలకులలో ఒకటివలె చుక్క" అన్న పంక్తులు విని ఒప్పేసుకుంటారు ఇది సంప్రదాయాభిమానమే, చైతన్యవంతమైన దృష్టి కాదంటాను. అలంకార మంటూ వచ్చిందంటే కవిగారి పైత్యము ఇంచుకంత కృత్యములో దిగిందన్నమాటే నంటాను. (ఇక్కడ పైత్యము అన్న మాట వాడడములో నా ఊహను భూత అర్థము క్రింద పెట్టినట్లు చూపడమే నా ఆశయము). శ్లేష కవిత్వములో పాండిత్యపు గొప్ప చీటికీ మాటికీ పైకి లేచి కనబడుతూంటుందని రసికు లందరూ ఒప్పుకుంటారు. శ్లేష బంధ—, చిత్ర—, ఆశు—, కవిత్వాలు అన్నీ కవిగారి నేర్పుని ప్రకటించేటివే కావ్యము చదివేటప్పుడు కవిగారు చెప్పే కథే మన మనస్సులలో మెరవాలి గాని, చెప్పే కవిగారి గొప్ప మెరవరాదంటాను అలంకారాలు కవిగారి గొప్పని మెరిపించేటి సాధనాలు అంటాను.

నాటక ప్రదర్శనములో నటుడు కాక, ఆతడు ధరించే పాత్ర మట్టుకే ప్రేక్షకుల దృష్టిలో నిలవాలి. ఈ నటుడు గొప్పగా చేశారు అన్న అభిప్రాయము ఏర్పడిందంటే మొత్తపు నాటకము ఒక ఐక్య ప్రదర్శనముగా కాక ప్రత్యేక నటులవ్యక్తి ప్రదర్శనాల మూటగా తయారయింది అన్న మాట అలాగే కావ్యములోని వస్తువు అంతా ఒక నదివలె సాగవలెను గాని అధ్యాయాలు కలిపి కుట్టిన బొంత కాకూడదు. అలంకారాలు కావ్యాస్వాదనమును నిరంతరాయముగా సాగనీయక చదువరులదృష్టిని కవియొక్క గొప్పతనము వైపు తిప్పుతాయి. కనుక కావ్యశరీర క్షాళనము చెయ్యాలంటే అలంకారాలు విడి చేయాలంటాను.

అలంకారాలు బాగుండవా ? అంటే, వాటి ప్రత్యేకత వాటి పేరులోనే ఉంది. బాగుంటాయి కనుకనే స్త్రీలు వాటిని ధరిస్తారు. బాగుంటాయి కనుకనే కవులూ వాటిని వాడతారు. లేని సౌందర్యాన్ని నగలు వ్యక్తికి ఆరోపించినట్టే, కథాగమనసౌందర్యములేని చోట అలంకారాలు ఆ లోటుని కప్పేస్తాయి అందుకే, ప్రారంభంలోనే వాటిని గంగిరెద్దు బొంత అన్నాను. కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని రచన గమనించండి. ఆయన రాజశేఖర విలాసములో కథాసౌందర్యము లేదు. అంతా ఆయన పాండిత్య బల ప్రదర్శనమే. అలంకారమున్న రచనలు చూపి, "చూడండి, ఇవి బాగులేవా ? మరి వాటిని ఎందుకు వదిలేయా లంటారూ ?" అని ఏకదేశంగా వాదించడము అనవసరము. అలంకారాల్లో కవిగారి నేర్పు బాగా ఉంటుందనీ, అది కవి స్వార్థానికే ఉపయోగ మౌతోంది తప్ప చదువరి తన్మయత్వానికి ఉపయోగము కాదు. చదువరికి కావ్యకథా—, భావ—, అనుభవము కలిగించే పానకపు రచనలో అలంకారాలు పుడకలు కనుక, వాటిని వదలండి అంటున్నాను. పెద్దపెద్దవారి రచనలో కూడా కనిపిస్తాయి నిరర్థకాలంకారాలు. "వాసవ మణిద్యుతిచ్ఛటా భాసురంబు, చిక్కణతమాల దీధితి స్నిగ్ధముగ్ధమా కళిందసుతా తరంగాభిరామ మగు కైశికము" ఇంద్రనీలాలు, తమాల దీధితులూ, కాళిందీ తరంగాలూ ప్రబంధ కాలపు ఉత్ప్రేక్షలకు బాగా ఉపయోగమై పేలవమై పోయిన రుకు 'గదిలో చినుకుల వలె చీకట్లు' చాలా అల్లరి పోలిక 'కాషాయరవ్య వల్కల హుతాశన క్రియాసంపిహితాశ్వత్థసామిధేని' అశ్వత సామిదేని' దీప్తికంటే జాతి ఆధిక్యత గొప్పదనుకుంటాను. ఈ యక్ష కన్యకు 'హుతాశన సంపిహిత.. .సామిధేని ప్రాయుడూ ఈమెకు అధికుడూ కాక యక్షుడే ప్రియుడుగా లభించాడు వానికీ, కాషాయాంబరధారిణియై ఒక మెట్టు జారిన ఈమెకూ ఫలము శాతవాహనుడు ఇక్కడ కవిగారి ప్రత్యేక సాధన గోచరిస్తోంది 'ప్రబలనీరంధ్రాభ్ర జనిత గాఢధ్వాంత నిబిడ హేమంత రాత్రి కుంతలములలో చుక్కేలా? ఆ చుక్క యదాలాభము, సామాన్యము కాదు సామాన్యమైతేనే ఇక్కడరాణ కానప్పుడు కవి గారే జాణ, సన్నివేశము కాదు. "తియ్య ముయ్యేటి భ్రమల గొయ్యచా ముయ్యేడ మూగ కుండతూర దొరువు ప్రోగేను" పంట కాలువలోని రొయ్యలకు ముయ్యేటి తియ్యధుచి ఎప్పుడు అంటినదో భ్రమ లిగించడా ? "ప్రేమపిపాసచే నమృత వీథుల జెందిన సుందరాంగనా స్తోమ తావకుంతనతతల్" ప్రేమ పిపాస చేత అమృతవీధులు చెందే సుందరాంగనలూ? వారి అవకుంగనాలా తెలిమబ్బు దొంతరలూ? అమృతవీధులు చేరితే పిపాస అలాగే నిల్చిపోతుంది గదా? తీరడము ఎలాగ? 'పిపాసతో' అని కాబోలు కవి గారి అభిప్రాయము

చందస్సు కవిత్వానికి శృంఖలమా? అంటే, కాక ఇంకేమి? అని జవాబు. ఇన్ని శతాబ్దాలు చందోగొలుసుల గలలకు 'కవిత్వము' అని పేరు వచ్చి, గద్యంలో కవిత్వము 'ఉంటుందన్న' మూఢ నమ్మకము' మాత్రమే గాని గద్య కవితా విమర్శ పరిచయము—, ప్రశంస, ఒక్కటీ పొడచూపకుండా చేసిందే, అది అక్కర లేదంటే కొత్త యేలా? నన్నయగారూ, తిక్కన గారూ, పెద్దన గారూ వంటి కవులు పద్యాలు వ్రాయలేదా? వారి రచనకేమి లోటూ? అని ప్రశ్నలు వేలయున్నున్నారు మిత్రులు మనవి చేస్తున్నా అక్రోధనులై వినండి. పద్యాలలో కాక, పాటలలోనో, వచనంలోనో వ్రాస్తే వారి రచనలలో ఇప టికంటే గుణము ఉండి ఉండును. ఏమంటారా? అన్వయ వక్రత, వ్యర్థపదప్రయోగతా

విశేషణ బాహుళ్యమూ, సమాస వ్యామోహమూ విశేషించి సంస్కృత కావ్యాంధ్రీకరణము ఏమి కర్మము వచ్చిపడింది చెప్పండి.) మన సౌర స్యతానికి తప్పి ఉండును నన్నయ గారు చేసిన కన్నడ కావ్యానుకరణాలూ, తిక్కన గారి వాచ్య రచనలూ (భూపతి వారి 'భారతము తిక్కన రచన' అన్న పుస్తకములో చివరవిశేషణమున్న వృత్తాలు చూడండి. అలాటివి లెక్కకు మీరి ఉన్నాయి. తిక్కన భారతంలో.) మనకు తప్పి పోయి ఉండును. నిర్వచనోత్తర రామాయణము రచించి గొప్పలు పలికిన 'సమర్థుడు' ఆగద్దె దిగి చంపూరచన చేసెనన్నమాట గుర్తించండి పద్యాలువదలి ద్విపదలలో రచించిన పల్నాటివీర చరిత్ర వంటి కావ్యాలూ, మాత్రాఛందస్సులలోనే సాగిన రాఘవ కల్యాణము, ఋషుల ఆశ్రమము, సీతాదేవి ఆనవాళ్ళు, లక్ష్మణ మూర్ఛ, గుహభరతుల అగ్ని ప్రవేశమూ, ఊర్మిళాదేవి నిద్ర, కృష్ణ జననము, లక్ష్మీదేవి సొగటాలాట, వంటి) స్త్రీల పాటలూ (బాణాసురవిజయము, సారంగధర చరిత్ర, గంగా వివాహము వంటి పదములూ రసగుళికలు చిత్తగించండి పెద్దలు గాని ఈ వెన్నెల బాటలలో సాగివుంటే, ఆంగ్లవాఙ్మయము కంటే కనీసము నాలుగు శతాబ్దాలు ముందు పుట్టిన మన వాఙ్మయము అన్ని విధాలా దానికి తీసిపోకుండా ఉండి, భాషాంతరీ కరణాలను పట్టుకొనివ్రేలాడవలసిన దురదృష్టమును మనకు తప్పించి ఉండదా?

పద్యాలకు ఒక్కొక్క దానికీ ఒక విలక్షణమైన నడక ఉంది. తరతరాలుగా మన వారికి శిరోధార్యమైన "పద్యం పాడే అలవాటు" పద్యము యొక్క నడకను రాగంతో ముంచేసింది ఆ సంగతిని మరిచిపోకండి అంటున్నాను. ఆ కారణము వల్ల పద్యానికి ఉన్న విలక్షణగతి శతాబ్దాలుగా మరుగు పడి పోయింది, ఆ గతిని గురించి గొప్పలు చెప్పుకోడము సవ్యమేనా అని అడుగుతున్నాను మహాస్రగ్ధర రాగానికి లొంగదు కనక అది ఒక్కటి దాని గతిలో నిలిచిందేమో. యతి, పాదాంత విరతి అన్న శ్లోక లక్షణాలను వదలి సమాసాలతో పద్యచక్రాన్ని "విరుపులే లేకుండా నడపడము గొప్ప అయిపోయి, తెలుగు కవిత్వాన్ని సర్కసు ఫీటు గా తయారు చెయ్యలేదా అంటున్నాను

పద్యగతి బాగా జ్ఞాపకముంటుంది పద్యాలలోని మంచి ముక్కలు జ్ఞాపకముండి అనుకరణకి దారి చేశాయి. కొంతం నరసింహ కవి రచించిన బొబ్బిలి కథలో మూడు పాదాలకు రెండు చొప్పున దిగుబడి చేసి, దేనువ కొండ కవి ఒకరు గుజిలీ ' పెదబొబ్బిలి రాజా కథను తయారు చేశారు అది చతురశ్రగతి ఏకతాళపు రచన, ఎనిమిది ఆవృతాల పాదాలతో సాగింది. చందస్సు లేకుంటే అనుకరణ కష్టము.

చందస్సు చిరకాలంగా కవిత్వానికి బురఖాగా పనికివచ్చింది, కాషాయ వస్త్రము యాచనకి వలె నాలుగు అభినందన పద్యాలు వ్రాయడమన్నా, 'కవి' అన్న పేరు తగిలించుకోడమూను ఇక మొదలూ ప్రచారాలూ, కులాభిమానాలు, సన్మానాలూ ఇత్యాది ముఖ్యంబులూను మాటల్ని గణాలుగా బిగించ గల 'గణాచారి' (గణముల ఆచారి) కవియా? ఎన్ని పుస్తకాలు రచిస్తేనేమి తలగడాలుగా ఉపయోగించగలట్టివి? సద్య శాస్త్రాలు కావ్యములా? కావే! మనస్సుకు గతి బాగా హత్తుకుంటూందని వేదాంతమూ వ్యాకరణమూ, జ్యోతిషమూ వంటి శాస్త్రాల్ని కూడా పద్యాలలో వ్రాశారు మనపూర్వులు. అవన్నీ కావ్యాలు కావు గదా. నేడు అచ్చుకూటము వల్ల వేలకొద్దీ ప్రతులు వేయవచ్చునూ, జ్ఞాపకము పెట్టుకోనక్కరలేదు ఎవరూ. కనుక వాటికి పద్యమే అక్కరలేదు. కావ్యాలకు మట్టుకు ఏలా?

"ఏ వాఙ్మయమైనా పద్యాలలోనే ఉంటోంది" అన్నారొక యువక విమర్శకులు. లేదు, స్త్రీల వాఙ్మయమూ జానపద వాఙ్మయమూ పద్యాలలో లేవు. పద్యాలు కూడా మాత్రాఛందస్సులాధారంగా పుట్టినవే. కందార్థమూ, ఉత్పలార్థమూ, అన్న అర్ధ పద్యాలు దరువులుగా దింపడానికి వీలిచ్చినది 'వాటి' సమగతియే వాఙ్మయాలకు పాటముందూ, పద్యము తర్వాతా, వచనము ఆ తర్వాతను, పరిణత సాధనము పట్టండి అంటున్నాను ఛందస్సులేనిది కవిత్వము లేదనగలరా? విశ్వనాధ వారి 'ఏకవీర' నవల అనే మీరంటే జాలిపడతాను మిమ్మల్ని చూసి నేను వారి వేయిపడగలు, ఏకవీర, విశేషించి వారు దిద్దిన వక్రరేఖ కావ్యాలే, గద్య కావ్యాలు దిగుమర్తి సీతారామస్వామి గారు, చలం గారు గద్య కవులు విత్వానికి ఛందస్సు ఉండితీరవలసిన లక్షణ మనగలరా కొండముది వారు? అప్పుడు సాహసము నాది అవదు, వారిదే అవుతుంది

ఏ లక్షణాలూ, నిబద్ధము చేయని రచన ఎలాగుంటుందీ? అని అడుగుతారా? మనవిచేస్తున్నాను "చనినా రార్వురు చక్రవర్తులు మహీచక్రంబు పాలించి ధర్మనిరూఢిన్ జనినారు షోడశమహారాజు ల్మహేంద్రాభులై, చనుచో వారలు మూట కట్టుకొని యైశ్వర్యంబు గొంపోయిరే, యనఘా రాజ్యములేల వైభవములేల ధర్మముల్లేనిచోన్" ఒకటి

"మాయామేయ జగంబు నిత్యమని సంభావించి మోహంబునన్ నా యిల్లా లని నా కుమారుడని ప్రాణంబురడు నందాక యెంతో అల్లాడిన ఈ శరీర మిపుడింకుం గట్టెలుంగాలు చో, నా యిల్లాలును రాదు పుత్రుడును తోడై రాడు తప్పింపగన్" రెండు నా విల్లెక్కిడినప్పుడు నీవె చతురుజాడవౌట నిక్కము. మదిలో భావించి కంటి 'ఇతరుల కీవిక్రమ బాహుశక్తులెందును గలవే, మూడు. వీటికి చందస్సులేదను కోండి అదే అనిబద్ధ కవిత్వము మూడువేలు ఉదాహరణ లిస్తాను కావలిస్తే చందస్సున్నవే ఎందుకిచ్చారూ? అని అడుగుతారేమో మీరు అవి చదినవే కనక ఇతరా లిమ్మంటే విశ్వనాధ వారి వేయి పడగలు, ఏకవీర మీ ముందు పెడతాను కుప్పలు ఉదాహరణలు ఉక్కిరిబిక్కిరి చేయగలను విశ్వనాధ వారినైనా సరే వారి పద్యాలను దాటిపోయిన సొగసులు వారివచనాలనుంచి చూపించి.

అయితే ఈ నాటి వచన పద్యాలన్నీ అని బద్ధ కవిత్వాలే అంటారా? అని అడుగుతారేమో! కాదు చందస్సును కాదని నేటి కవులు ("నీ వెక్కదలచుకున్న రైలు" వంటి రూపకాలంకార రచనల్ని పాతగిల్లిన భావాల్ని వదలి ("నవమి చిలుక వంటి) అయోమయ రచనల్ని, వీరగీతాల్ని వదలి ప్రచార గాథల్ని, అందరికీ బోధ కాగల రచనల్ని వదలి ఎవరికీ అన్వయము కాని రచనల్ని చేస్తున్నారు. కవిత్వపు టుయ్యాల అటునుంచీ ఈకొసాకి ఊగింది ఈ కవులు కృతక మార్గాలు పట్టి కృతకృత్యులు కాలేరనీ అనిబద్ధ కవనము అంటే ఆలోచన, భాషా సంప్రదాయాలూ (వ్యాకరణ సంప్రదాయాలూ వేరు భాషా సంప్రదాయాలు వేరూను) కూడా కవనము కాదనీ మనవి చేస్తున్నాను ఈ నాటి రచనలు కొన్ని రచయిత కోసమే వెలసినట్టివి ఉంటున్నాయి, ఏదో చమత్కారమును బిగించినట్టే పోతున్నాయి. వాటికి కాలానినిలిచే పాటి బలము, విస్తృతి, లోతు ఏర్పరిస్తేగాని ఆకాశ పథంలో ఎగురుకుంటూ పోయే అడవి పావురాల వరస అవుతాయని హెచ్చరిస్తున్నాను. కవనము ఎంత ఎత్తు ఎగిరినా తోటి మానవుల దగ్గరకు వచ్చి వాలాలి. ఎటకో ఎటకో జలదాల దాటి వెళ్ళపోయే రచనలు దారము వదిలేసిన గాలిపటాలై పోతాయి.

క్యూబిజము, ఇంప్రెషనిజము, డాడాయిజము, స్ర్రియలిజము వంటి ఆధునిక చిత్రకళాసంప్రదాయాల్ని మన కవిత్వములోనికి తెచ్చే యత్నాలు జరిగేయి, అవి అనిబద్ధ కవిత్వాలు కావు. మొదటి మూడుటికీ విశేషోద్దేశాలు సాధనలూ ఉన్నాయి కనక అవి విశేషబద్ధాలు, అనిబద్ధాలు కావు. స్ర్రియలిజము ఒక వ్యక్తి యొక్క బహిరంతర తత్త్వాల మేళనమునుంచి ప్రత్యేక పరిస్థితిలో కారణ మాత్రమైన యత్నమువల్ల బయల్వెడలిన అభిప్రాయాలూ—, భావాలూ—,

మాటలా—, పొగ. వెలిగే హారతి కర్పూరపు బిళ్ళనుంచి వివిధ వక్రవ్యంజితముగా వచ్చే ధూమలతల వలె కవి మనస్సునుంచి నైసర్గికముగా వచ్చేది స్త్రియలిజపు 'రచన' కవి గానీ ఎవరట గానీ అనేశేది కవిత్వము కాదు. "వెడగున్ కాముకుడున్ కవీంద్రుడు మనోవిభ్రాంతి మూర్తుల్సుమీ" అన్న షేక్స్పియరు వాక్యము జ్ఞాపకము చేస్తూ, చదువరులకు తన అనుభవాన్ని కలిగించే యత్నము చేశేవాడు. కవి అని హెచ్చరిస్తున్నాను. ఏదో అని బద్ధంగా అనేస్తే అది కవిత్వము కాజాలదు. అని పిచ్చి వాడు కాని రచయిత పిచ్చి అయి, కామము పొడ చూపనీయని కాముకుని పలవరింత అయిపోతుంది. ఏదో వైచిత్ర్య సాధించే యత్నము తమాషాగానే పర్య వసిస్తుంది, దేశమంతా వ్యాపించిన "కడచునె ఎన్నడేనియు" "సునోసున" 'జాలము యేలనుర నీలమేఘశ్యామ' వంటి పాటల వలె వ్యాపిస్తే వ్యాపించనూ వ్యాపిస్తుంది. ఆ తర్వాత మరుగుపడిన పోతుంది. కవిత్వము దేశకాలాన బద్ధము కావాలి కనీసము ఉత్పన్నదశలో. కనక పైన చెప్పిన విచిత్రపు కవశికలు అనిబద్ధకవనము కాదం టూన్నాను

అయితే వచనములో వ్రాయమంటారా? అప్పుడు వచనానికీ కవిత్వానికీ తేడాయే ఉండదు. అన్నారు కొందరు "పద్యాన్నిరాగంతో పాడినప్పుడే అది పద్యం గా వినబడుతూంది చదివితే వచనం లాగానే ఉంటుంది" అనే వారున్నారు. వారి అభిప్రాయము తప్పు అన్న సంగతి గుర్తుంచుకో మంటున్నాను. ఎందుకు తప్పో కూడా గుర్తుంచుకోమంటున్నాను. అలాగే, కవిత్వమున్న వచనమూ కవిత్వము లేని వచనమూ వేర్వేరుగా గోచరించేస్తాయి అంటున్నాను నిగళబంధాలుగా లేని కవిత్వము రచించండయ్యా అంటే, "అది ఇలాగ ఉండదు, అలాగ ఉండదు" అని వాదిస్తారే, కవిత్వానికి లక్షణాలు కనిపించాలి గాని విధి నిర్వహణము కాదు కనబడ వలసినదీ అంటాను. ఈ విధులు ఖాత పూర్వములంటున్నాను. "పద్య వాఙ్మయ ములో నూటికి ఎనభై పాళ్ళు పద్య మాత్రస్థిత్యైన కావ్యాలయి పోయాయి మన వాఙ్మయము తేలిక్కై పోయిందే" అని జ్ఞాపకము చేస్తున్నాను

ఈ నాడు ఎవరు అనిబద్ధకవులూ అని అడిగితే అనిబద్ధకవిత్వములో పురాణ సదృశ రచనలూ కావ్య సదృశరచనలూ చేసిన విశ్వనాథ (గద్య,) సత్య నారా యణ గారిని, అనిబద్ధకావ్యోపన్యాసాలిచ్చే కృష్ణ శాస్త్రి గారినీ, చక్కని అనిబద్ధ ఖండ కావ్యాలు రచిస్తూన్న బాలగంగాధర తిలక్, కుందుర్తి ప్రభృతుల్ని చెప్పాను. గేయంలో దీర్ఘ కావ్యాలు వ్రాస్తున్న పుట్టపర్తి వారినీ, పద్యాలలో ఏ మాత్రమూ అన్వయవక్రత రానీని శివశంకర శాస్త్రి గారినీ చెప్పాను. రవీంద్రనాథ ఠాగూరుని చెప్తాను ఆయన అనిబద్ధకవిసార్వభౌముడు "ఈ కావ్యములో ఏమున్నదో నాకు తెలియ లేదని" ఆయన కావ్యాల్ని గురించి అనే వారు కొయ్య బొమ్మలాటలే చూడనేర్చిన వారు. శరజ్జ్యోత్స్నలో చలివలె ఆయన కావ్యాల్లో రసానుభవమ్ము చల గా తెలియకుండా కలుగుతుంది చుదువరికి

"ఇదుగో మళ్ళీ 'రసము' అంటున్నారే, 'ధ్వని' అని కూడా అంటారేమో! ఇవి పూర్వ కాలానివి కావా? ఇవి బంధములు కావా? అంటారా? కావు కానేకావు. ఇవి కావ్యానికి జీవమూ ధ్వనీని, ఇవి అలంకారాలు కావు. భావధ్వని వస్తుధ్వని అన్నని కొంతా, మరి కొంత అలంకార తత్వమును చూపించేటివైతే అవుతాయి. అయితే వాటి ద్వారా సహానుభూతి— రస సబ్రహ్మచారి— కలుగుతుంది కావ్యానికి ప్రయోజనమే అది ఆయెను! దాన్ని దాటి ఎక్కడి సాము చేయగలమూ? ధ్వని సాధనమాత్రము అంటాను నేను రసానుభూతికి రసధ్వనికి ఉదాహరణాలిచ్చి, వాటిని ధ్వని కాతా, లెక్క వేసుకునేటట్టు వాదించవచ్చు రసము వినా ధ్వని అలంకారప్రాయమే. అంతకెక్కువ కాదు.



# పల్లెపదాలు

శ్రీ వజ్ఝల కాళిదాసు

పారు సెలయేటిలో పల్లెపడుచు లదిగో
పవలు కష్టించి కోసిన పచ్చగడ్డి
కడుగుచున్నారు, సిగపూలు ముడులువీడి
పడగ, పయ్యెద కొంగులు తడిసిపోవ !

ఆలమంద లదిగో అతిమంద గమనమ్ము
లలరపోవు, తత్ఖురాగ్ర ఘాత
ధూళి ధూసరిత విశాల రోదోముఖ
మండలంబు కాంతి మాసిపోవ !

పసుల సాల వీడి పారివచ్చిన దూడ
అరపు వినబడగ పయస్విని మెల
మెల్ల మందవిడిచి చల్లగా పాలీయ
చెట్ల నీడలందు చేరి నిల్చు !

కంఠసీమ మువ్వ ఘల్లు ఘల్లున మ్రోగ
కట్టువిడిన దూడ గంతు లిడుచు
పరుగులెత్త, దాని బట్ట వెన్నాడుచు
పగలబడి హాసించు పల్లెపడుచు !

చెరువు నీటికొరకు చేరిన ఇల్లాండ్రు
మాటలాడుకొనుచు నీటు భాండ
ములను ముంచ పొడము బుడబుడమను ధ్వను
ల్లోన వారి నవ్వు లీనమగును.

వీధి నాటకమున విపిన వాటికలకు
నారచీరగట్టి నాథు వెంట
పడిన సీతజూడ పల్లియవారికి
కనులనిండ నీరు క్రమ్ముకొనును !

చెమ్మచెక్కలాడు చిన్నారి కన్నెల
కాలిగజ్జె లొకటి ఘల్లుమనును;
తప్పుచేసి యొకతె తబ్బిబ్బుపడ వారి
నవ్వులందు మల్లెపువ్వు లొలుకు.

రావిచెట్టు క్రింద రమ్యమ్ముగా కట్ట
బడిన తిన్నెమీద పల్లె పెద్ద

లెల్ల కూరుచుండి సల్లాపముల నాడు
కొనుచునుండ చెల్లె వినుము వింత !

కదలలేని మూడు కాళుల ముదుసలి
రాట్న మొకటి త్రిప్పి రాత్రి యెల్ల
ముగ్గు బుట్ట పండిపోయిన తల వంచి
పాలు పితుకునట్లు నూలు వడుకు !

ఒడలు మరచి తిరుగ నొవ్వల కవ్వల
నాడు పడుచు లెల్ల; అందమైన
వారి జడల వీడి పడి యెగిరిన పూలు
వారి చుట్టు విడయె వలయములుగ !

నిండు యవ్వనమున కండలు తేరిన
యురము విరుచుకొనుచు బరువు బండ
బట్టి యెత్తి విసరివైచుచు నున్నాడు
పల్లె యువకు డొకడు బలము కొలది

దూరమందు మావి తోటలలోనుండి
కోకిలమ్మ హాయి గూయుచుండ
పాడ నేర్చినట్టి పడతి యొక్కర్తె తన
గొంతు దానితోడ కూర్పజూచు !

అర్ధరాత్రిదాక ఆటల పాటల
పల్లె మునిగియుండ పసుల సాల
యందు నున్న పశువు లప్పుడప్పుడు తమ
కనుల విప్ప, మరల మునుగు నిద్ర !

భాగవతములోని పద్యాలు చదువుచు
బ్రాహ్మణుం డొకండు పారవశ్య
మనుభవించుచుండ అతివృద్ధు డొకరైతు
వినుచు తన్మయత్వమును వహించు !

భావి గూర్చిలేని వంతల బొందక
గతము తలచి మదుల కలత పడక
వర్తమానమందె భావంబుగల పల్లె
కలలులేని నిద్ర గాంచు తృప్తి.

తెల్లవారుముందె కోళ్ళు కూసిన యంత
ఆలు లేచి ఆవు పాలు పితుకు
చదులు చెవుల బడగ చప్పున మేల్కొను
నావులించుచున్ కృషీవలుండు !

---

# దత్తాత్రేయ వాఙ్మయము

శ్రీ నిడుదవోలు వేంకటరావు

తెలుగు సాహిత్యములో క్రైస్తవ శకవ పదునారవ శతాబ్దినుండి మూడు వందల యేండ్ల వరకు, దత్తాత్రేయ యోగియు నతని శిష్యగణమును ప్రవర్తిల్లజేసిన వాఙ్మయమునకు—దత్తాత్రేయ వాఙ్మయము అని పేరు ఈ వాఙ్మయ మింతవరకు నపరిశీలితమైనను, దీనిని మనము జాగరూకతతో పరిశోధించిన, మూడువిధములుగా దీని ప్రాముఖ్యము మనకు గోచరింప గలదు.

## మత సంప్రదాయము - సాహిత్యము

ఇంతవఱకు మన వాఙ్మయ చరిత్రలలో, శైవ వైష్ణవ భక్తి మతము అను గూర్చియే పరిశ్రమ జరిగినది జరుగుచున్నది కూడ—కాని యా భక్తి మతములతోడనే అనుస్యూతముగా వాఙ్మయమున నున్న అద్వైత వేదాంత మతసాహిత్యమును గూర్చి పరిశోధన జరిగినట్లు కానరాదు—ఈ దత్తాత్రేయ సంప్రదాయ మట్టి అద్వైతవేదాంతమునకు సంబంధించినది

## వాఙ్మయ చరిత్ర - సాహిత్య ప్రక్రియలు

ఆంధ్ర వాఙ్మయ చరిత్రను పరిశీలించిన, మనము నేడు, కృష్ణదేవ రాయ యుగము, కృష్ణదేవరాయానంతర యుగము అను నీ రెండు యుగము లకు నీ వాఙ్మయము సంబంధించినది—ఈ యుగములను కేవలము ప్రబంధ యుగములుగా మనము పరిగణించుచున్నాము—కాని యీ సంప్రదాయము ననుసరించిన, ఆ యుగమున, కావ్య ప్రబంధములే కాక, శతక, యక్షగాన, వచనసాహిత్య ప్రక్రియలు వ్యాప్తిలోనికి వచ్చినవి. నేడు తెలుగు వచన రచన దక్షిణాంధ్రవాఙ్మయముననే బుట్టినదని చెప్పుటకు నీ సంప్రదాయము లోని కవులు కూడ తోడ్పడుటయే కారణ మనవచ్చును.

## మహారాష్ట్రదేశ సంబంధము - మాహురము

ఈ సంప్రదాయమును ప్రవర్తిల్లజేసిన యోగులకు స్థానమైన మాహురము[1] నేడు మహారాష్ట్ర దేశమందున్నను, ఒకప్పు డది తెలుగు దేశములోని యొక భాగముగ నుండెననియు తెలియుచున్నది క్రీడాభిరామమున మాహురప్రశంస గలదు. తుళువ నరసరాజు మాహురమును జయించెనని వరహా పురాణమునగలదు ఇచటనే దత్తాత్రేయాలయము గలదు మహారాష్ట్రదేశమున నీ సంప్రదాయమునకు 'మహన్‌భాబ' (మహానుభావ) సంప్రదాయ మందురు. మహారాష్ట్ర వాఙ్మయ ప్రథమ ప్రవర్తకుడగు ముకుంద రాజము, నీ దత్తాత్రేయసంప్రదాయమును గూర్చి వివేకసింధువను వచన గ్రంథము వ్రాసియున్నాడు—అది తెలుగున కూడ ననువదింప బడినది. మహారాష్ట్రమునకు మనకు సంబంధము పండ్రెండవ శతాబ్ది నుండి యున్నట్లు పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము వలన తెలియు చున్నది క్రీ శ పదునారవ శతాబ్దినాడు దత్తాత్రేయ సంప్రదాయ మీ సంబంధమును బలపఱచినది తెలుగు కవుల మాహుర ప్రశంస యీ తరువాత చూడనగును—

మహారాష్ట్ర దేశమున మాహురమున దత్తాత్రేయాలయము లున్నను తెలుగు దేశమున నట్టి యాలయములు లేవు. తెలుగుదేశమున నెల్లూరి మండలమున దత్తాత్రేయః మఠ మొకటి యుండినట్లు నెల్లూరు మండల శాసన సంపుటముల[2] నుండి తెలియుచున్నది

---

1. ఈ మాహురము తెలింగాణాకు పశ్చిమమున—మహారాష్ట్ర సరిహద్దులలో నున్నది ఇప్పుడున. దీనిని చేరుట ప్రయాసమే—హైదరాబాదు నుండి ఔరంగబాదునకు పోవు చిన్న రైలులో నిజామాబాదునకు 65 మైళ్ళ దూరములో ఆదిలాబాదు గలదు. అంతవఱకును మోటారులో వెళ్ళవచ్చును. ఆదిలాబాదునుండి మాహురమునకు రమారమి ఏభయి మైళ్ల దూరము మంచి రోడ్డు లేదు ఆదిలాభాదు నుండి, విడసతోడ, దుంద్రి, ఉమ్రి మున్నగు 22 గ్రామములు దాటవలెను—ఈ ప్రదేశ మంతయు అరణ్యమయము మృగభయము కూడ నుండును—ఇచ్చట నొక శిథిలమైన కోట యున్నది ఇచ్చట జనసంఖ్య 1515 ప్రతిసంవత్సరము మూడు పర్యాయము లిచ్చట యుత్సవములు జరుగుచుండును అప్పుడు బిరారు ప్రాంతములనుండి 50,000 మంది ప్రజలు వచ్చెదరు

(విభూతి. పుండ్రము 2 రేఖ 2) పుటలు 122. 124.

2. దీని యింగ్లీయ భాషాంతరీకరణ మిది

**The changable Matham of the illustrious Dattatreyaswami, Who presides over the whole Universe, Who is paramahamsa, The excellant guru. Note. There is doubtless a Matham of a guru near this stone.**

Pramahamsa is a title by a Hindu sanyasi after a certain stage in spiritual progress.

ఆంధ్రకవి తరంగిణి. పదవ సంపుటము. పుట 182—183.

నెల్లూరునుండి చెన్నపట్టణమునకు బోవు రోడ్డు ప్రక్కను నెల్లూరు సమీపమున నొక శిలా శాసనము కలదు దానిపై నీ క్రింది మాట లున్నవి

శ్రీమద్విశ్వాధిష్ఠాపన పరమహంస సద్గురు దత్తాత్రేయ "స్వాములవారి ధర్మమతం." (నె శా సం 3 పుట. 821—822 )

దీనినిబట్టి దత్తాత్రేయుడను యోగిపుంగవు డొకడు నెల్లూరు ప్రాంతమున నొక మఠమును స్థాపించి అద్వైతజ్ఞాన ముపదేశించుచు, శిష్యులను, నా శాస్త్రి సంప్రదాయమున కవులుగా నొనర్చెనని తెలియుచున్నది.

## దత్తాత్రేయుఁడు - పౌరాణికము

దత్తాత్రేయుడు విష్ణ్వంశమున జన్మించినవాడనియు అత్రి ఋషికి అనసూయాదేవికి పుత్రుడని భాగవతమున కలదు అందే అత్రి సంతానము కొఱకు తపస్సు చేయగా, విష్ణువు ప్రత్యక్షమై నేను మీకు దత్తుడ నైతిని అని పలికె ననియు నందుచేత నాతనికి దత్తాత్రేయులని పేరు గలిగెననియు నందే కలదు—దత్తాత్రేయుడు యోగీశ్వరు డనియు—కార్తవీర్యారు న చక్రవర్తి యీతని శిష్యుడనియు మార్కండేయ పురాణమున గలదు. ఈ కథలు తెలుగున గల భాగవత మార్కండేయ పురాణములలో నున్నవి ఇవిగాక తెలుగు కావ్యములో పదునాఱవ శతాబ్దికి ముందు దత్తాత్రేయ ప్రశంస కలదు.

## భోజరాజీయము

అనంతుడు భోజరాజీయములో షష్ఠ్యంతములైన వెనుక నిట్లు వ్రాసి యున్నాడు

పుట 12 "భోజరాజ చరిత్ర—దత్తాత్రేయ మునీంద్రుడు వక్తయు మహుడను కాంభోజ మహేశుడు శ్రోతయుంగా గలది"

పుట 14 మరియు పురాకృత దోషమున శ్రోతకు కుష్ఠరోగము గలిగెను అప్పుడు దత్తాత్రేయుండను నామధేయంబుతో హేమకూట శైలం నారాయణదేవుం డున్నవాడు" ఆతని సేవింపుమను నుపాయమున చెప్పఁబడినది

పై రెండు చోట నే గాక, ప్రథమాశ్వాసముననే' మరియొకచోట దత్తాత్రేయ ప్రశంస కలదు

దత్తాత్రేయుం డిట నియె

"ఏను ప్రతి దివసంబును ప్రాత రుచిత కృత్యంబులు ప్రయాగ యందు జేయుదు—మాధ్యాహ్నికానుష్ఠానంబులు హేమకూట పర్వతంబున ననుష్ఠింతు, నిశాసమయ కృత్యంబులు శ్రీరంగధామమున నొనరింతు నివి నాకు నియమితంబులై చెలు త్రిస్థానంబులు—నాకు సత్ప్రీతి కరంబులు" పుట 16

గ్రంథాంతమున—

క దత్తాత్రేయ ప్రోక్తము
దాత్త సుకృత భోగ విశ్రుత సునీలికథా
యత్తంబై యితిహాసము
క్రొత్తగదే భూమి ననుచు కొనియాడంగన్ (7—250)

అని కలదు

కాని ఈ దత్తాత్రేయ యోగి, ప్రయాగ, హేమకూట, శ్రీరంగ స్థానముల నున్నవా డగుటచేత, ఈ వ్యాసమున నుదాహరింపబడిన దత్తాత్రేయ యోగికి నీతనికి సంబంధము లేదు మాహురిక్షేత్రమున దత్తాత్రేయ యోగి ప్రశంసలు గల తెలుగు కావ్యములు నిందు మొదట తెలిపి, యా వెనుక యాతని శిష్య పరంపర గ్రంథ రచనలు తెలుపుదును

## పింగళి సూరన - కళాపూర్ణోదయము

కళాపూర్ణోదయమున కథావైచిత్రియేగాని తక్కిన గ్రంథస్థ విషయములు విమర్శకుల నాకర్షించినటు లేదు అట్టివానిలో మాహుర క్షేత్రమును, దత్తాత్రేయ ప్రభావప్రశంసయు ముఖ్యములు ఈ ప్రశంసలకు మూల కథకు సూరనయే సంబంధము గల్పించినాడు

1. సుముఖాసత్తి జనకుడు—దేశాంతరి యయి తిరుగుచు,

సీ 'మాహురీ పురమున' కేతెంచి
యందు దత్తాత్రేయు నఖిలయోగ
విద్యా రహస్యకోవిదు మహామహుఁ దవ
శ్వర్యచే దనకు ప్రసన్ను జేసి
గీ కనియె దత్తప్రపచేత యోగ ప్రకార
ములు సమస్తంబు 5—132

2 మణికంధరుని మాటలు
"క్షితి దత్తాత్రేయ ందయ కృత్యము గలదే" 5—194

3 నృపాల వాక్యము—
దత్తాత్రేయ మహామునిని మాహురీపుర నిలయున్ 5—202

4 గీ కార్తవీర్యార్జునుడు చక్రవర్తి యగుట
నంత ఘనుడొట నాయోగి నాశ్రయించి
కాదె తద్రాజ కులజుఁడఁ గాన నేను
నమ్మునీంద్రు భజించితి నవ్విధమున 5—203

5 ఎ ఆ దత్తాత్రేయుం డంతట కలలోనం
గానిపించి
దత్తాత్రేయ శబ్దంబు
వినంబడుట నిది తెలిసి 5—204

పై యుదాహృతభాగముల బట్టి మాహురీపురము గొప్ప క్షేత్రమని, యోగాభ్యాసము గావించు మహాత్ము లచట చేరుతారు లగుదురనియు, అచటి దత్తాత్రేయస్వామి యోగి స్వరూపు డనియు, సూరన కాలమునాటికది మిగులు ప్రసిద్ధమైనదనియు నూహింపవచ్చును

సూరనకాలమున కించుక తర్వాతి కవుల కాలమున నీ మాహుర దత్తాత్రేయ ప్రశంసలు గలవు

## తరిగొప్పులమల్లన - చంద్రభాను చరిత్ర [3]

సూరన వెనుక మల న దత్తాత్రేయుని గూర్చి హెచ్చుగా జెప్పి యున్నాడు అతని చంద్రభాను చరిత్ర—దత్తాత్రేయునికే కృతి—కృత్యాదిలో తొలి పద్యమున (1—1

1 "దత్తాత్రేయ దివ్యాకృతినే శ్రీ లాలిత్యము గన్న
హారిం గొల్చెదన్" అని ప్రారంభించి యున్నాడు.
2 ఇష్టదైవతము దత్తాత్రేయుడే కాని— 1—10
3 దత్తాత్రేయ యోగేశ్వరు న్వరు గావింపదలంచి— 1—13
4 దత్తాత్రేయ మహాముని ముద్రా విభూషితము— 1—16
5 దత్తాత్రేయ సంస్పర్శనాక్షర యోగోన్నతి— 1—40
6 దత్తాత్రేయ యోగిశేఖర సేవామోదితుఁడ— 1—43

ఆ వెనుక 46 47 48, 49, 50 పద్యములు దత్తాత్రేయ ప్రశంస గలవి

7 షష్ఠ్యంతము లైదింటిలో 54 వ పద్యమున—
మహురపుర కృత వసతికి—అనియు,
'శ్రీ మాహుర నగరోన్నత' (2—1 అనియు,
మాహుర ప్రశంస గలదు

8 చంద్రభానుచరిత్ర యైదాశ్వాసముల ప్రబంధము ప్రథమాశ్వాసాంతమున నాలుగు పద్యము మిగిలిన నాల్గాశ్వాసాద్యంతములలో పదు

3 చంద్రభాను చరితము ప్రబంధ మాంధ్ర సాహిత్య పరిషత్తువారిచే రెండు పర్యాయములు ముద్రిత మైనను, విమర్శకులు దీనిని స్పృశించి నట్లే కానరాదు అప్పకవి యుదాహరించిన చంద్రికా పరిణయములోని దన్న "అంతట రుక్మబాహు వసుధాధిప నందన" అన్న పద్య మీ గ్రంథమున 3 వ ఆశ్వాసమున 108 పద్యముగా నున్నది ఇప్పటి వెంకటకవి యీ గ్రంథమునుండి లక్షణము లుదాహరించుటయే దీని ప్రాశస్త్యమునకు దార్కాణ ఇందు పంచమాశ్వాసమున సత్యేకముగ తిరుమలయాత్ర వర్ణన గలదు అది యా కాలమున విజయనగర రాజగు వీర వెంకటపతి రాయల వేంకటేశ భక్తి తెలుపును ఇందలి పలుకుబళ్లు కొన్ని నిఘంటువుల కెక్కలేదు. ఇట్టి వానిని గూర్చిన సమగ్ర విమర్శన అత్యంతావశ్యకములు.

వారు పద్యములు గలవు. మొత్తము పై ముప్పది పద్యము లిందు దత్తాత్రేయ ప్రశంసాపాదకములై యున్నవి. వీనిలో—దత్తాత్రేయు డత్రిమునియనసూయా దంపతుల పుత్రుడనియే గాక, యోగ విద్యా ప్రతిపాదకుడన్న విషయములు, విశేషముగా విస్తరింపబడి యున్నవి ఈ గ్రంథమున గల దత్తాత్రేయ స్వరూపవర్ణన మితరత్ర గానరాకుండుటచేత దాని నీ క్రింద పొందు పరచుచున్నాను.

సీ. నిజగర్భ జగన్నిచయ మారయు లీల
నంతర్ముఖాసాంగుఁడైన వాని
నలిన జాండావృత్తి నాభి వీధిని నేర్పు
రీతి నక్షసరంబు ద్రిప్పు వాని
శ్రుతు లాత్మలందు నిల్చుట దెల్ప తెరుగఁగ,
ననరుద్ధ నిశ్వాసుఁడైన వాని
తన పూనిన ధరిత్రికి నలోలత ఘటించు
పగిది జటిల వృత్తి పరఁగు వాని
గీ. ప్రాక్తన స్వీయ దామోదరత్వ మెఱుఁగఁ
జేయు గతి యోగపట్టికఁ జెలఁగు వాని
యోగ ముద్రైక సూచితావ్యయ చరిత్రు
డైనవాని దత్తాత్రేయ మౌనిఁ గొలుతు. (47 వ.)

## ముడియము వెంకటరమణకవి కళాధరోపాఖ్యానము

ఈ వెంకటరమణకవి— క్రీ శ 1650 ప్రాంతమున గండికోట దుర్గాధ్యక్షుడగు పెమ్మసాని తిమ్మానాయని కాలమున నున్నవాడు. ఈతడు తన కళాధరోపాఖ్యానమను ప్రబంధమును దత్తాత్రేయుని కంకితముగా గావించి యున్నాడు.

క. దత్తాత్రేయ పదాబ్జా
యత్తుడ విని వృత్త దేవతాంతర చర్యా
చిత్తుడ వైరాగ్యాదిగు
ణోత్త సముపేత మానసోదాత్తుండన్—

వ తెలియం గూడ దదేల జోలి యను బుద్ధిన్ మత్ప్రబంధంబుపై
నలతం జెంది భ్రమ ప్రమాదముల నైనన్ వేసరం బోకుఁడీ
నలవో నన్ను నిటు పూంచు నల దత్తాత్రేయ నారాయణుం
డిలమీ వంటి మహానుభావులకు దానీ యర్థముం దెల్పెడిన్.

షష్ఠ్యంతములలో,

క తత్తాదృశానసూయా
చిత్తా సారాత్మ బాల్య చిన్మయునకున్
హిత్తా సంధేయునకున్
దత్తాత్రేయునకు సజ్జన ధ్యేయునకున్

ఈ ప్రబంధమునకు చివర గద్య లేదు. ఈ క్రింది పద్యము మాత్రము గలదు

క ఇది శ్రీ దత్తాత్రేయా
భ్యుదిత యథోచిత కళాధరోపాఖ్యా
స్పద వెంకటరమణ కృతిన్
విదితం బఖిలంబు నొక్క విష్కంభమగున్.

కళాధరోపాఖ్యాన మముద్రితము. ఇందలి విశేష మేమనగా, ఇది నాటక ఛాయ వచ్చునట్లుగా నొక్కొక్క యాశ్వాస మొక్కొక్క విష్కంభముగా రచించెను పై పద్యమే విందలి విష్కంభములారింటియందు గలదు. ఈ వేంకటరమణకవి సంస్కృతమున రాధామాధవ కావ్యమును రచించినటు గా నీ గ్రంథమున జెప్పుకొన్నాడు.

క చేసితి రాధా మాధవ
మా సంస్కృత ధాటి నాటకాగమసంబున్
వ్యాక్తి నొక నాంధ్రము
జేసెద నొక కావ్య మతి విచిత్ర ధాప్తిన్ 4

దీనిబట్టి యీతడు తెలుగు నెఱవు సంస్కృత కవులలో నొక్కడని చెప్పనగును.

## మల్లారెడ్డి-షట్చక్రవర్తి చరిత్ర

కవుల చరిత్ర కెక్కిన మల్లారెడ్డి—తెలింగాణా యందలి బిక్కనవోలు పురాధిపతి ఈతని షట్చక్రవర్తి చరిత్రమున కార్తవీర్యార్జునుని కథ యందు దత్తాత్రేయ ప్రార్థన స్తుతి గావించి యున్నాడు ఆ స్తుతి యుదాహరణ సంప్రదాయము ననుసరించి,

### వృషభగతి రగడ

మధు నిశాచరవైరి నీవై మాహురిని నిద్రించువాడవు
నిన్ను గానగ జాల రెవ్వరు నిఖిలమును నీ వెంచఁగందువు
నీదు సలోకంబు లెల్లను నిల్పె శ్రీలను హెచ్చి యిప్పుడు
వేదములు నీకై తతుల్ పదివేల భంగుల నిచ్చు నెప్పుడు
భువి ముముక్షులు గాంతు రెంతయు బోధవృత్తిని నీవలన దాసులు
భక్తియుక్తులు నీకె గల్గగ బబలుదురు వైకుంఠ వాసులు
తొడరి సద్గుణతతులు నీ యందున వసించె ప్రభావ నీరధి
విడని భక్తి యొసంగి నను రక్షింపవే కరుణాపయోనిధి !
నీ మహామహిమంబు పొగడగ నేర్తునే యజ్ఞాన హృదయుడ
స్వామి దత్తాత్రేయ లోక నివాస లసదసమాన సదయుడ

ఇందు, ప్రథమ, డు—ద్వితీయ, ను—తృతీయ చే—చతుర్థి కై—పంచమి, వలన—షష్ఠి—కు—సప్తమి—అందు—సంబోధన—కలవుగాన—ఉదాహరణ లక్షితమైనది

ఈ షట్చక్రవర్తి చరిత్ర యిప్పటికి రమారమి డెబ్బదేండ్ల క్రిందట ముద్రితమైనది ఈ రెడ్డి కవీంద్రుని సోదరులు ఎల్లారెడ్డి, కామిరెడ్డి యను వారు వీరు మొగలాయి చక్రవర్తి యగు అక్బరునే సమ్మానితులు—పట్టమెట్ట సోమనాథకవి సూత సంహితను నీ సోదరులలో కామిరెడ్డికి కృతి నిచ్చెను

## వేగినాటి కొండయ

దత్తాత్రేయ యోగి ష్టదైవముగా నారాధించిన కవుల కొండయ కవి యొకడు ఈతడు వేకంధుపునే గాక, ముక్తి కాంతాపరిణయము దత్త యోగీంద్ర శతకము అను రెండు గ్రంథములు రచించియున్నాడు.

1 ముక్తికాంతా విలాసము—మూడాశ్వాసముల ప్రబంధము. కవి దీనిని దత్తాత్రేయానుగ్రహమున డెబ్బది రెండు దినములలో రచించినాడట. ఆతనికే యీ గ్రంథ మంకితము

క. శ్రీ దత్తాత్రేయుల మును
సొదరమున నానతిచ్చు చాడ్పున డెబ్బై
మీద మరి రెండు నాళ్లకు
మోదంబున నీ ప్రబంధమును నెరవేర్చెన్.

గద్యలో శ్రీ దత్తాత్రేయ గురు ప్రబల కృపాలబ్ధ కవితా విచిత్ర అని యుండుటచే కవి పై సంప్రదాయము వాడని స్పష్టము (సంఖ్య 891)

2 దత్త యోగీంద్ర శతకము. ఇది యొక సీసపద్య శతకము—"చిర శుభాకార యోగ లక్ష్మీ విహార సాంద్ర రుచిధుర్య దత్త యోగీంద్రవర్య" అను మకుటము. ఈ క్రింది పద్యము వలన శతక విషయము స్పష్టపడును.

సీ. పరతత్త్వ వాచ్యార భావంబు లన్నియు
వేర్పఱ నొక్కొక్క విధము గాగ
సీస పద్యంబులు చెలువొంద శతకంబు
చెప్పితి సత్కవి శ్రేష్ఠు లలరి

4. మదరాసు—ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వివరణ సూచిక ప్రబంధములు శృంగార ప్రబంధములు—రెండవ సంపుటము, సంఖ్య 434. పుటలు, 530—533—(1921)

జరగ దత్తాత్రేయ గురు సంకితంబుగా
నా పేర్చు విధమున పద్యముగను
వేగినాటి కులాబ్ధి విధుడను బండ్ర వ
ల్లి వ్వయుడను నాగయ ప్రధాన
గీ. సుతుడ శ్రీవత్స గోత్రుడ సుకవి కొండ
ధన్యుడ వెలయ నా చంద్ర తారకముగ
చిర శుభాకార మోక్ష లక్ష్మి విహార
సాంద్ర రుచిధుర్య దత్త యోగేంద్రవర్య. (సంఖ్య 27
పై రెండును సముద్రితములే—

## దత్తాత్రేయ శిష్యగణము రచనలు

### 1. ప్రథమ పరంపరం




ఈ పరంపరలో మనకు లభించినవి రెండు వచన గ్రంథములు అందు మొదటిది

### వేదాంత వ్యవహారసార సంగ్రహము

ఇది దత్తాత్రేయ యోగి రచించిన వచన కృతి వ్యాసకృతమగు బ్రహ్మ సూత్రములకు శంకరాచార్యుల శారీరక భాష్యమునకు నిది సంగ్రహరూప మగు తెలుగు వచనము రచన వ్యావహారికము.

### పరమానందబోధ ప్రకరణము

ఇదియు నద్వైత వేదాంత ప్రతిపాదక గ్రంథమే యినను దత్తాత్రేయ యోగి యోగి దీనిని—మొదట మహారాష్ట్ర భాషలో రచించి, యా వెనుక దానిని సంగ్రహించి, తెలుగున సూత్రప్రాయముగా చేసెను ఆ సూత్రములను మొదట దాసగోసాయి'' అను తన శిష్యునికి తెలుగులోనే యుపదేశించెను ఆతడు దానిని వివరించి గోపాలభటను తన శిష్యునకు గ్రంథరూపముగా బోధ యొనరించెను గోపాలభటు సర్వ దేవుడను తన శిష్యునకు తాను తిరిగి బోధించెను

ఈ క్రింది గ్రంథాంత గద్యలు పైవానికి ప్రమాణములు

1. ఇతి శ్రీ దత్తాత్రేయ యోగి విరచితే, వేదాంత వ్యవహార సార సంగ్రహం సమాప్తమ్.

2. ఇది దాస గోసాయీ విరచితాయాం పరమానంద బోధ ప్రకరణం నామ ప్రథమ ప్రకరణం—ఇత్యాదిగా నైదు ప్రకరణములందు గలదు 5

### ద్వితీయ పరంపర




ఈ పరంపరలో ద్వితీయుడగు పరమానందతీర్థుడు దత్తాత్రేయ శిష్యగణములో నద్వితీయుడు వీరశైవ వాఙ్మయమునకు పాల్కురికి సోమనాథు డెట్లో దత్తాత్రేయ వాఙ్మయమునకు పరమానంద తీర్థు డట్టివాడు. ఈతనికి 'పరమానందయతి' యను నామాంతరము గలదు. ఈతని తరువాత వారిలో మూడు, నాలుగైదు శిష్య గణమువా రీతని స్తుతించుటయే, యీతని ప్రభావప్రసిద్ధులకు తార్కాణ ఈతని కృతులను నాలుగు వర్గములుగా విభజింపవచ్చును.

1. శతకము. ఈతడు రచించినవి మూడు శతకములు మనకు లభ్య మగు చున్నవి. మూడును కందపద్య శతకములే.

1. సంపంగిమన్న శతకము—'సంపంగిమన్నా' అను మకుటము. దక్షిణదేశమున తంజావూరి యొద్ద నున్న మన్నారుగుడి చంపకారణ్య క్షేత్రము సంపగి—చంపక శబ్దభవము—మన్నారు—అచటి రాజగోపాలస్వామి

2. శివముకుంద పరమానంద శతకము—పేరే మకుటము-హరిహరాద్వైత ప్రతిపాదకము.

3. దత్తాత్రేయ శతకము. దత్తాత్రేయా అను మకుటము. పూర్వము దస్తూరీ కుదుర్చుట కిందలి పద్యములు వరవడిగా వ్రాయించేవారు.

ద్విపద—

1. అనుభవ దర్పణము—వేదాంతానుభవము వివరించు' నాలా శ్వాసముల కృతి

2 శివజ్ఞాన మంజరి—'శివజ్ఞానము'' అను పేరితో ప్రారంభ మైనను నిది యద్వైత జ్ఞానమును బోధించును. ఈ రెండు ద్విపద కావ్యము లును—తన గురువైన దత్తాత్రేయునకే నంకితము గావించియున్నాడు

3 యక్షగానము

'ముక్తికాంతా పరిణయము'' అను యక్షగానము పరమానంద యతీంద్రుని కృతి ఇది సంస్కృత ప్రబోధచంద్రోదయము ననుసరించి వేదాంత మితివృత్తము గలది పురుషుడగు జీవుడు ముక్తి కాంత యని స్త్రీని పెండ్లాడుట వర్ణితము

4. వచనము—ఆంధ్ర వచన వాఙ్మయమున పరమానందయతికి ప్రముఖ స్థానము గలదు ఈతని వచన కృతుల వివరణము—

1 వేదాంతవార్తికమను నుపదేశ క్రమము ఈ గ్రంథము తమిళ భాష లోనికి పరివర్తన మైనదన్నచో దీని ప్రశస్తి తెలియగలదు

2 బ్రహ్మవిద్యా సుధార్ణవము 6 ఇది యీతని కృతులలో నెల్ల పెద్దది ఇందు 13 ప్రకరణము లున్నవి (1) పంచీకరణ నిరూపణము (2) పంచ నటనా వైచిత్రి నిరూపణము, (3) నైవర్త నివర్త భావ నిరూపణము, (4) సగుణ నిర్గుణ నిరూపణము, (5) భేదాభేదా ఖండ నిరూపణము (6) వాక్యత్రయ నిరూపణము, (7) బ్రహ్మాండ నిరూపణము, (8) జీవన్ముక్తి నిరూపణము, (9) సద్భావ ప్రమాణ నిరూపణము, (10) వాసనా లక్షణ నిరూపణము, (11) వాసనాఖ్య నిరూపణము, (12) పంచ ప్రయోజన నిరూపణము, (13) జీవన్ముక్తి నిరూపణము

ఈ గ్రంథమున, శ్రుతి స్మృతి, పురాణేతి హాసములనుండి అద్వైత సిద్ధాంతమున కనువగు, పంక్తు లుదాహృతము లైనవి

3. ఉత్తరగీత—ఇది మహాభారతాశ్వమేధ పర్వముననున్న ఉత్తర గీతకు వచనానువాదము

4 వివేక చూడామణి ఇది మూడు పరిచ్ఛేదములలో నున్నది

(1) వేదాంత సిద్ధాంతము—ఇందు చతుర్వేదోపనిషద్వాక్యముల వివరణ మున్నది.

(2) శైవ సిద్ధాంతము— ఇది ఆగమాదుల నుండి శివాద్వైత సిద్ధాంతము వివృతమైనది.

(3) బ్రహ్మాండ రచన విచిత్ర సిద్ధాంతము.

---

5. చూడుడు ఆంధ్ర వచన వాఙ్మయము పుటలు 38—41, 42) పై గ్రంథములు రెండును సముద్రితములే. మదరాసు (ప్రస్తుతము తిరుపతి) ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునం దున్నవి వీనియం దిచ్చిన యుదాహరణములు—పై వచన వాఙ్మయమున నా యా పుటలలో గాననగును

6. ఇది మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారిచే ముద్రితమైనది.

ఇందలి వచన రచన తెలుగే యైనను గద్య—సంస్కృతమున నున్నది, ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజ కాచార్య పరమానంద —యతి కృతము.

వివేక చింతామణి ..... . పరిచ్ఛేదః

## సదానందయోగి

ఈతడు సదానందయోగి శతకమును రచించెను నవ్యతర్క భోగి 'శ్రీ సదానందయోగి' అని మకుటము ఇందు దత్తాత్రేయ వేదాంతము వివరింపబడినది.

## చల్లా సూరయ

ఈతడు, సంస్కృత ప్రబోధ చంద్రోదయము ననుసరించి తెలుగున "వివేక విజయము" 7 అను నాటకము రచించెను. ఇందు నాయకుడు వివేకేంద్రుడు నాయిక ఉపనిషత్కాంత—

## ఈశ్వర ఫణి భట్టు

ఈతడు పరతత్త్వ రసాయనము అనునైదాశ్వాసముల వేదాంత గ్రంథమును పద్యరూపమున రచించియున్నాడు. 8 ఈతడు సదానందయోగి శిష్యుడు.

## తృతీయ పరంపర

దత్తాత్రేయ యోగి
|
పరమానంద తీర్థ
|
ధేనువుకొండ తిమ్మయ్య
|
మల్లన — (ముమ్మడి)
ముమ్మడి మల్లన

ఈ పరంపరలో తిమ్మయ రచిత గ్రంథములు లభ్యములు కాలేదు అతని శిష్యుడగు మల్లన ప్రసిద్ధుడు — ఈతని కృతులు నాలుగు

1. తత్త్వచంద్రోదయము—ద్విపద—అలభ్యము.

2 రామస్తవరాజము. ఇది మూడాశ్వాసముల పద్య కావ్యము ఇందుతారక అమనస్క, రాజయోగములను యోగవిద్యాత్రయమునుగూర్చి వివరణ గలదు—ఇది రమారమి నూరేండ్ల క్రిందటనే ముద్రిత మైనది

3 ముక్తికాంతాప్రియ శతకము—

ఇది ముమ్మడి రాజకృష్ణ ఘన మల్లా ముక్తికాంత ప్రియాయను మకుటము గలది

మొదలు—

శా. 9 శ్రీ కారుణ్య మహానుభావ విజయశ్రీ ......
శ్రీ కళ్యాణ నిజాశ్రితాభిమత శ్రీ వేద వేదాంత వి
ద్యా కౌతూహల భోగ మోక్ష సుఖ దీర్ఘాయుల్ దయన్నిమ్మిటుల్
మాకున్ ముమ్మడి రాజకృష్ణ ఘన, మల్లా ముక్తికాంతాప్రియా

శా శ్రీమద్ధేనువుకొండ తిమ్మగురునిన్ శ్రీరామ పట్టాబ్ధి షే
కామోదంబున బోధ ...... దానుగ్రహా
శ్రీ మూర్తిన్ సురవాని నాత్మను మదిన్ సేవించి యోగీశ్వరుల్
స్వామ ముమ్మడి రాజకృష్ణ ఘను మల్లా ముక్తికాంతా ప్రియా!

మ. ధరలో సద్గురు సంప్రదాయుడగు దత్తాత్రేయ యోగీంద్రుచే
పరమానంద మునీంద్రుఁ డాత్మ గురుడై బ్రహ్మస్వరూపోపదే
శరమన్ ధేనువుకొండ తిమ్మనికి నిచ్చల్ మెచ్చుగా నిచ్చె యా
పురుష శ్రేష్ఠు నిపూర్ణ బోధను జగత్పూజ్యుండనై యుండు ని
ట రయన్ ముమ్మిడి రాజకృష్ణ ఘను మల్లా ముక్తి కాంతా ప్రియా

కృష్ణ శతకము 10 ఇది కందపద్య శతకము

"కృష్ణ సచివుని మల్లా" అను మకుటము ఇందే బదేడు పద్యములు మాత్రమే లభించినవి. మచ్చునకు రెండు పద్యములు.

క తుద మొదల లెఱుగని చదువులు
చదివితిమను ఛీమి చదువు సద్గురు కృపచే
ముదితుండై మది నిండిన
చదువే చదువెల్ల కృష్ణ సచివుని మల్లా.

క బంగరు నిగ్గులగలఁ బ్రబ
వాంగన భ్రూమధ్యమందు వలువగు దానికి
అంగజు కేళిం దనిపిన
సంగతి ముక్తెల్ల కృష్ణ సచివుని మల్లా.

ఆంధ్ర కవితరంగిణి—10 యవ సంపుటము 192—196 పుటలలో మల్లన కవి రామస్తవరాజము తత్త్వ చంద్రోదయము పేర్కొనబడినవి గాని తక్కినవి పేర్కొనబడలేదు పై రెండు శతకముల యందును వేమనవలె మల్లన తన్ను తా సంబోధించుకొన్నాడు

## చతుర్థ పరంపర

దత్తాత్రేయయోగి
|
పరమానందతీర్థ
|
ధేనువుకొండ తిమ్మయ
|
చింతల లింగగురుడు
|
యోగానందుడు

ఈ పరంపరలో యోగానందుడు మాత్రము అవధూతయై ఆత్మైక బోధ గురు శిష్య సంవాదము అను రెండు ద్విపదకృతులు రచించెను చింతల లింగగురుని తన గురువుగా పేర్కొనెను

## పంచమ పరంపర

దత్తాత్రేయయోగి
|
పరమానందతీర్థ
|
ధేనువుకొండ తిమ్మయ
|
చింతలలింగ
|
యోగానందుడు
|
తిమ్మగురుడు
|
రామబ్రహ్మేంద్రుడు
|
కంభముపాటి నారప

ఈ పరంపరలో యోగానందుని తరువాత వారిలో తిమ్మరామ బ్రహ్మేంద్రులు రచనలు చేయలేదు. రామబ్రహ్మశిష్యుడు కంభముపాటి నారప్ప భగవద్గీతలను పద్యకావ్యముగా రచించియున్నాడు

7 ఈ గ్రంథ మముద్రితము తంజావూరి పుస్తక శాలలో నున్నది.

8 దీనిని మదరాసు విశ్వవిద్యాలయమువా రచ్చువేసి యున్నారు.

9 ఇది అముద్రితము సంఖ్య 987 ఆరవ సంపుటము

10. ఇది 1536 సంఖ్య—శతక వివరణ సంపుటము—ఇవి రెండును మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రకటితములు.

## షష్ఠ పరంపర

దత్తాత్రేయయోగి
|
జనార్ధన
|
ఏకోజనార్ధన

ఈ పరంపరలో జనార్ధనయోగి జీవ ప్రబోధము అను పద్యకావ్యము రచించియున్నాడు ఇది వేదాంత విషయకమే. నాల్గాశ్వాసములు గలది. గ్రంథము ముద్రితము.

## సప్తమ పరంపర

దత్తాత్రేయయోగి
|
జనార్దనుడు
|
ఏకోజనార్ధనుడు
|
నరహరి మహేశుడు
|
వాగోజీరామగురుడు
|
కోనేరుగురుడు
|
మహాదేవగురుడు
|
పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి

నే డాంధ్రదేశమున వేదాంత వాఙ్మయమునకు శిరోభూషణముగ నున్న సీతారామాంజనేయ సంవాదము రచించిన పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి యీ పరంపరలో కడపటివాడు. సీతారామాంజనేయ సంవాదము వేదాంతముననే కాక సాహిత్యమున కవుల చరిత్ర కెక్కినదే. ఇది బహుళ ప్రచారమున నుండుటచేత విశేషములు వ్రాయలేదు

## కాల నిర్ణయము

పింగళి సూరన దత్తాత్రేయయోగిమాహాత్మ్యము వీనిని గూర్చి చెప్పిన మొదటి కవి సూరన కాలము క్రీ శ పదునారవ శతాబ్ది పూర్వార్ధము అనగా క్రీ శ 1550 సీతారామాంజనేయ కర్త కాలము. క్రీ శ 1850 ప్రాంతము అనగా మూడు వందల యేండ్ల వాఙ్మయము వర్తిల్లినది పై కవులలో ముమ్మడి మల్లకవి రామస్తవరాజము కూడ వీరి కాలనిర్ణయమునకు తోడ్పడుచున్నది. తంజావూరి పుస్తకశాలలో నున్న రామస్తవ రాజము—క్రీ శ 1684—1710 నడుమ పాలించిన శహాజీ కాలమున నొక ప్రతి వ్రాయబడినది గావున మల్లన క్రీ శ 1650 ప్రాంతమునకు పూర్వుడు—గురు శిష్యులు సమకాలికులైనను పై కాల నిర్ణయమునకు విపర్యాసము గలుగబోదు ఇది స్థూల నిర్ణయము సాధనాంతరములు లభించిన నింకను సూక్ష్మముగా నిర్ణయించుటకు వీలు కలుగును

ఈ దత్తాత్రేయ వాఙ్మయమును గూర్చిన కవులు వారి గ్రంథములింకను చాలగా పరిశీలింపవలసి యున్నది ఒక్కొక్క కవిని గూర్చి ప్రత్యేక ప్రత్యేకముగా లోకమునకు వెల్లడింపవలసినవి హెచ్చుగా నున్నవి నేటి కవుల చరిత్రలో వీరిని గూర్చిన విషయములు స్వల్పముగా నున్నవి సాహిత్య చరిత్రలో వీరికి గల స్థానమును గూర్చి—ప్రత్యేకముగ వేదాంతవాఙ్మయమును గూర్చి—కాలాంతరమున స్థలాంతరమున చర్చించెదనని మనవి సేయుచు నీ వ్యాసము ముగించుచున్నాను

## శ్రీ దత్తాత్రేయయోగి శిష్యగణ సంపూర్ణ వంశవృక్షము

దత్తాత్రేయ యోగి

(1)
- దాసగోసాయి
- |
- గోపాల భట్టు
- |
- సర్వదేవుడు

(2)
- పరమానంద తీర్థుడు
- |
- సదానందయోగి
- | ఈశ్వరఫణి భట్టు — చళ్లా సూరయ

(3)
- పరమానందతీర్థుడు
- |
- ధేనువుకొండ తిమ్మన
- |
- మల్లన

(4)
- పరమానందతీర్థుడు
- |
- ధేనువుకొండ తిమ్మయ
- |
- చింతలలింగ గురుడు
- |
- యోగానందుడు

(5)
- పరమానందుడు
- |
- ధేనువుకొండ తిమ్మయ్య
- |
- చింతలలింగ గురుడు
- |
- యోగానంద డు
- |
- తిమ్మగురుడు
- |
- దామ బ్రహ్మేంద్రుడు
- |
- కంభముపాటి నారప

(6)
- జనార్ధన
- |
- ఏకోజనార్ధన

(7)
- జనార్ధన
- |
- ఏకోజనార్ధన
- |
- నరహరి మహేశ
- |
- వాగోజీరాము
- |
- కోనేరుగురు
- |
- మహాదేవగురు
- |
- పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి

# ప్రయోగము - దాని స్వరూపము

డా॥ సి. నారాయణరెడ్డి

సంప్రదాయముపై జరుగు మార్పే ప్రయోగము. (Experiment) ఈ ప్రయోగము మూలమునకు మెరుగులు దిద్దునది కావచ్చును, లేక మూలచ్ఛేది కావచ్చును మూలమునకు మెరుగులుదిద్దు ప్రయోగమే ఆదరణీయము సత్ప్రయోగము లన్నియు మూల లక్ష్యము నందుకొనుటకే ప్రయత్నించును చాసరు మహాకవి తన కుమారునికి వ్రాసిన లేఖలో "Diverse pathes leaden diverse folks the righte way to Rome" అని ఈ విషయమే వ్యక్తపరిచెను రోమును చేరుకొనుటకు విభిన్న వ్యక్తులకు విభిన్నమార్గము లుపకరించునని భావము కాళిదాస మహాకవియును రఘు వంశములో సరిగా ఇట్టి అభిప్రాయమునే వెల్లడించెను

"బహుధాప్యాగమైర్భిన్నాః పంథానస్సిద్ధిహేతవః
త్వయ్యేవ నిపతం త్యోఘాః జాహ్నవీయా ఇవార్ణవే" ద్వాదశసర్గము)

గంగా సంబంధమైన బిన్నప్రవాహములు సముద్రునిలోనే కలియునట్లు వివిధ సిద్ధాంతములకు భగవంతుడే గమ్యుడని పై శ్లోకములోని అభిప్రాయము ఈ అభిప్రాయములు ప్రయోగములు లక్ష్యసిద్ధిని నిర్దేశించుచున్నవి ఒకానొక సంప్రదాయముపై తిరుగుబాటు ఏ విధముగా జరుగునో Lowes ఇట్లు చెప్పెను "మృతప్రాయమైన సంప్రదాయములు వీధిలోపడి కీచుమనుచున్నపుడు వాని నెదుర్కొనుటకు మూడు మార్గము లున్నవి ఒకటి కవులు తామే సంప్రదాయములను సృష్టించుకొనవచ్చును. లేక మిన్నకుండవచ్చును. రెండు మృతస్థితిలో నున్న వట్టి గుల్లలపై తమ సృజనాత్మకశక్తితో మరియొక రూపు కట్టవచ్చును మూడు ప్రాత నాణెము లిక చెల్లనేరవని ఉద్ఘాటించి తిరుగబడి క్రొత్త నాణెములు ముద్రింపవచ్చును.'1 ఈ మూడు మార్గములలో చిరకాలమునుండి 'ఎదుగు బొదుగు' లేక జివ చచ్చిన సంప్రదాయమున క్రొత్త ఊపిరు లూదుటయే ఉత్తమమైనది ప్రాత నాణెమును త్రోసివేసి (కరుగబోసి) క్రొత్త నాణెమును సృష్టించునట్టి ప్రయోగము జనులను చకితుల నొనర్చునే కాని సంప్రీతులుగా జేయలేదు ఈ ధోరణిలో సాగిన పలు ప్రయోగములు ప్రజాదరణకు దూరమై పోయినవి "ఒకానొక నూత్న సాహిత్యోద్యమము (Literary (experiment of movement) రాత్రివేళ దొంగవలె ఎవరి కంటబడకుండ ప్రారంభ మగునని, ప్రాత మర్యాదల నుల్లంఘించుచు,పూర్వాచార పరాయణుల కెదురొడ్డి నిల్చి క్రమముగా ప్రజాభిమానమును చూరగొనున"ని మార్టిన్ గిల్కిస్ (Martin gilkes) అభిప్రాయపడినాడు 2 నిజమే క్రొత్తలో ప్రతి నవ్య ప్రయోగము వింతగా కనుపించును. కాల నికషమే అది ఇత్తడియో పుత్తడియో తేల్పివైచును ఎంతటి సంప్రదాయాత్మక ప్రయోగమైనను కొంతకాలము వరకు మచ్చికచేయని జవనాశ్వము వలె నుండును. క్రమముగా దాని జూలు దువ్వి మోర నిమిరి మచ్చిక చేసినచో అది సాధువైపోవును ఏ ప్రయోగ మైనను ఘటోత్కచుని యౌవనము వలె సద్యోజనితము కాదు. దాని కెక్కడో ఒకచోట ఆధారముండి తీరును. కొన్ని ప్రయోగములు కాలవ్యత్యాసముతో విస్మృతి గర్భమున కలసిపోయిన మృత సంప్రదాయములనుండియే పునర్జన్మము పొంది వచ్చును మరికొన్ని దేశాంతరమునుండి రూపు (Label) మార్చుకొని దిగుమతి యగును. గాఢమైన ప్రతిభకలవాడు చేసిన ప్రయోగము మాత్రము అనతికాలముననే సంప్రదాయముగా రూఢమగును. అంతేకాదు. ప్రాత విషయములే ప్రతిభావంతుని చేతిలో బడి నవ్యతను పుంజుకొనుట కూడ లేకపోలేదు. For the Old will perennially become new at the hands of genius. That is the paradox of the art, and likewise the reconciliation of conservation and revolt"3 మానవ జీవితమున కార్య ప్రతికార్యములు ఏవిధముగా ప్రాణిహృదయ చలనమువలె ఒకపరి ముకుళించుకొని, ఇంకొకపరి వికసించునో అట్లే తిరుగుబాట్లెల్లప్పుడు సంభవించుచుండునన్న Lowes అభిప్రాయ మెంతో సమంజసమైనది. 4

## భారతీయ మత సంస్కృతులలో ప్రయోగములు

వేదకాలమునుండి గంగానదివలె ప్రవహించుచున్న హిందూ మతమును సంస్కరించుటకు మధ్య మధ్య కొందరు మహానుభావులు ప్రయత్నించుచునే యున్నారు జీవన్మత మేదియైనను దానికి సంస్కరణము తప్పదు ప్రయోగముల కెడ మీయలేని మతము మృతప్రాయము గొడ్డుటోకవలె ఎదుగు బొదుగు లేని ఏ మతము కూడ జనాభిమతమును చూరగొనజాలదు. అందుచేత మతసంస్కృతులలో ప్రయోగములు ఆదినుండి చేయబడుచునే యున్నవి

వేద మంత్రములలోని నిరాడంబరమైన దేవతాభక్తికి బదులుగా బ్రాహ్మణముల కాలమున కర్మకాండ ముదిరినది యాగములు యాంత్రికముగా మారిపోయినవి వీనిపై ఉపనిషత్తులు మెత్తని తిరుగుబాటు చేసినవి వేద మంత్రములలో సూచనప్రాయముగా నున్న అద్వైతభావముల నుపనిషత్తులు పెంపొందించినవి. బాహ్యకర్మాచారములను నిరసించినవి ఇహసుఖములను పూర్తిగా త్రోసిరాజని తత్త్వానుభూతిని, ఆత్మసాక్షాత్కారమును పరమలక్ష్యములుగా గ్రహించినవి కావున ఉపనిషత్తులు భారతీయ సంస్కృతి రంగవలో క్రొత్తదారి త్రొక్కె ననవచ్చును.

ఉపనిషత్తులలో అంకురించిన సర్వసమానత్వబీజములు క్రమముగా బౌద్ధమతమున రెమ్మలు తొడిగినవి పురాణయుగములోనే సర్వసమానత్వముకొరకు సంఘర్షణలు జరిగినవి. వశిష్ఠమహర్షిని ఘనీభూత సంప్రదాయములకు ప్రతినిధిగా తీసికొనవచ్చును విశ్వామిత్రుడు వానిని సడలింప జేయుటకు బద్ధకంకణుడైన రాజర్షి. ఆర్యులకు మాత్రమే వేద విజ్ఞానము పరిమితమై యుండవలెనని వశిష్ఠుడు వాదించెను విశ్వామిత్రుడు అది సమస్త జనులకు సమభోగ్యమని పట్టుబట్టెను. తరువాతికాలమున రామానుజాచార్యుడు శూద్రులను, పంచములను చేరదీసి వారిని 'ఆళ్వారులు' గా సంభావించెను తెలుగ నాట 'పలనాటి చాపకూడు' ప్రసిద్ధమే కదా! వీర శైవ మతము గూడ కులభేదములను కూల్చుటకు నడుము గట్టినది తరువాతి కాలమున రాజారామమోహనరాయలు హిందూ మతమును సంస్కరించుటకు శంఖమెత్తిన మహాపురుషుడు. ఆనాదిగా ప్రవహించుచున్న హిందూ

---

1 Convention and Revolt In poetry (P. 142)

2 A Key to Modern English poetry

3 Convention and Revolt In poetry (P. 94)

4 There will always be revolt in poetry, so long as action and reaction play their systole and diastole in life, (Convention and Revolt In poetry).

మత స్రోతస్విని కీత డెదురీదుటకు ప్రయత్నింపలేదు దాని గమనములో కించిత్తుగా మార్పుచేయుటకు మాత్రము ప్రయత్నించెను చిరకాలమునుండి ఆచరణలో నున్న సహగమనాది అంధవిశ్వాసములకు వ్యతిరేకముగా ఉద్యమము లేవనెత్తెను. దయానందసరస్వతి సంస్కరణ పతాక మెత్తిన మరియొక మనీషి ఇతడు మారుచున్న కాలమున కనుగుణముగా వేదార్థములను సంస్కరించుకొనవలెనని ఎలుగెత్తి చాటెను. అపౌరుషేయములని భావింపబడు వేదములకు సరిక్రొత్త వ్యాఖ్యానము చేయుట మతరంగములో జరిగిన క్రొత్త ప్రయోగము తన కాలమునాటి గ్రుడ్డి నమ్మకములను పారద్రోలి భారత వైభవమును పునరుద్ధరించుటకు ఇతడు ఆర్యసమాజము ద్వారా ప్రయత్నించెను 5

భారతసంస్కృతికి ప్రధానాంగమైన వర్ణవ్యవస్థలో గూడ అనేక నవ్యప్రయోగములు జరిగినవి హైందవమత మేనాడును అంతర్వర్ణ వివాహములను ప్రోత్సహింపలేదు. పైగా వర్ణసాంకర్యము మహాపాపమని గీతలో చెప్పబడినది. కాని, మనువు తనస్మృతిలో అనులోమ విలోమ వివాహములను పేర్కొనెను. ఉచ్చవర్ణస్థులు అవర వర్ణస్త్రీని వివాహమాడుట అనులోమము అవరవర్ణ పురుషుడు ఉచ్చవర్ణ స్త్రీని వివాహమాడుట విలోమము ప్రాచీన భారతకాలమున ఇవి ప్రబలముగా నున్నట్లు ఆధారములు కలవు. వ్యాసుడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు అనులోమ వివాహములవలన జన్మించినవారే. సూతుడు క్షత్రియునివలన విప్రకన్యకకు పుట్టెను ఇతడు విలోమవివాహ ఫలితమునకు దృష్టాంతము.

ఈ విధముగా మతసంస్కృతులలో జరిగిన ప్రయోగముల ప్రభావము సాహిత్యముపై పడక తప్పలేదు భారతీయ మతసంస్కృతులలో ప్రయోగములు జరిగినట్లే పాశ్చాత్యదేశములలో గూడ జరిగినవి గ్రీసులో Poletheism (బహుదేవతాత్వము), రోములో Pagapyism (ప్రకృత్యారాధనము) ఒక కాలమున ప్రబలముగా నుండెడివి వీని ప్రభావము ఇంగ్లండుపై ఉండెడివి క్రమముగా మధ్యయుగములందు, అనగా క్రీస్తు జననముతో మరల మత విశ్వాసము మోసులెత్తినది రానురాను 'చర్చి' కి ప్రాధాన్యము హెచ్చినది పోపు హైల్డ్ బ్రాండ్ (Pope Hilde Brand) 1070 ప్రాంతమున ప్రపంచములో అన్నిటికంటె ఉన్నతమైనది చర్చి' యని ఉద్ఘాటించెను రాజ్యాధికార మెవరిదను విషయమున ఆనాటి చక్రవర్తియైన నాల్గవ హెన్రీకి పోపునకు సంఘర్షణము జరిగెను చివరికి చర్చి ప్రతినిధియైన హైల్డ్ బ్రాండ్ గెలుపొందెను మహారాజకన్న మతము గొప్పదని ఈతడు చేసిన ప్రబోధము కొంతకాలము వెలిగిపోయినది

## భారతీయ సాహిత్యములలో ప్రయోగములు

భారతీయ సాహిత్యములలో (భాషలలో) సంస్కృత సాహిత్యమే అతి ప్రాచీన మైనది అన్నిటికన్న సంపన్నమైనది భారతదేశములోని సమస్త భాషా సాహిత్యములపైన దీనిప్రభావ మున్నది. ఒక్క తమిళముపై మాత్రము కొంచెము తక్కువగా నున్నదని చెప్పవచ్చును. భారతీయ భాషలన్నియు సంస్కృతభాషా సాహిత్య మర్యాదలనే పాటించినవి అందుచేత ప్రధానముగా సంస్కృతసాహిత్యములోని ప్రయోగములే యిచ్చట చర్చింపబడును. తెలుగు సాహిత్యములోని ప్రయోగములగురించి ఈ వ్యాసమున చర్చింపలేదు.

చందస్సు —వైదికఋక్కులు మాత్రాచ్ఛందస్సులో వెలువడినవి. వానిలో గురు, లఘు నియమములేదు ఋగ్వేదములో గాయత్రి, అనుష్టుప్పు మొదలైన చందస్సులు ప్రయోగింప బడినవి మకుటముల ఆవృత్తి (శతకములలో వలె) ఋగ్వేదములోనే కనిపించును వైదిక ఋక్కులపై ఛందో విషయకముగా చేసిన సరిక్రొత్త ప్రయోగము వాల్మీకిరామాయణము ఈ కావ్యమునకు ముందు అనుష్టుప్ చందస్సు కథా కథనమునకు, కావ్యరచనకు ఉపయోగ పడలేదు వాల్మీకి తన కావ్యమును "తాళ బద్ధాక్షర సమం, తంత్రీలయ సమన్వితం,, కావ్యమేతన్మయాకృతం"6 అని చెప్పుకొన్నాడు. లౌకిక వాఙ్మయమున ప్రప్రథమముగా ఛందస్సులో నిర్మితమైన కావ్యము వాల్మీకి రామాయణమే. "ఆమ్నాయానామ్నాతనోయం ఛందసామవతార." అని భవభూతి ఉత్తరరామచరిత్రమున వాల్మీకిరామాయణము యొక్క నూతనత్వమును ప్రసాదించినాడు తదనంతర కవులీ ఛందస్సులో అసంఖ్యాక కావ్యములను రచించిరి

వాల్మీకి తరువాత ఛందస్సులో గొప్ప నవ్యత చూపినవాడు కాళిదాసు. కాళిదాసు అనుష్టుప్పును త్రోసివుచ్చలేదు దానిని కథాకథనమునకు మాత్రమే పరిమితము చేసెను కరుణరసమునకు వియోగిని యను క్రొత్త చందస్సు నుపయోగించెను మందాక్రాంత వృత్తములో రచన చేయుట కాళిదాసు చేసిన మరొక నూత్నప్రయోగము విప్రలంభశృంగారపోషణకు మందాక్రాంతమును సమర్థముగా నడిపిన కవి యీతడు. మందాక్రాంత వృత్తములో విరతులు (యతులు) ఎక్కువ. ఇది మందముగా, భారముగా నడచును. విప్రలంభ శృంగారమునకు సైతము విరతులు బహుళముగా నుండుటవలన ఈ వృత్తమునకు ఔచిత్యము ఏర్పడినది మందాక్రాంతములో ఈతడు మేఘసందేశము వ్రాసెను. ఇతని ప్రయోగమే తరువాతి కవులకు సంప్రదాయమైనది. సందేశకావ్యము లన్నియు ఎవరు వ్రాసినను మందాక్రాంతములోనే వ్రాసిరి ధోయీ కవి పవనసందేశము, వేదాంతదేశికునిహంససందేశము ఇందుకు నిదర్శనములు

కాళిదాసు తరువాత భవభూతి అతని మార్గము ననుసరింప లేదు విప్రలంభమునకు మందాక్రాంతముగాని, కరుణరసమునకు వైతాళీయమును గాని అతడు స్వీకరింపలేదు పై రెండు రసములకు శిఖరిణీ వృత్తమును ప్రయోగించి తన స్వేచ్ఛాప్రియత్వమును కనబరచెను జయదేవుడు గేయ ఛందస్సులో కావ్యము వ్రాసి గొప్పప్రయోగములు చేసినాడు

వస్తువు —ఇతివృత్తముతో నాడుకొనిన మొదటి కావ్యము వాల్మీకి రామాయణము. అందులోని వస్తువు ఐతిహాసికము వాల్మీకి తరువాత కాళిదాసే వస్తువరణములో చక్కని ప్రయోగములు చేసెను ఇతని మేఘసందేశములోని వస్తువు కేవలము కల్పితము ఇందులో నాయికానాయకుల పేరులు సైతము సూచింపబడలేదు ఉత్పాద్యమైన వస్తువుతో కావ్యము నిర్మించుట కాళిదాసు చేసిన అపూర్వప్రయోగము. ప్రేమికుల సందేశములకు, ప్రణయ వేదనలకు కావ్యరూపమిచ్చిన తొలి కవి కాళిదాసే అతనికి ముందు మహాభారతములో హంససందేశమున్నది రామాయణమున హనుమత్సందేశమున్నది అంతవరకెందుకు? ఋగ్వేదములోనే ఒక సందేశమున్నది 'సరమా అను పేరుగల దేవశుని ఆడు కుక్క) ఇంద్రుని దూతికయై 'పణి' యను ఒక జాతి మానవుని దగ్గరకు వచ్చును. ఇంద్రునితో అతడు యుద్ధము చేయుట తగదనియు, ఇంద్రుని గోవులను తిరిగి అతనికి ఇచ్చివేయుట సమంజసమనియు సంధి కార్యము నడుపును ఇది వాఙ్మయరంగములో ప్రథమ సందేశము. ఐనను పై 'సందేశము' లన్నియు గౌణములు కావ్యాంతర్గతములు మేఘసందేశమే మొట్టమొదటి స్వతంత్ర సందేశ కావ్యము కాళిదాసు ఋతుసంహారముకూడా వస్తురీత్యా గొప్ప ప్రయోగము. ఋతువులపై స్వతంత్రముగా వెడలిన మొదటి కావ్యము ఇది

పాతదెల్ల గొప్పకాదనియు, క్రొత్తయెల్ల రోతకాదనియు కాళిదాసు స్పష్టముగా వ్యక్తీకరించెను అతడు బుద్ధిపూర్వకముగానే క్రొత్త ప్రయోగములు చేసెను. కాళిదాసు వ్రాసిన ఈ క్రిందిశ్లోకమువలన అతని ప్రయోగప్రీతి స్పష్టమగును

"పురాణ మిత్యేవ నసాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యమ్

---

5 His principal achievement was the unsealing of the Vedic lore—the perennial well-spring of Indian spirituality and culture—which more of his predecessors had ever dreamt of doing

—Vision of India by sisie Kumar Mitra

6. వాల్మీకి రామాయణము.

నంతః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః ''(మాళవికాగ్ని మిత్రము)

పురాణ మనగానే ఎప్పుడో ఒకప్పుడు క్రొత్తదేయని అభిప్రాయము 'పురానవం భవతీతి పురాణం' అని యాస్కుని నిర్వచనము ఎప్పుడో క్రొత్తదైనంత మాత్రమున ఈనాడు సాధువైన దెట్లగును ఇదే కాళిదాసు చెప్పినది నవీనమైనంత మాత్రమున గర్హ్యము కాదని అతని అభిప్రాయము కాళిదాసునకు ముందు కొన్ని కావ్యములలో ''తు, హి, చ, స్మ, హ, వై,'' లు విపరీతముగా నుండెడివి వీనిని పరిహరించి, వాగర్థములను పార్వతీపరమేశ్వరులను వలె మేళవించి, కావ్యములు ధ్వని ప్రధానముగా, సమర్థముగా వ్రాసిన మొదటి కవి కాళిదాసే

సద్వస్తువును మాత్రమే తీసుకొని కావ్యములు వ్రాయవలెనని ప్రాచీనాలంకారికులు అభిప్రాయపడిరి 5 వ శతాబ్ది ఆలంకారికుడు భామహుడీ విషయమున ఇట్లభిప్రాయపడెను.

''సర్గబంధో మహాకావ్యం మహతాం చ మహచ్చయత్
అగ్రామ్య శబ్ద మర్థం చ సాలంకారం సదాశ్రయమ్'' కావ్యాలంకారము — (ప్రథమ పరిచ్ఛేదము)

కథాశరీరము సద్వస్తువును ఆశ్రయించి యుండవలెనని భామహుని మతము అతని తరువాతి ఆలంకారికు లెల్లరు కావ్యము సద్వస్త్వాశ్రయముగా నుండవలెనని బలపరిచిరి కథాశరీరమునందు అధర్మాత్మకములైన అంశములు తారసిల్లనచో వానిని పరిహరింపవలెనని సూచించిరి

''ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాఽననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యాప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః '' ధ్వన్యాలోకము —తృతీయోద్యోతము)

ఇతివృత్తగతములైన అనుకూల సంఘటనలను తీసి వేయవలెనని, మధ్య మధ్య అవసరమైనచో క్రొత్త సన్నివేశములను కల్పించి కథను రసవంతముగా చేయవలెనని ఆనందవర్ధనుని అభిప్రాయము. ఈ సంప్రదాయము ప్రకారముగా సద్వస్తువు మాత్రమే వర్ణ్యమని రూఢియైనది కాని దీనికి విరుద్ధముగా కొందరు కవులు తిరుగుబాటు చేసిరి అసద్వస్తు భరితములైన కావ్యములను, నాటకములను రచించిరి. ప్రహసనము, ప్రకరణము, భాణము, లఘుకథలు మొదలగు ప్రక్రియలలో అనేకములు ఆ సద్వస్తువరనకు ఉపయోగింపబడినవే భగవదజ్జుకము, పాదతాడితకము మొదలైన ప్రహసనములలో వేశ్యలకు, జూదరులకు సంబంధించిన జీవితము చిత్రింపబడినది

రసము — సంస్కృతములో ఆదికావ్యమైన రామాయణము కరుణ రస ప్రధానమైనది కాళిదాసు శృంగారమునకే అగ్రతాంబూలము నిచ్చెను. అశ్వఘోషుడు కేవలము శాంత రసప్రధానమైన రచనలు చేసెను. భవభూతి కాలము నాటికి శృంగారరసము రసరాజముగా ప్రతిష్ఠ సంపాదించుకొన్నది. భవభూతి దీనిపై క్రొత్త ప్రయోగము చేసెను కరుణరస మొకటే రసమని ఉద్ఘోషించెను.

''ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్ పృథగి వాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా
నంభోయథా సలిల మేవ హి తత్సమస్తమ్'' 7

సమస్తరసములు కరుణరసమునకు అంగప్రాయములనియు, అవి ఆ మహారసమునకు వికృతులు మాత్రమే అనియు భవభూతి అభిప్రాయము ఆంగ్లములో షెల్లీకవి సైతము ఈ అభిప్రాయమునే వెలిబుచ్చెను 8

కావ్యస్వరూపము —లాక్షణికులు మొదట మహాకావ్యమును ఖండ కావ్యమును, మాత్రమే ప్రస్తావించిరి. ఈ రెండు ప్రక్రియలకు భిన్నమైన ప్రయోగమును సంస్కృత సాహిత్యములో అమరకుడ సమర్థముగాచేసెను అదిముక్తకము. ముక్తకముగా ఒకే ఒక్క శ్లోకముతో కూడుకున్న రచన. ఇతరశ్లోకములలోని భావముతో దీనికి సంబంధముండదు. ప్రతి శ్లోక మొక ప్రత్యేక కావ్యమవలెను. కావ్యము సరిమాణమును బట్టి పెద్దదిగా ఉండవలెనని తనకు ముందు స్థిరపడిన అభిప్రాయమును అమరకుడు పరాస్తము చేసెను. ఒక్క చక్కని శ్లోకమైనను కావ్య గౌరవము పొందగలదని నిరూపించెను. "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న విశ్వనాథుని సూక్తి ముక్తకమునే బలపరచుచున్నది అమరుకునిచేత ప్రారంభింపబడిన ఈ ముక్తకము క్రమముగా సంప్రదాయమై పోయినవి భర్తృహరి, బిల్హణుడు మున్నగు కవులు అనేక ముక్తకములను రచించిరి.

మొట్ట మొదట సారిగా గద్యములో మహాకావ్యమును రచించిన వాడు బాణుడు. అతనికి ముందు గద్యములో రచనలున్నను వాని కంతగా గౌరవనీయమైనస్థానము లేకుండెడిది. 'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆభాణకము బాణుని తరువాత బయలుదేరినదే. ఇతని ప్రయోగసాఫల్యమునకు ఇది యొక మచ్చుతునక ఇతతని ప్రయోగమును దండి మున్నగు మహాకవులనుసరించిరి బాణుడు వ్రాసిన హర్షచరిత సంస్కృతమునందున లభ్యమైన మొదటి చారిత్రకమైన నవల యని చెప్పవచ్చును ఇంగ్లీషులో స్కాట్ (Scott) ఇట్టివి పెక్కులు వ్రాసెను

అర్థాలంకారములు —సంస్కృత సాహిత్యమున అలంకారము లసంఖ్యాకములుగా నున్నవి. వానిలో నుండి కొన్నిటిని మాత్రమే ఏరి కొందరు బహుళముగా ప్రయోగించిరి

కాళిదాసు ఉపమాలంకారమును విరివిగా వాడుటవలన తరువాత దాని ప్రాధాన్యము పెరిగిపోయినది క్రమముగా ఉపమ సర్వాలంకారములందు దాక్షీపదవి నధిష్ఠించినది తరువాతికవులలో పలువురు ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము మున్నగువానిని గ్రహించిరి. సుబంధుడనుకవి శ్లేషాలంకారమును ప్రధానముగా స్వీకరించిరి 'వాసవదత్త' అను కావ్యము రచించెను.

''ప్రత్యక్షర శ్లేషమయ ప్రబంధ
విన్యాస వైదగ్ధ్య నిధిః కవీనాం''

అని తన్ను తాను పొగడుకొనెను కాని, ఇతనిప్రయోగము కేవలము ప్రయోగముగా నిలచిపోయినది. శ్లేషలు విధిగా ప్రయోగింపవలసిన అక్షర మున్నందున కావ్యము రసభంగమునకు, అనౌచిత్యమునకు పాల్పడినది తరువాతి కవులు ఇతనిప్రయోగమును ప్రమాణీకరింపలేదు ఈ విధముగానే పరిసంఖ్య, విరోధాభాసము మొదలైన అలంకారములను ప్రధానముగా స్వీకరించి కొందరు కావ్యరచన చేసిరి. విరోధాభాసమును, పరిసంఖ్యను బహుళముగా కావ్యములలో ప్రయోగించిన ప్రథమ కవి బాణుడని చెప్పవచ్చును.

శబ్దాలంకారములు —సంస్కృత కావ్యములలో తొలిసారిగా భారవి ఏకాక్షరీ, ద్వ్యక్షరీ, త్ర్యక్షరీత్యాది చిత్ర కవిత్వమును, బంధ కవిత్వమును, కిరాతార్జునీయములో ప్రవేశపెట్టెను ఈ ప్రయోగము కేవలము 'స్వాంత స్సుఖాయ' అనియే చెప్పవచ్చును ఇది కావ్యశోభ నినుమడింప జేయలేదు. అందుకే ఆలంకారికుల దృష్టిలో ఈ ప్రయోగము అధమ శ్రేణికి చెందినదిగా పరిగణింపబడినది. చిత్ర కవిత్వము సద్య పరనిర్వృతికి వ్యవధాయకము. అందుచేత ఇది క్షుద్రకవితామార్గములలో చేర్చబడినది కావ్యముయొక్క పరమోద్దేశ్యము 'సద్యః పరనిర్వృతి' కదా ! ఈ మూలోద్దేశ్యమునకే విరుద్ధముగా తలయెత్తిన ప్రయోగము మూడు నాళ్ళకన్న ఎక్కువ ఎటు నిలుచును ?

కవి సమయములు —సంస్కృతసాహిత్యమున కవిసమయములు నిర్మితములై యున్నవి. కొందరు కవులు అప్పుడప్పుడు వానిని కాదని కొన్ని నవ్యప్రయోగములు చేసినారు

కనులను కలువలతోనో, కమలములతోనో పోల్చుట కవి సమయము. దండి మహాకవి రాగరూషితయగు అవంతి సుందరి యొక్క నేత్రమును 'ప్రౌఢకదళీ కుడ్మలమువ' 9 అని ఉపమించెను కదళి యనగా అరటిపువ్వు. అరటిపువ్వుతో కన్నును పోల్చుట ఒక క్రొత్త ప్రయోగమే ఈ కావ్యములోనే

---

7 ఉత్తరరామచరిత్ర తృతీయాంకములో తమసయను నదీ దేవత చేత అనిపించినాడు

8 Our sweetest songs are those that tell of saddest thoughts (Shelly)

అత్యంత వేదనా భరితమైన భావముల గ్రథనము చేయునవే మధుర గీతికలు)

9. దశకుమార చరితము . ప్రథమోచ్ఛ్వాసము.

దండి అధరమును కదంబపుష్పముతో పోల్చినాడు ఇదియు అపూర్వ ప్రయోగమే వచ్చునకు మాత్రమే ఈ రెంటిని చూపితిని అనేక కవి సమయము లలో ఇట్టి ప్రయోగములు జరిగినవి.

## పాశ్చాత్యసాహిత్యములో ప్రయోగములు

సంస్కృతకవిత్వమునకు వాల్మీకి వలె, తెలుగు కవిత్వమునకు నన్నయ వలె, ఇంగ్లీషుకవిత్వమునకు చాసర్ ఇంచ మించుగా ఆదికవి ఇతను ముందు కవులు లేరని కాదు కేడ్మన్ (Caedmon), ఆల్ఫ్రెడ్ రాజు (King Alfred) మున్నగు కవులు చాసర్‌కు ముందే ఆంగ్లో—సాక్సన్ (Anglo-saxon) భాషలో రచనలు కావించిరి కాని, నన్నయకు పూర్వపు శాసనములలోని భాషవలె వీరి భాష కూడ కొంత దురవగాహముగా నుండును చాసర్‌పై ఇటలీదేశపు మానవతా వాదము (Italian Humanism) ప్రభావము ప్రబలముగా నున్నది ఇతడు ఛందస్సు విషయములో గొప్ప ప్రయోగము చేసెను ఇతనికి ముందున్న ఆంగ్లో సాక్సన్ కవిత్వములో ఆద్యక్షర సామ్యము (Alliteration) ఉండెడిది ఇంగ్లీషు కవిత్వమున ప్రాయశః నిర్బంధమైపోయిన అంత్య నియమము (End - Rhyme) ఆనాడు లేదు ఆదినియమము ( Beginning Rhyme ) మాత్ర ముండెడిది పద్యపాదములు గూడ అక్షరసంఖ్యా నియమబద్ధములుగా ఉండకపోయెడివి చాసరు మహాకవి తొలిసారిగా పద్యపాదములలో అక్షరసంఖ్యా నియమము ప్రవేశపెట్టెను ఆద్యక్షర సామ్యమును వదలివేసి ఫ్రెంచి ఛందో నియమమగు అంత్యప్రాసమును తొలిసారిగా ప్రవేశపెట్టెను ఇతని ప్రభావమువలననే ఇంగ్లీషుకవిత్వమునుండి క్రమశః Alliteration నిష్క్రమించినది చాసర్ ప్రవేశపెట్టిన అంత్యనియమము మరియు అత డధికముగా చేసిన వసంతప్రభాత ( May Morning ) వర్ణనలు ఉద్యానవర్ణనలు అతని అనుచరులకు సంప్రదాయములైనవి

చాసర్ ఏర్పరచిన బాటను పెక్కురనుసరించిరి కాని, పదునారవ శతాబ్దిలో ఇతనిబాటను కాదని ఇటలీ దేశమున ఇద్దరు కవులు క్రొత్త ప్రయోగములు చేసిరి సర్ థామస్ వయట్ Sir Thomas wyatt ) మరియు సర్రే ( Surrey ) అను ఇరువురు కవులు ఈ క్రొత్త ప్రయోగములు చేసినారు వీరు ఇటలీబాషాసాహిత్యముల పారమునందుకొన్నవారు పెట్రార్క్ ( Petrarch ) ప్రభృతులు బలపరచిన ప్రణయ కవిత్వమును వీరు ఇంగ్లీషు కవిత్వములోనికి దిగుమతి చేసిరి. సర్రే ప్రప్రథమముగా అంత్యనియమములేకుండ Blank Verse ను ప్రవేశపెట్టెను వీ రిరువురు తొలిసారిగా ఇంగ్లీషులో సానెట్‌ను ప్రవేశపెట్టిరి పదునాలుగుపంక్తుల లొలిగీతము సానెట్ వీరు వేసిన బాటలు క్రమముగా సంప్రదాయములైనవి

షేక్‌స్పియర్ యుగమునందు ప్రధానముగా కాల్పనిక సౌరభము గల రచనలు వెలువడినవి ఈ యుగములోనే బెన్ జాన్సన్ Ben Jonson అను కవి సంప్రదాయ ధిక్కారణము చేసి కాల్పనికేతి వృత్తములను త్రోసిపుచ్చి తత్కాలీన సమాజస్థితిగతులను చిత్రించుటకు నాటకములు వ్రాసెను ఉపదేశాత్మక వాస్తవికతకు Didactic Realism దారిదీసిన గొప్ప ప్రయోక్త బెన్ జాన్సన్

మిల్టన్ కాలము వరకు ( Blank Verse ) కేవలము నాటకము లందు మాత్రము వాడబడుచుండెడిది. తొలిసారిగా మహాకావ్యములందు శక్తిమంతముగా Blank Verse ను ప్రయోగించిన మహాకవి మిల్టన్ ఇంగ్లండులోని మతరంగమున తన నాటికే వేళ్ళు నాటుకొన్న Puritanism ను ప్రచారము చేయుటకు కంకణము గట్టుకొన్న కవి మిల్టన్ కాల్పనికోద్యమముపై ( Romanticism ) ఇతడు తిరుగుబాటు చేసెనని చెప్పవచ్చును అయినను మిల్టనులోని మానవతా వాదమును అతనిలోని మతాభినివేశము త్రోసిరాజనలేదు మిల్టన్ 'ప్యారడైజ్ లాస్ట్' లో తొలిసారిగా అంత్యప్రాసములేని Blank Verse ను ప్రవేశ పెట్టినాడు. మహాకావ్య ( Epic ) రచనకు ఒరవడి దిద్దినాడు.

ఇంగ్లీషు సాహిత్యమున పోప్ యుగమును Neo—Classical Age అందురు. ఈ కాలమున వెనుకచూపు ముదిరినది. నగరసంబంధమై కవిత్వము ప్రబలినది. భావమునకు బదులుగా రీతిపై, శైలిపై మమకారమున హెచ్చినది. సహజత్వమునకు బదులుగా నగిషీలు, జిలుగులు పెరిగిపోయినవి. అలంకారముల ఆరభటి అతిశయించినది. భావనాశక్తికి బదులుగా చమత్కారమునకు ప్రాధాన్యము కలిగినది 10 ఈ యుగములోని సమస్త సంప్రదాయములకు విరుద్ధముగా కాల్పనికోద్యమము (Romantic Revival) గొప్ప తిరుగుబాటు చేసినది

## సంప్రదాయ ప్రయోగముల సమన్వయము

సంప్రదాయము, ప్రయోగము రెండుస్థూలముగా వేరువేరుగా కనుపించినను రెంటికి సన్నిహితసంబంధమున్నది ప్రతి సంప్రదాయము ఒకనాటి ప్రయోగమే ప్రతిప్రయోగము ఒకనాటికి సంప్రదాయము కాక తప్పదు ఒక్కొక్క ప్రతిభావంతుడైన కవి చేతిలో 'పరుసవేది' యుండును. అతడు ముట్టిగడ్డను ముట్టినను మాణిక్యమై పోవును మౌలిక ప్రజ్ఞ కల వాడు చేసిన ఏ ప్రయోగమైనను త్వరలోనే సంప్రదాయముద్ర వేసికొనును.

ఒక సంప్రదాయము కొంతకాలము రంగమున సుప్రతిష్ఠితమైన తర్వాత దానియందు రక్త ప్రసారము మందగించును అప్పుడు దానిలో సంచలనము కలిగించుట ఆవశ్యక మగును దానిని కదలించుటకు సంప్రదాయ దాసు లామోదించరు. అప్పుడు దానిని బొత్తిగా కాదని ప్రయోగము బయలు దేరును సంప్రదాయములోని మూలతత్త్వమును—అనగా ఆ సంప్రదాయము పూర్వాశ్రమములో ప్రయోగముగా ఉన్ననాటి తత్త్వమును—జీర్ణించుకొన్న సరిక్రొత్తప్రయోగము అనతికాలములోనే సంప్రదాయపీఠ మాక్రమించును.

ఎంతటి ప్రయోగమునకైనను సంప్రదాయ వాసన ఉండక తప్పదు. వాల్మీకిని ఆదికవి యన్నంత మాత్రమున అతని కావ్యము గారడివాడు మొలిపించిన మామిడి మొక్కవలె అప్పుడే పుట్టినది కాదు వైదిక ఋక్కులు, అతని హృదయ తంత్రులలో ఎన్ని నాళ నుండియో శ్రుతి సారించుకొన్నవి. తెలుగులో నన్నయ నాదికవి యందుము అయినను అతనికి ముందున్న గ్రంథస్థము కాని రచనలు అతనిహృదయములో జీర్ణించి యుండవచ్చును. సంస్కృతములో సందేశ కావ్యములకు మూలపురుషుడు కాళిదాసందుము. అతనికి ముందుగానే సందేశకావ్యములు రేఖామాత్రములుగా రామాయణ భారతాదులలో ఉన్నవి. పోపును 'నూతన ఐతిహాసిక యుగము' (Neo-classical Age) నకు వైతాళికు డన్నచో అతడు దాని సమాంతముగా సృష్టించినాడని అర్థము కాదు ఆ కావ్యరీతి అతని చేతిలో పరిపూర్ణత నందుకొన్నదని మాత్రమే తాత్పర్యము తెలుగులో ప్రథమప్రబంధము అల్లసాని పెద్దన వ్రాసెనని యందుము వాస్తవమునకు నన్నెచోడుడే తత్కవితారీతికి బాటలు వేసెను తనకు ముందున్నవాడు వేసిన కాలిబాటను ఘంటాపథముగా చేసినచో అది సంప్రదాయముపై చేసిన చక్కని ప్రయోగముగా గణనలోనికి వచ్చును.

ఆధునికులు చేసెడి ప్రతిప్రయోగము గొప్పది, సాంప్రదాయకముగా నున్నదంతయు రోత యను అభిప్రాయము సైతము ఒక్కొక్క కాలములో బయలుదేరును 17, 18 శతాబ్దులలో ఇంగ్లండు, ఫ్రాంసు దేశములలో ఇట్టి విశృంఖల చిత్తవృత్తియే విజృంభించెను అప్పటికి ఇంగ్లీషు ఫ్రెంచి సాహిత్యములపైన గ్రీకు, ల్యాటిను సాహిత్యములప్రభావము కుత్తుకబంటిగా నుండెను ఆధునిక సమాజము అనేక విధములుగా అభివృద్ధి నందినది కావున ఎన్నడో గ్రీకులు స్థాపించిన సంప్రదాయముల నెందుకు స్వీకరింపవలెనను తిరుగుబాటును వీరు లేవనెత్తిరి గ్రీకులు ప్రకృత్యారాధకుల (Pagons) ఆధునికులైన ఇంగ్లీషువారు క్రైస్తవులు కావున వారికన్న తామే ఉదాత్తభావకులన్న అభిప్రాయమును ఆంగ్లేయులు సాగదీసిరి. వారి వాద సారాంశ మిది మానవ విజ్ఞానము నిరంతరము పురోగమించుచున్నది. మనము పెరిక్లియన్ కాలపు గ్రీకుల తర్వాత, ఆగస్టస్ కాలపు రోమన్ల తరువాత జీవించుచున్నాము కావున వారికంటె మనమే సమధిక విజ్ఞానము

---

10 Bird (పక్షి) అనుటకు బదులుగా 'The feathered in habitant of the air' వంటి డొంకతిరుగుడు దోరణులు బయలుదేరినవి. తెలుగున సీతయనుటకు బదులుగా 'కదలి మొలనూలి చేడియ కన్నపడతి' యన్నట్లు.

కలవారము అందుచేత ప్రాచీనులైన గ్రీకులు, రోమనులు రచించిన దాని కంటె, నిర్మించిన దానికంటె మనము రచించినదే, మనము నిర్మించినదే శ్రేష తర మైనది 11 విజ్ఞానశాస్త్రమువలన ఆధునికులు పొందిన అభివృద్ధి ఈ అతివాదులకు గర్వకారణ మైనది శాస్త్రవిజ్ఞానముతోపాటు సాహిత్యము, కళలు, సంస్కృతి పెరిగిపోయినవని వీరి చింతనమ్మకము గ్రీకులకన్న సాహిత్యరంగములో వీరు సాధించిన దేది యని ప్రశ్నించుకొని, "గ్రీకుల 'ది ఒరెస్టీ' (The oresteia) వంటి ఉత్తమోత్తమమైన విషాదాంత త్రిపుటి (Tragic triology) నొక్కటైనను వీరు వ్రాయలే నప్పటికి దానిని పునశ్చరణ చేయుటయే వీరి ఘనత కావచ్చునని గిల్బర్ట్ ముర్రే (Guilbert - Murray) అధిక్షేపించినాడు 12

కావున శాస్త్రీయముగా, సాంకేతికముగా అభివృద్ధి చెందినంత మాత్రమున సాహిత్యరంగములో ముందంజవేసినా మనుట సత్యదూరము మహాకావ్యము లొక తరములో మాత్రమే దేదీప్యమానముగా వెలిగి మరు తరమున మలగిపోవునవి కావు కవిత్వము బుద్ధికి సంబంధించినది కాదు ప్రధానముగా హృదయసంబంధి మానవుని మనోబుద్ధులలో మార్పు త్వరగా రావచ్చును కాని హృదయము ప్రతితరమునకు మార్పు చెందదు రెండువేల ఏండ్లక్రింద గల హృదయసంబంధి సమస్యలే నేటి కున్నవి

ఆదునికులు కొందరు ప్రాచీనులను త్రోసివేయుకయే తమ రచనలు వారికన్న ఏమాత్రము తీసికోపోవని వాదింతురు వారి వాదధరణి యిట్లుం డును నేటి కాలపు సింహములు క్రౌర్యములో అగస్టస్ కాలమునాటి సింహ ముల కేమాత్రము తీసిపోవు నేటి గులాబులు ఆనాటి గులాబులకు తుల్య మైనవే నేటిమానవులు ఆ కాలమువారియంత ఎత్తుగను, పొట్టిగను ఉన్నారు కనుక ప్రాచీనకాలములోని వారి రచన లెంత ప్రశస్తమైనవో నేటికాలము వారిరచనలు గూడ అంతే ప్రశస్తమైనవి 13

ఈ వాదములో సైతమర్ధసత్యమే యున్నది మానవుని జీవితమున చిరకాలమునుండి కొన్ని శాశ్వత సమస్య లున్నవి రాగద్వేషములు, అదికార వాంఛ, సన్మాన కాంక్ష, మృత్యుభీతి, ఇంద్రియప్రీతి, ప్రకృతి రక్తి, దైవ భక్తి—ఈ ప్రవృత్తులు సార్వకాలికములైనవి విరహవేదన కాళిదాసు కాలమం దున్నది నేడున్నది మగనిపై మగువ సొందు పొలయల్క పారిజాతాపహరణ రచనాకాలమం దున్నది ఈనా డున్నది కర్మభ్రష్టులు పాండురంగ మాహా త్మ్యము రచించిన కాలమునం దున్నారు, నే డున్నారు. ఈ సత్యములు సార్వ కాలికములైనను వీనిని అన్నికాలములకు చెందిన రచయితలు సమానముగా చిత్రించి యుండలేదు ప్రతి యుగమున ఏతద్విషయ చిత్రీయకరణములో కొంత మార్పు కనిపించుచున్నది కళ యనునది సామాజిక ధర్మము సమాజ పరిస్థితులనుబట్టి కళాస్రష్ట తన సృష్టిస్వరూపమునకు రూపురేఖలు తీర్చిదిద్దుకొనును

ప్రతివిశృంఖల ప్రయోగము జయప్రద మగు ననుట కల్ల సంప్ర దాయగంధము కలిగిన ప్రయోగము మాత్రమే నిలువ గలుగును ఈ యభి ప్రాయమే యింతవరకు ప్రకటింపబడినది అంతమాత్రమున విశృంఖల ప్రయో గములు సుతరాము పనికిరావని నే నను వానినే ప్రమాణములుగా భావించి ప్రాకులాడుట తగదు ఒక్కొక్క కాలమునందలి సామాజికపరిస్థితిని బట్టి ప్రళయకాలాంభోధి తరంగముల వంటి ప్రయోగములు రాక తప్పవు ఒక తాలోత్తాల తరంగము మహాకల్లోలముతో బయలుదేరి, హోరెత్తుచు సాగి కడకు ఒడ్డునకు దాకి చిద్రుపలు చిద్రుపలై పోవును కొంతసేపటికి సముద్రము ప్రశాంత గంభీరముగా మారును ప్రయోగము యొక్క తీవ్ర ప్రతిఘాతముతో గడ్డకట్టుకొని పోయిన సంప్రదాయ మొక్క మారుగా గలగల కదలిపోవును. దానిలో క్రొత్త జీవము బికి వచ్చును. ఆ ప్రయోగము తాను స్వతఃప్రయోజనకారి కానున్నను అంతకుముందున్న సంప్రదాయములో నూత్న చైతన్య ముండును దీనికి ఫ్రాంసులో జరిగిన ఒక సాహిత్యోద్యమ మును తత్పర్యవసానములు ఉదాహరణముగా పేర్కొందును

1635 లో ఫ్రాంసులో ఫ్రెంచి అకాడమీ (Franch Academy) లను సంస్థ స్థాపింపబడినది ఇది సంప్రదాయ దాసులకు గొడ్డలిపెట్టుగా రూపొందినది జీన్ డెస్మార్టెస్ (Jean Desmartes) అను రచ యిత సంప్రదాయమును సంపూర్ణముగా నిరసించుచు కొన్ని గ్రంధములు వ్రాసెను ప్రాచీనకావ్యము లెందుకును పనికిరావనియు, తన రచనలు— తన సమకాలికరచనలే గొప్పవనియు నిరూపించుటకు ప్రయాసపడెను ఇత డెంతగా దుమారము లేపినను అతని సమకాలికుడును, సంప్రదాయమును జీర్ణించికొని క్రొత్త రచనలు సృష్టించినవాడును అగు మిల్టన్ మహాకవితో తులతూగలేక పోయినాడు అనగా ఇతడు చేయదలచుకొన్న ప్రయోగము ఫలవంతము కాలేదు ఒకటి మాత్రము జరిగినది సంప్రదాయమును గ్రుడ్డిగా అనుకరించువారికి తిరుగుబాటు కశాఘాతమువలె పనిచేసినది 14

క్షీణదశలో నున్న సంప్రదాయమును పునరుద్ధరించుటకు తోడ్పడెడు ఎట్టి విశృంఖల ప్రయోగమైనను ఆదరణీయమే కేవలము ప్రయోగము కొరకు ప్రయోగము చేయుట అంతగా ఫలవంతమైన ప్రక్రియ కాదు. ఏ క్షేత్రములోనైన మొదట సంప్రదాయమను ఎరువు వేసి తదనంతరము ప్రయోగము అనెడు విత్తనములు చల్లినచో మరకతములను, మణులను గేలిసేయు పంటలు పండింపవచ్చును సంప్రదాయ ప్రయోగ ముల సమ్యగ్మేళనమే మానవుని మహోన్నతదశకు గొంపోవును 15

---

11 'Human knowledge is constantly advancing, we live in a later age than the periclean Greeks and Augustan Romans, therefore, we are wiser. There fore, anything we write, or make is better than the things written and made by the ancient Greeks and Romans'

—The classical Tradition Gilbert Highet.

12 'The classical Tradition'లోనిఉద్ధృతము (P 265).

13 ,, (P. 288)

14 "But the real benefit of the battle for the both sides was that it discouraged slavish respect for tradition, and made it more difficult for future writers to produce 'chinese copies' of classical masterpieces in which exact imitation a virtue and original invention A sin"

—(The classical Tradition P 288)

15. "The new comes and takes its place beside the old, and we welcome it, But it is not wise to give up too soon the old for dead. The ways of genius with supposedly, cast of lifeless forms have to be reckoned with. For the touch of genius is like the mirads of the spring"

(Convention And Revolt In poetry, P. 70)

# రాలిన మొగ్గ

శ్రీ కర్రా ప్రభాకర్

చిరుసొగసు చిన్నారి,
వలపొలుకు వయ్యారి!
ఎవరికే లేపావు,
సాగరపు తీరాన
ఆ ఇసుకమేడ?

నీదు చిరుమోముపై నవ్వులే ఒలుక,
కెరటాలు దోసెళ్ల ముత్యాలుబోసె;
ముత్యాలు మలపిన ఆ ఇసుకమేడలో
ఎవరినే నిలిపేవు చిన్నారి,
నీ వెవరినే కొలిచేవు వయ్యారి?

నిలువెగసి, బుసజేసి నురుగులే గక్కుతూ
నైపనీ సాగరుడు సొగసంత చెరిచేడు;
కలలోన కనుమూసి వలపు మైమరపు లో
ఎవరినే తలచేవు చిన్నారి,
నీ వెవరినే వలచేవు వయ్యారి?

చిగురాకె రాలింది, కూలిపోయె పునాది;
పెనుగాలి ఇసుకతో లేపెను సమాధి!
కెరటాలు దోసిళ్ల నీరింత వదిలె!
ఎవరికై చింతింతు చిన్నారి!
నీ వెవరికై వలపింతువయ్యారి!!



# ప్రజాస్వామ్యంలో నాయకత్వం

శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి

ఒక విధంగా చూస్తే మన యుగం సమస్యలయుగంగా వుంది. మన సమకాలీనులు ప్రతిభావ్యుత్పత్తులు కలవారయ్యా, సమస్యల్ని సృష్టించినంతగా, సమస్యాపరిష్కార మార్గాల్ని కనిపెట్టలేక విఖ్యాతులౌతున్నారు. ప్రాచీనులు సమస్యలనేగాక, సమస్యలకు హెచ్చు మార్గాల్ని కనిపెట్టి విఖ్యాతులైనారు

ఒకొక యుగంలో ఒకొక్క అంశంమీద నొక్కుపెడుతూ ఉంటారు. ఆ నొక్కునుబట్టి మార్గాన్వేషణాల భిన్నత్వం వస్తుంది; మార్గమూ వస్తుంది. పడిన మార్గాన పయనించేవారుకోట్లు; కొత్తమార్గావలంబన చేసేవారు తక్కువ. ఆ తక్కువ కోవకు చెందినవారే నాయకులు-వారు తాత్విక రంగానికి చెందినా, సాంఘిక రంగంలో నర్తించినా, రాజకీయ రంగంలో పయనించినా, సాంస్కృతిక రంగంలో మన్నిక పొందినా-అట్టివారే నాయకులు.

తాత్వికులు మానవుణ్ణి అభివర్ణిస్తూ 'తత్త్వజీవి' అన్నారు. సాంఘిక వాదులు 'సాంఘిక'జీవి అన్నారు. రాజకీయ భావుకులు 'రాజకీయజీవి' అన్నారు. ఆర్థిక దృష్టి సమాజాన్ని నియతం చేస్తుందన్నవారు 'ఆర్థిక జీవి' అన్నారు. విజ్ఞులు 'సాంస్కృతిక జీవి' అన్నారు. యిదంతా విన్నవారు 'లోకోః భిన్నరుచిః' అనుకొన్నారు. యీ భిన్నత్వంలో యేకత్వాన్ని కన్నారు మరికొందరు.

యీ భావాలన్నీ, ప్రాచీన విజ్ఞాన నిలయాలైన గ్రీసు, యిండియా, చైనా దేశాల్లోని విజ్ఞులవల్ల వింటూ వచ్చాము. గ్రీసులో 'నగర పాలన' వుండేది. యిండియాలో 'గణతంత్ర పరిషత్తు' లుండేవి. చైనాలో సుస్పష్ట నామకరణంలేదు - రాజరికాలు సాగినా, ప్రజలలో కొందరిని సంప్రతించి, రాజు రాజ్యభార నిర్వహణ చేసినట్లు కనబడుతుంది. నాడూ, నియంత భావంతోవున్న రాజులూ వుండివున్నట్లు తోస్తుంది.

రాజుల కాలంలో, నాయకుడు రాజే! రాజు పుట్టువుతోవచ్చేవాడు. కాబట్టి నాయకత్వం పుట్టువును బట్టి మసలుతూ వచ్చేది. అతడు శక్తివంతుడైతే, రాజ్య నిర్వహణ చురుకుగా వుండేది; అతడశక్తుడైతే దాని ప్రభావం పాలనమీద చిక్కేది. గత యుగాల్లో మనం చూచే వ్యత్యాసాలు యీ నాయకుడైన పుట్టు రాజులమీద ఆధారపడివుండేది. పుట్టురాజుల్ని, ప్రక్కవారు దొర్లించి పారవేస్తూవచ్చిన చారిత్రక ఘట్టాలు చూస్తే, నాయకత్వాలు ప్రత్యామ్నాయ మార్గాల్లో గోరాడటం కనబడుతుంది.

రాజుల అనంతరం, జమీందార్లు ప్రాంత నాయకులై మనినారు. రాజులు పెద్దప్రాంతాలను వంగడాల్లో వుంచుకుంటే, జమీందార్లు తక్కువ ప్రాంతాల్లో వంగడాల్ని యేర్పరచారు. నాయకుల సంఖ్య పెరిగినా, యిదే పుట్టువుతో కూడినదేనై, రాజరికాల్లోని వారసత్వగుణాన్ని, విపులీకరిస్తూ వచ్చింది.

జమీందార్లనుండి ప్రజలలోకి యీ నాయకత్వం వచ్చింది; రాజరికాల్లో, జమీందారీలలో నున్న పుట్టువు గత నాయకత్వాలు పోయి, ప్రజాభిప్రాయానుసార నాయకత్వాలు వచ్చినై. అది ప్రజాస్వామ్య యుగం. ప్రాచీనంలో నగరపాలన లున్నా, పరిషత్తు లున్నా, యెన్నిక అనేది ప్రజాదత్తమై మనుటలేదు.

ప్రాతినిధ్యగుణం యెన్నికమీద ఆధారపడలేదు; యెన్నికగుణం కూడా కొంత అందులో యిమిడివుంది. అంతే!

'కాని, యూరపులో, ముఖ్యంగా బ్రిటన్‌లో యెన్నికలు గల, ప్రజాస్వామ్య ప్రాతినిధ్య ప్రభుత్వంతో రాజరికాలు మేళవించి వచ్చినవి. కాబట్టి ప్రజానాయకత్వాలు, ప్రజాప్రాతినిధ్యంవల్ల వచ్చినవే! ప్రజాప్రాతినిధ్యం యెన్నికలవల్ల పుట్టినది. యెన్నిక నాయకత్వానికి మూలమై నిలిచింది. యిది నవయుగ ధర్మంగా పలువు రంగీకరించారు.

కాని, దీన్ని కాదని మితవాద నియంతలు (హిట్లర్, ముస్సోలినీ వగైరాలు) వచ్చారు. అతివాద నియంతలు (లెనిన్, స్టాలిన్, కృశ్చేవ్, మావో సెటుంగ్, టిటో, కాస్ట్రో వగైరాలు) వచ్చారు. నియంతలకు యెన్నికల్లో నమ్మకం లేదు. కాని, యెన్నికల్ని వారి కుపయోగించేటట్లు మార్చుకున్నారు, మలచుకున్నారు. వారు యెన్నికల్ని నియతంచేస్తూ, నాయకత్వాన్ని అనుశాసించారు. దీనికి, వారు సిద్ధాంతాల్ని ఫులిమారు. హిట్లర్ వాదులు "సూపర్ మన్" అంటే, లెనిన్ వాదులు "శ్రామిక నియంతృత్వ" మన్నారు.

వర్తమానకాలంలో, నాసర్, సుకర్ణో, అయుబ్‌లాంటి మిలిటరీ యోద్ధలు, నియంతలై పాలించటం కద్దు. వీరు హిట్లర్, లెనిన్ గుణాల్ని కలిపి, ఒక రాజకీయ మిశ్రసమాసాన్ని తయారుచేసి, దాన్ని గైడెడ్ ప్రజాస్వామ్యమనీ, బేసిక్ ప్రజాస్వామ్యమనీ, జాతీయ ప్రజాస్వామ్యమనీ అంటూ నియంతృత్వ నాయకత్వాల్ని ప్రసాదించారు.

యిప్పుడు ప్రపంచంలో రేగిన, చెలరేగిన పాలనలన్నీ ప్రజాప్రభుత్వాలేనని ఆయా పాలకు లంటారు. 'ప్రజల ప్రజాస్వామ్యాల్ని' రూపొందిస్తారు. పేర్లు పెట్టటానికి, పేర్లు మార్చటానికి యిది ప్రభంజన యుగం.

యీ యుగంలో, మరొక నూతన సిద్ధాంతం వుంది. పార్లమెంటరి వ్యవస్థ ద్వారానే సోషలిజాన్ని సాధించగలమని. యిది మిశ్రవాదం; సోషలిస్టు నియంతృత్వానికి ప్రజాస్వామ్య ముసుగువేసే వాదము.

యే సిద్ధాంతాలు యెట్లావున్నా, యే రాద్ధాంతాలు యేవిధంగా చంచలతను పొందుతూవున్నా, 'ప్రజాస్వామ్యం' అన్న భావము రూపాంతరాలను పొందింది; యింకా పొందుతుంది. ఎన్ని రూపాంతరాలు పొందినా, ప్రజాస్వామ్యాన్ని విపులీకరించే వాదన యేదో, హ్రస్వీకరించే వాదన యేదో అర్థం చేసుకోవటం కష్టంకాదు.

సోషలిజం తగిలినచోటనెల్లా, ప్రభుత్వపరం జరగటం కనబడుతుంది. ప్రభుత్వపరంగా సంపదలూ, అధికారాలూ మారినప్పుడు నియంతృత్వచ్ఛాయలు, జ్వాలలు వచ్చి కూర్చుంటవి. నియంతృత్వం ఒకసారి దాపురిస్తే, సనాతనమై కూర్చుంటుంది.

మనదేశంలోని పరిస్థితులనే మనం గమనిస్తే, మన రాజ్యాంగం, మన యేలుబడి విధానం మనకు ప్రధానంగా గోచరిస్తుంది. దాన్ని రచించింది 'రాజ్యాంగ సభ'. పూనికపట్టినవారు పార్టీ రాజకీయాలవారే! కాని, రాజ్యాంగంలో యెన్నికలు వున్నై; నయోజన వోటింగుతో జరిగే యెన్నికలు వున్నై; కాని పార్టీలులేవు. పార్టీల పరిగణనలేదు. పార్టీ నాయకుల ప్రసక్తిలేదు. మనదేశంలో యిది గమనించదగ్గ ముఖ్య విషయం.

మనది ప్రజాస్వామ్య రాజ్యాంగం; యెన్నికల రాజ్యాంగం. జెండాల గుర్తింపు, పార్టీల పరిగణనలేని రాజ్యాంగం; రిపబ్లికన్ రాజ్యాంగం రాజ్యాంగ సూత్రాల ప్రకారం, దేశం కొన్ని 'రాష్ట్రాలు'గా, ప్రతిరాష్ట్రం కొన్ని నియోజక వర్గాలుగా విభజింపబడి, ఆయా నియోజకవర్గంలోని ప్రజలు, రాష్ట్రాలకు, కేంద్రానికి 'ప్రతినిధుల్ని' యెన్నుకుంటారు. అది మొదటి అధ్యాయం.

యిట్లా యెన్నుకోబడిన రాష్ట్ర, కేంద్ర ప్రతినిధులు వివిధపార్టీలకు చెందినవారుగనూ, స్వతంత్రులుగనూ వుంటారు. రాష్ట్రాల్లో, కేంద్రంలో యెన్నుకోబడ్డవారిని గుదులుగా పార్టీలుచేర్చి, ఆయా పార్టీల నాయకుల్ని యెన్నుకుంటవి. ఎవరి పార్టీ రాష్ట్ర, కేంద్ర శాసనసభల్లో మెజారిటీ అయితే, ఆ నాయకుణ్ణి ముఖ్యమంత్రిగా, ప్రధానిగా యెంచుకుని, గవర్నర్లు, అధ్యక్షులు మంత్రాంగాల్ని నిర్మించమని ఆదేశిస్తారు.

# తెనుగునకున్న వ్యాకరణదీపము

"శ్రీ వాత్సవ"

"తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నది" యని అరవైయేండ్ల క్రితం తిరుపతి వేంకటకవులు శతావధానము చేస్తున్న సమయంలో బహిరంగంగా చెప్పవలసివచ్చింది వారు చేసిన ప్రయోగాలకు తగినలక్షణములు సమకాలీన లక్షణగ్రంథాలలో కనిపించకపోవడమే వారట్టి ప్రకటనచేయడానికి కారణమయింది నాటినుండి నేటివరకు తెనుగునకున్న వ్యాకరణదీపకాంతి పరిమితంగానే ఉన్నది అది విస్తృతం చేయడానికి తగినప్రయత్నం పెద్దయెత్తున జరగలేదు ఒకరిద్దఱు సాహసించి అట్టిప్రయత్నం చేసినప్పటికీ దానికితగిన గుర్తింపురాలేదు నన్నయనుండినావఱకు, నిజానికి ఈ వేయిసంవత్సరాల తెనుగు భాషాచరిత్రలో వ్యాకరణము పుట్టిన తేఱతెన్నులు విచిత్రంగానే ఉన్న దనవచ్చును. "సిద్ధిర్లోకే" అనేసూక్తిప్రకారము, లక్ష్యము ముందు పుట్టినతరువాత లక్షణము తరువాత రావడం పరిపాటి. ద్రావిడ భాషలలో అత్యంత పురాతనమని మనం చెప్పుకొంటున్న తమిళమునకు తొలిగ్రంథము 'తొల్‌కాప్పియమ్' దీనిలో 'ఇలక్కియమ్' ఇలక్కణమ్' అనురెండు విధములుగా తమిళభాషకు తొలిపాఠాలు నేర్పినట్లు నాటి గ్రంథములబట్టి తెలుస్తోంది దేశ భాషలకు చాలవరకు ఈ సూత్రమే అన్వయించినట్లు భావించవచ్చును ప్రాకృత భాషలు ముందువాడుకలో ఉన్నతరువాతనే సంస్కృతభాష వచ్చినట్లు భాషాచరిత్రకర్త లెవ్వరైనను ఒప్పుకుంటారు సంస్కృతంలో కూడా వైదికభాష వేఱు, కావ్యభాష వేఱు ఈ భాషలకు ప్రత్యేకముగా పాణిన్యాదులు విడివిడిగా వ్యాకరణములు వ్రాసినారు వార్తికములు ప్రవచించి, కారికలు చెప్పి వాక్యవిన్యాసముల వెల్లడిచేసినారు అట్లే సిద్ధాంత 'కౌముది' వంటి లక్షణగ్రంథములు వచ్చినవి దేశభాషలలో కొన్ని సంస్కృత సంప్రదాయాలను అనుసరించినప్పటికీ తమ ప్రత్యేకతలు నిలుపుకొన్నవి ప్రాకృత భాషలకుచెందిన శౌరసేని, అర్ధమాగధి మున్నగువాని ప్రభావము తెలుగుభాషమీద ఉన్నట్లు తెలిసిన భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం ఈ విషయంలో చాలపరిశోధనలు జరగవలసియున్నది ఏది యెలాగున్నప్పటికీ తెనుగుభాషలోని తత్సమ పదజాలానికి సంస్కృత శబ్దలక్షణాలు కొన్ని నప్పుతూ ఉన్నవి ఇది గుర్తించి తెనుగుభాషకు 'ఆంధ్రశబ్ద చింతామణి' యను వ్యాకరణమును వాగనుశాసనుడైన నన్నయభట్టారకుడు (11వ శతాబ్దము) రచించెనని వాడుకగాయున్నది తెనుగుసాహిత్యములో అనేకవిషయాలకున్న వాదప్రతివాదములవలెనే ఈ తొలివ్యాకరణము రచించినది ఎవరు అనే విషయమై ఇంకను వివాదము జరుగుతూనే ఉన్నది నన్నయభట్టు రాజరాజ నరేంద్రుని కోరికననుసరించి రచించిన ఆంధ్రమహాభారతములోని ప్రయోగములనుచూచి, ఈతడే ఆంధ్రశబ్దచింతామణి రచించెనని పెదలు నిరూపిస్తున్నారు. ఆంధ్రశబ్దచింతామణి కర్త— ఆనాటిశిష్టవ్యవహారములో నున్న శబ్దజాలమును ప్రయోగములను స్వీకరించి— కావ్యరచనానుకూలమును నానాటినిమలచుకొని ఆ పదజాలమునకు కొన్ని నియమములు, సంస్కారములు చేసి శబ్దచింతామణిగా రూపొందించుకొన్నాడు తత్సమభాషగ్రాంధికత పొందిన రూపమునకు కల్పించిన లక్షణమే ఆంధ్రశబ్దచింతామణిగా అవతరించినది దీని నియమములే కవిత్రయ భారతములోను, పురాణములలోను, కావ్యములలోను తెనుగుకవులు పాటించారు ఈ గ్రంథము సంస్కృతములో రచించుటలోనేకాక సంస్కృత వ్యాకరణమర్యాదననుసరించి ఆంధ్రవాగనుశాసనుడు సమాసము, విభక్తి, క్రియ, అచ్చు, హల్లు, అన్వయము మున్నగు వాటిని చెప్పుటలోకూడ సంస్కృత పద్ధతులనుండి గ్రహించెను. అందుచేత సంధి, అజంత, హలంత, క్రియాపదముల ప్రక్రియలను నిరూపించే ప్రయత్నం ఈ శబ్దచింతామణిలో జరిగినది

దీనిలో కొఱవడిన అంశములు పూరించుటకయి అథర్వణాచార్యులు (13వ శతాబ్దము) అథర్వణకారికలు వ్రాసెను ఇదికూడ సంస్కృతములోనే విరచితమై పండితలోకంలో ప్రసిద్ధికెక్కినది. దీనికి అహోబల పండితుడు చింతామణి వ్యాఖ్యతో సహా ప్రకటించాడు దీనికి టీకాతాత్పర్యములతో రెండుచింతల సీతారామకవి ఒక వ్యాఖ్యానంచేసి ఇటీవల ప్రకటించారు. ఆంధ్రశబ్దచింతామణి కర్తృత్వమునుగూర్చి వివాదం ఉన్నట్లే, అథర్వణ కారికల కర్తృత్వముగూర్చికూడ వాదప్రతివాదములున్నవి కాని ఇది అహోబల పండితుడే రచించినట్లు కొందఱు చెప్పుదురు. నిజానికి అథర్వణాచార్యులు — చింతామణిగ్రంథపూరణముగా తన కారికలు రచించినట్లు తెలుపుటకు ప్రాచీన లక్షణగ్రంథములలో చాల ఆధారములున్నవి ఆవిధంగా తెలుగు భాషకున్న ప్రథమగ్రంథలక్షణగ్రంథములు సంస్కృతములోనే వెలువడినవి తెలుగులో లక్ష్య, లక్షణసమన్వితమైన తొలివ్యాకరణము కేతనరచించిన (13వశతాబ్ది) ఆంధ్రభాషాభూషణమని చెప్పవచ్చును

> మున్ను తెనుఁగునకు లక్షణ మెన్నఁడు నెవ్వరును జెప్పరే జెప్పెదని
> ద్వన్నికరము మది మెచ్చఁగ
> నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్—
> సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి
> తెనుగునకు లక్షణము చెప్పకునికి యెల్ల
> కవిజనంబుల నేరమిగాదు నన్ను
> ధన్యుఁ గావింపఁ దలఁచిన తలఁపుగాని

తొలిసారి తెనుగుపదములలో సంస్కృత శబ్దములు చొఱఁబడునిధానము చిన్నచిన్న పద్యముల ఉదాహరణములో కూడ 'ఆంధ్రభాషా భూషణములో

ప్రకటించారు తరువాత ఛందోలంకారములు నిరూపిస్తూ విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి రచించాడు దీనివలెనే ఛందోవిషయాలతో వ్యాకరణ విషయాలు జతపఱచి వెల్లంకితాతంభట్టు కవిలోకచింతామణి అనే గ్రంధాన్ని రచించాడు (15వ శతాబ్దం) ముద్దరాజురామన (16వ శతాబ్దం) ఇటువంటి గ్రంధమునే 'కవిజనసంజీవని' పేరున ప్రాచీనలక్షణకర్తలు, తెలిపిన లక్షణలక్ష్యములతో ప్రకటించాడు దీనిలో యతిప్రాసలతోపాటు శబ్దప్రకరణము, సమాసప్రకరణము, సంధిప్రకరణము ఉన్నవి.

ఆంధ్ర శబ్దచింతామణికి టీక వ్రాసి ఎలకూచి బాలసరస్వతి (17 వ శతాబ్ది) ప్రాచీన లక్షణములతో విశదీకరిస్తూ 'బాల సరస్వతీయము' రూపొందించాడు. నాగనుశాసనుని శబ్దచింతామణికి ఈ టీకా తాత్పర్యము వలననే మంచి ప్రచారము వచ్చినట్లు చెప్తారు

చింతామణికి బాల సరస్వతి రచించిన వ్యాఖ్యానము నాధారముగా తీసికొని ప్రాచీన కవుల లక్ష్యములను సమన్వితము చేసికొని సంస్కృతములో అహోబిల పండితుడు విపుల వ్యాఖ్యానం రచించాడు అది అహోబల పండితీయమని చాల ప్రచారములోనికి వచ్చినది 17 వ శతాబ్దములో తెనుగు భాషాలక్షణము గూర్చి చాల గ్రంధములు వచ్చినవి. కొన్ని సంస్కృతములో సంస్కృతవ్యాకరణముల పదతి ననుసరించి కౌముదివంటివి వెలువడినవి, అట్టి వానిలో మండసరసింహకవి రచించిన 'ఆంధ్ర కౌముది' పేర్కొనదగినది సర్వ లక్షణ సార సంగ్రహమను పేరున గణపవరపు వేంకటకవి రచించిన బృహత్ గ్రంధములో వ్యాకరణ భాగమునకు 'ఆంధ్ర కౌముది' యన పేరు పెట్టి ప్రకటించినారు ఇది వేయి పాదములు గల సీసమాలిక పూర్వకవి పండితులు తెలిపిన ఉదాహరణము లనేక మీ 'సీస మాలిక'లో చేర్చి—నాటి ప్రయోగములు విశదపరచినారు ఇదిగాక కూచిమంచికవి రచించిన గ్రంధమొకటి సర్వ లక్షణ సార సంగ్రహమను పేరుతోనే ఇంకొకటి ఉన్నది ఇది కూడాశ్వాసముల పద్య గ్రంధము దీనిలో వర్గము సంధి, విభక్తి, ప్రాసవళి నిర్ణయము, రేఫ, ఱకార నిర్ణయము తెలుపు ప్రకరణము లున్నవి. ఉదాహరణము లన్నీ కూడ ప్రాచీన కవి ప్రయోగములని నిరూపించారు ఇట్టి గ్రంధమే అడిదము సూరకవి రచించిన కవి సంశయ విచ్ఛేదము (18 వ శతాబ్ది చివరిభాగము ఇది కూడ వ్యాకరణ విషయములు ప్రధానముగా తెలిపినపద్య గ్రంథమే అయినను, పూర్వ కవుల విశిష్ట రచనములనుండి పలు ఉదాహరణముల నిచ్చెను దీనిలో అనేక పదప్రయోగముల సాధుత్వా సాధుత్వములు చర్చించారు. ఈ గ్రంధములో గొప్ప విశేషము తద్భవములు వాని ప్రకృతులను నిరూపించుటకు చేర్చిన తృతీయ తరంగము ఇది గాక, మరిగంటి కోనేటి దేశికుడు రచించిన తెనుగు వ్యాకరణ పద్యములు, గణపవరపు వేంకటకవి రచించిన లక్షణ శిరోమణి పుదూరి సీతారామశాస్త్రి (19 వ శతాబ్దము) రచించి ప్రశ్నోత్తర వ్యాకరణము, వారణాసి వేంకటరాయుడు విరచించిన ఆంధ్ర కుసుమావళి మున్నగు గ్రంథము లున్నవి.

వీటి నన్నిటిని క్రోడీకరించి ఒక వ్యాకరణ సంగ్రహము రచించు ప్రయత్నము జరుగలేదు కాని గద్య రచనకు హెచ్చు ప్రాధాన్యము వచ్చిన తరువాత, మన విద్యావిధానములో తెనుగు భాష రచనకు ప్రాముఖ్య మేర్పడిన పిమ్మట బాల బాలికలకు భాషా లక్షణము తెలియ జేయడానికి తగిన గ్రంధము రచించవలసి వచ్చింది ఈ యవసరం తీర్చడానికి చిన్నయసూరి బాల వ్యాకరణము రచించాడు

అనయము లలితోక్తులతో
వొనరుపడం గూర్చి లక్ష్య యోజన మొప్పం
గను బాల వ్యాకరణం
బనగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్
దిక్ప్రదర్శనముగ దెలిపెద నిందుల
క్షణము గాన బూర్వ కవుల లక్ష్య
ములను లాతి లక్ష్యముల గాంచి తక్కులక్ష
క్షణమె ఱింగి కొనుఁడు చతురమతులు

ఇది బాలలకు పాఠశాలలలో ఉపయోగపడునట్లుగా వ్రాసినట్లు చిన్నయసూరి చెప్పుకున్నాడు ఇంతకుముందే సంస్కృతములో ఒక వ్యాకరణము, సర్వాత్మకముగా ఒక వ్యాకరణము చిన్నయసూరి రచించాడు వానిలో తెనుగునకు శబ్దలక్షణము విశదపరచాడు బాల వ్యాకరణము—ఆంధ్ర శబ్దచింతామణి పొందిన పోకడలే పోయి, ఆ లక్షణ లక్ష్యములను తేట తెల్లమైన తెనుగు ఉదాహరణములతో సూత్రప్రాయముగా తెల్పిన కారణంచేత ఇదే ఉత్తమోత్తమ వ్యాకరణంగా ఉన్నది దీనితోపాటు, సమగ్రమైన వ్యాకరణం రచించే నిమిత్తం అనేకప్రయోగములను సేకరించి చిన్నయసూరి దగ్గర పెట్టుకున్నాడు ఆ ప్రయోగములతోనే, శబ్దసూచిక తయారు చేసికొన్నాడు ఆ సామగ్రి అతనికి ఉపయోగ పడకపోయినప్పటికీ, ఆతని తరువాత శిష్యప్రాయముగా అధ్యయనంచేసి, అనేక గ్రంధములు రచించిన బహుజనపల్లి సీతారామాచార్యుల వారికి ఉపయోగపడింది వారు శబ్దరత్నాకరము అనే నిఘంటువు రచించుటలోను, ప్రౌఢ వ్యాకరణము అను వ్యాకరణము రచించుటలోనే చిన్నయసూరి సేకరించిన శబ్దసామగ్రి చాలవరకు వినియోగించు కొన్నారనడానికి సందేహంలేదు

ఆధునికులలో బాలవ్యాకరణము తరువాత సులభవ్యాకరణము, సరళ వ్యాకరణము అను పలువ్యాకరణములు పాఠశాలా విద్యార్థుల నిమిత్తము వ్రాసినవి వచ్చాయి. వీనిలో ఒకటి కందుకూరి వీరేశలింగం పంతులుగారు రచించిన సులభవ్యాకరణము. చర్ల నారాయణశాస్త్రిగారు ఆంధ్ర శబ్దచింతామణి అధర్వణకారికావళి నాధారముగా తెనుగు పద్యములతో ఒక వ్యాకరణం రచిస్తే దానిపైన విపుల వ్యాఖ్యానంతో చర్ల గణపతిశాస్త్రి గారొక వ్యాకరణం తయారు చేశారు అలాగే బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికయని కలూరి వారొక విపులగ్రంధము రచిస్తే, దానిపైన వాదప్రతివాదములు బయలుదేరినవి. వఝల చినసీతారామశాస్త్రిగారు వైయాకరణ పారిజాతము 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వమ'ను పేరున బృహద్గ్రంధములు రచించిన తెనుగు లక్షణ లక్ష్యములలోని వివాదాత్మక విశేషములను విపులముగా చర్చించారే కాని వ్యాకరణములో శబ్దముల చరిత్రమును విశదీకరించు కృషి చేయలేదు "చెట్టు ముందా విత్తు ముందా?" వంటి ప్రశ్న—లక్షణము ముందా? లక్ష్యముముందా? అనేది. నిజానికి కవిప్రయోగమే లక్షణముకంటె ప్రధానమైనదిగా భావించి గిడుగు రామమూర్తిపంతులుగారు ప్రాచీనాంధ్ర కావ్యములనుండి ప్రయోగములు తీసి 'బాలకవి శరణ్యము' కవి సంశయ విచ్ఛేదము' వంటి గ్రంధములు రచించారు. వారెన్నో ప్రయోగములు సేకరించి వ్యావహారికభాషకు తగిన లక్షణాలు సమకూర్చాలని ప్రయత్నం చేశారు అది వారివలన సాధ్యం కాకపోగా, తాము సేకరించిన ప్రయోగాలు—వ్యాకరణము రచించగల సమర్థులయిన పండితుల కందజేశారు. కందుకూరి వీరేశలింగంగారికి 1919 ఫిబ్రవరిలో ఈ కవి ప్రయోగము లందజేయగా, వానిని స్వీకరించిన తరువాత ఆ మహనీయుడు మూడు నెలల కాలముకంటె ఎక్కువ జీవించలేదట తరువాత ఈ ప్రయోగాలనే మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి కిచ్చారు. ఇవి, మరి ఇటువంటి ప్రయోగాలను పెక్కింటిని సంగ్రహించి మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు—

పూర్వ వ్యాకరణగ్రంథముల సంప్రదాయములో సూత్రప్రాయముగా 'ఆంధ్ర భాషానుశాసనము' అనే వ్యాకరణ గ్రంథం రచించారు. దానిమీద అనేక విమర్శలు వచ్చినవి. వీనిలో కీ. శే. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'వజ్రాయుధము' పత్రికలో చేసిన విమర్శ వ్యాఖ్య చూచి నొచ్చుకొని—ఒక లేఖ పూర్వకముగా గిడుగు రామమూర్తిపంతులుగారికి తెలియజేయగా వారు దానికి ప్రత్యుత్తరంగా ఒక లేఖ రచించారట ఈ రెండు లేఖలూ ఆనాడొక పత్రికలో ప్రకటించారు. పాఠకులకు తెలిపే నిమిత్తం అది ఇక్కడ ఉల్లేఖిస్తున్నాము. *

దురపవాద పరిహారము

శ్రీ రెడ్డిరాణి పత్రికాధిపతులకు—

అయ్యా!

నేను రచియించిన 'ఆంధ్ర భాషానుశాసనమునకు 'శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు, ప్రశస్తమైన పీఠిక వ్రాసి, దానిపై సదభిప్రాయమును వెలడించిరి ఆంధ్రపత్రిక, సమదర్శిని మున్నగు ననేక పత్రికలు వ్యాకరణమును ప్రశంసించినవి తెలుగు దేశమందలి వివిధ మండలములనుండి పాఠశాలా కళాశాలలలోని పండితులును, ఆంగ్ల విద్యాధికులైన యాంధ్ర భాషాభిమానులును, మంచి యభిప్రాయములను పంపియున్నారు ఇట్టి యెడ నా యందుగల ద్వేషముచేతనో, గ్రంథమందున్న యసూయ చేతనో వజ్రాయుధ పత్రికాసంపాదకులు మాత్రము నన్నును, నా గ్రంథమును బహువిధముల దూషింపసాగిరి ద్వేషముతోను, అసూయతోను, వ్రాసిన వ్రాతలకు నే నెపుడును సమాధాన మీయదలచుకోలేదు అందుచే "వజ్రాయుధ పత్రికలో ఆంధ్రభాషానుశాసనము గూర్చి వ్రాసిన నిందావాక్యములు చిత్తగించితిరా" యని నేను జాబు వ్రాయగా, శ్రీ రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారు నాకీ క్రిందివిధముగా బదులు వ్రాయుచు మీరీ జాబు ప్రకటింపవచ్చును అని యనుమతి ఇచ్చిరి. కావున వజ్రాయుధాధికారుల దూషణములతోడి విమర్శన యందలి యథార్థ్యము పాఠక లోకమునకుఁ దెలియుటకై ఈ క్రింది జాబును మీ పత్రికా రాజమునఁ బ్రకటింతురు గాక యని కోరుచున్నాను

చిత్తగించవలెను
మల్లాది సూర్యనారాయణశాస్త్రి
ప య్యేన సకలు
పర్లాకిమిడి
22—4—27

జవాబు

నే గిడుగు వేంకటరామమూర్తి అనేకనమస్కారములు చేసి చాయంగల విన్నపములు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి దూషణమునకు విూవంటివారి మనస్సు చలింపగూడదు లేనిపోనివన్నీ కల్పించి ఇతరులను నిందించడము ఆయనస్వభావముగాబోలు ఆయనకు ఎందులోనూ పాండిత్యమున్నట్లు నాకు కనబడదు ఆయనకు సంస్కృతభాషగానీ, ప్రాచీనాంధ్రముగానీ లెస్సగా రాదని ఆయన రచించిన గ్రంథములవల్ల స్పష్టముగా కనబడినది వ్యాకరణ మంటే ఏమిటో సంస్కారమంటే ఏమిటో అనుశాసనమంటేఏమిటో ఆయనకు తెలియదు. ఇటువంటయ్యల మాటలు వివేకులుపేక్షిస్తారు 2 భాషానుశాసనము, నిఘంటునిర్మాణము చేసేవారు ఇతరుల సాయముపొందుట దోషము గాదు దేవాలయము నిర్మించేవానికి రాళ్ళుతెచ్చి ఇచ్చినట్లు భాషానుశాసనము చేయబూనిన మీకు నేనున్ను, చిలుకూరి నారాయణరావుగారున్ను, కొన్ని ప్రయోగములు మేము సంగ్రహించినవి ఇచ్చినాము. అంతమాత్రాన శాస్త్రమును నిర్మించిన మీయోగ్యతకు లోపమురాదు. నేనుసంగ్రహించిన ప్రయోగము లన్నీ కీర్తిశేషులైన కందుకూరి వీరేశలింగము పంతులుగారు వ్యాకరణము రచించుటకు సంకల్పించుకొని 1919 ఫిబ్రవరి నెలలో నన్నడిగితే వారికి ఇచ్చినాను. అయితే మరి మూడునెలలలో వారు కాలము చేసినందున వారి సంకల్పము నెరవేరలేదు రాజమహేంద్రవరములోని తగుమనుష్యులనేకులు పంతులుగారికి నేను ప్రయోగములు ఇవ్వడము ఎరుగుదురు. జయంతి గంగన్న పంతులుగారు కాబోలు ఆ ప్రయోగములు తిరిగి నాకుపంపినారు. అవన్నీ పిమ్మట సంగ్రహించినవి మరికొన్ని మీకు ఇచ్చినాను అది మీరు ఉపయోగించి నాశ్రమ సార్థకము చేసినారు అదినాకు ఉపకారముగా ఎంచుకొని సంతోషించాను కీర్తిశేషులైన గురజాడ వేంకటప్పారావు పంతులుగారికిన్నీ నాకున్ను ప్రియమిత్రులైన బ్ర. వరుసల చినసీతారామస్వామిశాస్త్రిగారిని చిక్కని వ్యాకరణము రచించవలసినదనిన్నీ, ప్రాచీనకావ్యములలోని శబ్దములు లౌకిక శబ్దములు వేరువేరుగా పాణిన్యాదులు అనుశాసించినట్లు అనుశాసించవలసిన దనిన్నీ మేము ప్రార్థించినాము. అపుడు నేను సంగ్రహించిన ప్రయోగములు వారికి ఇస్తానని చెప్పినాను మావాదము కొంతమట్టుకైనా పండితులకు గ్రాహ్యముకావడమునకు శాస్త్రిగారి సాయమే కారణము అయితే వారు ఈ పనికి పూనుకోలేదు. మీరు పూనుకున్నారు. అందుచేత మీచేతిలో ఆ ప్రయోగములు పెట్టినాను వాటిలో మీకిష్టమైనవి మీరుస్వీకరించినారు.

3 ఇది భూతార్థము మీరీజాబు ప్రకటింపవచ్చును

ఇట్లు సేవకుడు,
గిడుగువేంకటరామమూర్తి.

ఈ లేఖలవలన మల్లాదివారి ప్రత్యేక కృషివిశిష్టత గ్రహించవచ్చును ఈ విషయం వారు చాలకాలంముందే ఒకసందర్భంలో ప్రస్తావించి, దీనియావశ్యకత నిట్లు పేర్కొన్నారు ఇపుడు తెలుగులోవున్న వ్యాకరణ గ్రంథములను ప్రయోగ శరణంబులగు భారతాది సద్గ్రంథములను నాధారముగా జేసికొని యెల్లప్రకరణములను సిద్ధాంత కౌముదిని బోలునట్లుగా విపులముగా ధాతుపాఠాదికమును జేర్చి సుబోధకముగు శైలితో నొకయాంధ్రకౌముదిని రచింపవలయును" అని ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రథమవార్షికసభలో అధ్యక్ష పీఠమునుండి చెన్నపురిలో పలికినారు ఆయభిప్రాయము మనసులోనుంచుకొని, 'ఆంధ్రభాషానుశాసనము' పేరున ఒకవ్యాకరణమును మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు రచించినారు, ప్రకటించినారు

మల్లాది సూర్య నారాయణశాస్త్రిగారు—ఆంధ్ర భాషానుశాసనంలో వ్యావహారిక భాషా ప్రయోగాలు కొన్నింటిని సూత్రములు కల్పించి వ్యాకరణము రచించారు. కాని వ్యావహారికభాషకు అది సమగ్రమైన వ్యాకరణము అనడానికి వీలులేదు. "వ్యావహారిక భాషకు కొన్ని నియమాలు" అని పేకుమళ్ల కామేశ్వర రావుగారు తమకు తోచిన కొన్ని సూచనలు చేశారు కాని అవి సమగ్రమైనవి కావు, శాస్త్ర సమ్మతమైనవి కూడా కావు. ఇటీవల వ్యావహారికాంధ్ర వ్యాకరణ మొకటి రూపొందిచ్చే ప్రయత్నంతో వాఙ్మయాధ్యక్షులు బిరుదు నామముగల పిల్లమూడి గోపాల కృష్ణయ్య గారొక గ్రంథము సిద్ధపరిచారు కాని దానిలో సూత్రములు పండితామోదము పొందినట్లులేదు పైగా వారు రచించన వాక్యాలు—వాడుకభాషలో నున్నవేమో కాని సూత్రప్రాయముగా లేవని విజ్ఞుల అభిప్రాయం—ఇటువంటి చిన్న ప్రయత్నములు కాక— వ్యావహారిక భాషకు సమగ్రమైన సర్వతోముఖమైన లక్షణ గ్రంథము రూపొందించ వలసిన అవసరమున్నది.

* రెడ్డి రాణి 1927 మే నెల సంపుటము—296 వ పుట.

అది యెవరో ఒకరిద్దరు వ్యక్తులవలన కావలసినది కాదు తెనుగు సంస్కృత భాషల లక్షణములను ఆధునిక భారతీయ భాషలను సొంతముగా తెలిసినవారు పూనుకోవలసిన ఘనకార్యము

పూర్వము ద్రావిడ భాషలను పరిశీలించి— వానికి పరిపుష్టమైన వ్యాకరణము బిషప్ కాల్డ్వెల్ పండితుడు— నూట యాభై సంవత్సరాల క్రితం చేసి ఒక పుస్తకం ప్రకటించాడు ఆతడు తెలుగు భాష వ్యాకరణము గూర్చి చేసిన పరిశోధన ఆధారముగా తెనుగులో కోరాడరామకృష్ణయ్యగారు "సంధి" గూర్చి గంటి జోగిసోమయాజులుగారు క్రియా పదముల గూర్చి కొన్ని నూతన పరిశోధనలు చేశారు అంతటితో తెనుగు భాష గూర్చిన పరిశోధన ముగిసేదికాదు

సుమారు రెండు వందల సంవత్సరాల క్రితంనుండి తెనుగు భాష నేర్చుకొనడానికి ప్రయత్నము చేసిన పాశ్చాత్యులు తెనుగు భాషగూర్చి ఇంగ్లీషులో గ్రంథాలు వ్రాశారు అటువంటి పుస్తకాలలో—సి పి బ్రౌను వ్రాసిన తెనుగు గ్రామరు చాలా ముఖ్యమైనది ఇదీ— ఈ పద్ధతిగా ఇంగ్లీషు వ్యాకరణ సంప్రదాయములలో రచించిన తెలుగు వ్యాకరణ గ్రంథములు తెనుగురాని పాశ్చాత్యులకు ఉపయోగించెవి మాత్రమేకాని తెనుగువారికి ఉపయోగపడేవికావు తెనుగుభాష అదృష్టమో దురదృష్టమో కాని తెనుగు పదములు, శబ్దములు, వాక్యములు నిరూపించిన సూత్రములు సంస్కృతములోను, ఇంగ్లీషులోను తెనుగు పద్యకావ్యములలోను రచించారు సంస్కృత వ్యాకరణములయిన 'కౌముది' వంటి వాని ధోరణు లనుసరించారు కాని తెనుగుతనము గుర్తించి తెనుగు భాషగూర్చి, తెనుగు పలుకుబడులు గూర్చి తెనుగులో సమగ్రమైన వ్యాకరణము రాలేదు

ఇట్టిది రావలెనంటే గ్రంథస్థమైన పూర్వకవి ప్రయోగాలే కాక, శాసనములలోను, పలుకబడులలోను వాడిన భాష ఉపయోగిస్తుంది నన్నయకు పూర్వమున్న భాష లోని తెలుగు తనం తెలుసుకోవాలి అంటే గాధా సప్తశతిలోని మాటలు ఆంధ్రవిషయములో ప్రవర్తిల్లిన సాహిత్యగ్రంథములలో వాడిన ప్రాకృతాంధ్ర శబ్దములు, శౌరసేని, అవధివంటి భాషలలో మాటలు ఉపకరిస్తాయి అన్నింటికంటె హెచ్చుగా తెనుగు భాష స్వరూపాన్ని తెలిపేది— తెనుగు ఊరుల పేరులూ అవి మార్పు చెందిన విధానమున్నూ విదేశాలలో ఊరు పేరుల గూర్చి పరిశోధన, చేయుడానికి ఎన్నో సంఘాలు పనిచేస్తూ ఉంటాయి. ఆ పద్ధతిలో మన దేశంలోకూడా ఊరు పేరుల గూర్చి భాషా పరిశోధన,చరిత్ర పరిశోధన, సాంఘిక వికాస రీతులు మొదలయినవి తెలుసుకోవడానికి ఊరు పేరు సంఘాలు సాధించవచ్చును ఆవిధంగా ఏర్పడితే, ఆంధ్రదేశములోని పలభై యూ ఏడువేల గ్రామాల పేరులు సేకరించి వాటిలోని భాషా విశేషాలు పరిశోధన చేయువచ్చును వాటిని గురించి ఒక పెద్ద వ్యాకరణమే పండితులయిన వారు నిరూపించవచ్చును. అది ప్రాచీనాంధ్రభాషా స్వరూపాన్ని తెలియజేస్తుంది

రానురాను, దేశి, మార్గ రీతులలో కవితపొందిన క్రమ వికాసాన్ని గమనిస్తే — భాషలోని ప్రయోగాలు ఎన్నో రూపములతో సాక్షాత్కరింపవచ్చును ఇట్టి రూపప్రక్రియలను సమన్వయపరచి ఒక వ్యాకరణము రచించవచ్చును అట్టి ప్రయత్నము మాత్రమింత వరకు జరుగలేదు అట్లే ఆధునిక కాలములో వ్యావహారిక భాషపొందిన అనేక రూపాంతరములు ప్రాంతములబట్టి, జాతులను బట్టి, ఆచార వ్యవహారములను బట్టి మారుతూ వచ్చాయి ఈ భాషపైన పలుకుబడి పైన ఇతర భాషల ప్రభావం అద్భుతంగా పనిచేసింది ఈ విషయము నిర్ధారణచేసి నిరూపణ చేసుకుంటూ తెనుగు వ్యాకరణము రూపురేఖలు దిద్దుకోవలసియున్నది నిజానికి భాష కాలాన్ని బట్టి భాషా పరిణామాన్ని బట్టి చిత్ర విచిత్ర గతుల మారిపోతూ జీవత్ భాషగా రూపు పొందుతుంది కాని— గ్రాంధిక చట్రములతో కట్టుబడి మృతప్రాయంగా నిలిచిపోదు మానవుల జీవిత వాహిక నిత్యనూతన పరిణామాలతో క్రొత్త రూపాన్ని సంతరించుకొంటున్నట్లే, భాషకూడా నూతన భావధారతో, నూతన సమాజ జీవనంతో వినూతన స్వరూపం దాల్చుతుంది ఇంత వింత పరిణామాలతో విభ్రాంతుల్ని చేస్తుంది ఈ విషయమే Randolph Quirk అనే నేత్తి పెల్లడించారు. A lively, Changing language is no doubt one sign of a lively changing society అని యాతని అభిప్రాయం విక్టోరియన్ యుగములో భాషలు పరివర్తనము అనగానే 'అభివృద్ధి' వికాసము అనువానికి పర్యాయ పదంగా ఉండేది అని Randolph Quick అనే భాషా పరిశోధకుడున్నాడు కాని యీ కాలంలో మార్పు అనగానే ఏదో క్షీణదశగా భావిస్తున్నారు భాషలో జీవంతమైన మార్పు వస్తే, ఇది మరీ దిగజారిపోయిన గ్రామ్యం, అసభ్యం అశ్లీలం అనే దృష్టి తో కొందరు చూస్తున్నారు. నిజానికి తెనుగు వ్యావహారిక భాషను అలాంటి దృష్టితో చూడవలసిన అవసరంలేదు. వర్తమానకాలంలో పండితులు ప్రముఖులు, పత్రికలు, ప్రజలు వ్యావహారికభాషనే వ్రాస్తున్నారు మాటలాడుతున్నారు. ఆ భాషలోనే తమ ఆవేశాలు, అభిప్రాయాలు వెలిపుచ్చుతూ ఉన్నారు తమ భావావేశాన్ని, ఆనంద తన్మయత్వాన్ని వ్యక్తపరుచుకోవడానికి ఆ భాషనే విశృంఖలంగా వాడుకొంటున్నారు ఇట్టి స్వేచ్ఛా సరస్వతి రూప లావణ్యాలు గుర్తించాలంటే, ఈ భాషాస్వరూపానికి తగిన లక్షణాలేర్పరుచుకో వలసియున్నది అందు నిమిత్తం—ఒక వ్యాకరణంకాదు ఎన్ని వ్యాకరణము లయినా రావలసియున్నది దీర్ఘ నిద్రా మగ్నులయిన తెనుగు లక్షణ కర్తలీ విషయమే పట్టించుకొన్నట్లులేదు ఆంధ్ర వ్యావహారిక భాషకు—సరియైన లక్షణాలు తెలిసికొని సమగ్రమైన వ్యాకరణము రచించినపుడు తెనుగుకున్న వ్యాకరణ దీపము చిన్నది కాదు విస్తృతమైన ప్రదేశానికి వెలుగు ప్రసరించ గలిగె పెద్ద దీపమే అవుతుంది కాని ఎంత పెద్దది చేసినా ఎద్దది కాదు



# ప్రజాపరిపాలనలో నియంతృత్వము

శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి

ఇండియా దేశము సంపూర్ణాధికారము బొందిన ప్రజారాజ్యమై (Sovereign Democratic Republic) 14 సంవత్సరములైనవి ఈ పదునాలుగు సంవత్సరములలో బ్రహ్మాండమైన అభివృద్ధిని మన దేశస్థులు ఆశించుచుండిరి. సాంఘిక సంక్షేమము సర్వతోముఖ అభివృద్ధిని పొందుననియు, దేశస్వాతంత్ర్యమును అవక్రముగ నిర్వహించుకొనుటకు సమర్థత మనకున్నదనియును, దృఢముగ నమ్మియుంటిమి దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించినామని చెప్పుకొనుచుండు కాంగ్రెసుపార్టీ వారి చేతిలో సౌష్టవము ప్రభుత్వము సాగి మన ఆశలు నెరవేరునని నమ్మక ముండెను. కాంగ్రెసు పక్షము ఆందోళనకే గాని అధికార నిర్వహణమునకు చాలదేమోనని మహాత్ముడే సందేహించినను, నెహ్రూ వంటి ఆదర్శపురుషుని చేతిలో పటేలు వంటి సమర్థుల సహాయముతో దేశమునకు సౌభాగ్యము కుదురునని విశ్వాసము నెగడియుండెను. కాని, గాంధిగారి నిర్యాణముతో ఆ విశ్వాసము కొంత సడలెను పటేలుగారి మరణముతో అవిశ్వాసము మొలకెత్తెను నెహ్రూగారి అనిశ్చితాభిప్రాయములతో, కమ్యూనిజముపట్ల అభిమానముతో, ఆదర్శములే గాని అనుభవయుక్తముకాని పంచశీల సూత్రములతో ప్రభుత్వముమీద ప్రజానురాగము సడలజొచ్చెను 1936 లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసుమీద ప్రజల కుండిన అనురాగము, భక్తి 1946 ఎలక్షను సమయమునకు చాలవరకు సడలిపోయెను తర్వాత 1952 లో జరిగిన రాజ్యాంగ చట్టము క్రింద మొదటి ఎన్నికలలో కాంగ్రెసుమీద అనురాగము అభిమానములు మరింత సళ్లబారెను తర్వాత ఎన్నికలలో కాంగ్రెసువారు ధన వ్యయముతో విజయమును పొందవలసిన పరిస్థితి ఏర్పడెను అట్లు కాక పోయిన 1957 ఎలక్షనులో రు 5 కోట్లకు మించి, 1962 ఎలక్షనులో రు 15 కోట్లకు మించి ఎలక్షను నిధిని కాంగ్రెసు పెద్దలు వసూలు చేయవలసిన అవసర మేర్పడినప్పుడు కాంగ్రెసు నైతికబలము, పరిపాలనా సమర్థత ప్రజల దృష్టిలో ఎంత దిగజారెనో వ్యక్తమగుచున్నది ఆ పతనమునకు గురి అయ్యును కాంగ్రెసు మరల 1962 లో అధికారమును చేపట్టగల బలము ఎట్లు చేకూర్చుకొన్నదో విజ్ఞులు వూహించలేకపోయారు పర్మిటు, కోటా, లైసెన్సు, లిచ్చు శక్తిని చేతియం దుంచుకొని యీ అధికారమును సాగించుచున్నదనీ, నైతిక బలమును కోల్పోయినదనీ అందరు ఎరిగిన రహస్యమే కాంగ్రెసుపార్టీ పీద పార్లమెంటులో జరిగిన విశ్వాసరాహిత్య తీర్మాన చర్చలో జె బి కృపలానీ గారు చెప్పిన మాట లివి "బ్రిటిషు పరిపాలనమే కాంగ్రెసు పరిపాలనముకంటె బాగుండెనని గ్రామప్రజలనుకొనుచున్నారు" అని ఆ కృపలానీగారు వెల్లడిచేసి యథార్థమును దృఢపరచిరి.

ప్రజాక్షేమ రాజ్యముగ పరిపాలించుటకు అనువగునట్లు అనాటి రాజకీయవేత్తలు ఇండియా రాజ్యాంగ చట్టమును తీర్చి దిద్దిరి రాజ్యాంగ చట్టముయొక్క 3 వ భాగములో ప్రసాదింపబడిన ప్రాథమిక హక్కుల ప్రాతిపదికతో దేశము అన్ని విధముల ముందడుగు వేయునని ఆశలు దృఢముగ ప్రజల హృదయములందు నెలకొనెను. కాని ఆ ఆశలు క్రమక్రమముగ ఛేదింపబడుచున్నవి గడచిన 14 సంవత్సరములలో, పావనమైన ఆ రాజ్యాంగ చట్టమునకు 16 సవరణ చట్టములు చేయుబడి 17 వ సవరణకు కాంగ్రెసు ప్రభుత్వము ప్రయత్న పడుచున్నప్పుడు రాజ్యాంగ చట్టముపైన, ప్రజల ప్రాథమిక హక్కులపైన, ఎంత గౌరవమర్యాద లున్నవో తెలిసికొనదగి యున్నది ఈవిధముగ ప్రజల హక్కులను విచ్ఛేద మొనర్చుటకు సోషలిజం అను ఊత పదము కాంగ్రెసు పక్షమునకు దొరికి విజయములను సాధించుటకు అవకాశమును కలిగించినది సోషలిజము అను పేరుతో కమ్యూనిజమును ప్రవేశపెట్టి కాంగ్రెసునకు కమ్యూనిజమునకు అంటుగట్టి తాను 'కమ్యూనిస్టునే'' నని ధైర్యముతో చెప్పుకొనగలిగిన నెహ్రూ నియంతృత్వములో కాంగ్రెసు పరిపాలన జరుగుచున్నప్పుడు ప్రజలకు ప్రాథమిక హక్కులు వినాశమగుటయే గాక, కమ్యూనిస్టు దేశములలో వలె వ్యక్తిస్వాతంత్ర్యమును కోల్పోవుట, ఆర్థికసౌష్ఠవము విరుగబడుట, సామాన్య ప్రజాజీవితము క్షీణించుట ఏర్పడినది ఈ దిగజారెడు దుస్థితిని ప్రజలు గ్రహించలేదనుకొనుట పొరబాటు —గ్రహించినా రనుటకు బుజువు సేలం, చిత్తూరు, అమ్రోహా, రాజకోట్, ఉత్తరప్రదేశ్, పశ్చిమబెంగాలు, మధ్యప్రదేష్, గోవా మున్నగు నియోజకవర్గములలో యిటీవల కాంగ్రెసుకు కలిగిన వోటములే

దేశములో ప్రజల కోరికె లివి—వాడకముదారునకు యుక్తమైన ధరలు, అందరికిని సమానావకాశములు, నివసించుటకు ఇలు, కట్టుకొనుటకు గుడ్డ, తినుటకు ఆహారము, త్రాగుటకు శుభ్రమైన నీరు, అందరికీ విద్య, పండించువారికి మంచి విత్తనములు కావలసిన ఎరువులు, లాభదాయకమైన ఉద్యోగ వసతులు, కార్మికులకు పని కల్పించకలిగిన గృహపరిశ్రమలు, కార్మికులమీద నుండు అభిమానము కర్షకులపై నుంచుట, వికలాంగులకు సరి అయిన సంరక్షణ పద్ధతులు ఇత్యాదులు. వీనిని కలిగించుట కాంగ్రెసు ప్రభుత్వమునకు ప్రథమ కర్తవ్యము, కనీస ధర్మము—వీని నియ్యక సోషలిజము అనుపేరుతో ఎన్నాళ్లు ప్రచారము చేసికొన్నను సాంఘిక ధర్మము, సంక్షేమము ఆశించిన దానిలో ఆవగింజంత యైనను కుదురదు అట్లు కానిచో సోషలిజం పేరుతో యాత్రను సాగించుచుండిన కమ్యూనిస్టు దేశాల దారిలో భారతదేశము గూడ దౌర్భాగ్యమునకు సిద్ధపడవలయును.

సామ్రాజ్య ప్రజల జీవితములపైన సంపూర్ణాధికారమును చెలాయించ బూనుటయే దేశమునకు గాని సౌభాగ్యమును తేజాలదు కమ్యూనిస్టు విధానములో ప్రముగించుచుండిన రష్యా, చైనాల వంటి పెద్ద దేశములు ఏవిధముగ తిండికి గుడ్డకు తక్కువపడి బాధపడుచున్నవో గమనించదగి యున్నది సామాన్య మానవ హక్కులను కాపాడుచు, జీవితస్వేచ్ఛను పెంపొందించుచూ సౌభాగ్యమును దినదినప్రవర్ధమానముగ పొందుచుండు అమెరికా, జపాను, పశ్చిమ జర్మనీ యిత్యాది స్వతంత్రదేశములు ఆదర్శప్రాయముగ ప్రజలకు జీవిత తృప్తిని కలిగించుటయే గాక, కమ్యూనిస్టు దేశాలకు కుత్తుకను అర్పు సమర్థములై యిప్పు డున్నవని తెలిసికొన్నప్పుడు, హక్కులను కాపాడెడి ప్రజారాజ్యములలో అభివృద్ధికిని, హక్కులను, వ్యక్తి స్వాతంత్ర్యమును నిర్మూలించిన కమ్యూనిస్టు దేశములలో ప్రజాసంక్షేమమునకును భేదము వ్యక్తమగుచున్నది ఇది తెలిసికొని గాంధీమార్గమును అనుసరించు కాంగ్రెసువారు అంతరాతీయ కమ్యూనిజానికి ఆహుతులు కాకుందురని హెచ్చరించవలసిన అదను ఏర్పడినది భారతీయ సంస్కృతి సంప్రదాయములు కమ్యూనిస్టు పరిపాలనాపద్ధతులకు భిన్నములని, వ్యతిరేకములని, మన జాతీయతకు భంగకరములని, వ్యక్తి స్వాతంత్ర్యమునకు ఉపద్రవకరములని, తెలిసికొని ప్రవర్తించుట యుక్తము కమ్యూనిస్టు విధాన ఆవరణములో నుండెడు సోషలిజము భారతీయులకు గిట్టదని, వారు కోరునది సాంఘిక ధర్మమనీ, దాని వలన ఉత్పన్నమగు సాంఘిక సంక్షేమమనీ, కాంగ్రెసు ప్రభుత్వము నియంతృత్వమును విడనాడి గమనించ గలిగినప్పుడే దేశముకోరెడు సౌభాగ్యము సమకూడును

దేశములోని దారిద్ర్యమును నిర్మూలించవలయునని, సౌభాగ్యమును పెంపొందించవలయుననీ, కాంగ్రెసు చేసెడి ప్రయత్నములలో ప్లానింగు కమిషను నిర్మాణ మొకటి. ఆ ప్లానింగు కమిషను ఆధ్వర్యమున రెండు పంచవర్ష ప్రణాళికలు గడచిపోయినవి 3 వ పంచవర్ష ప్రణాళికలో యిప్పుడు దేశము తడబడుచున్నది ఇప్పటివరకు జరిగిన ప్రయత్నముల వలన దేశము ఒక అడుగైనను ముందుకు సాగలేదని, 3 వ పంచవర్ష ప్రణాళిక అతృప్తికరముగ నున్నదని ప్రభుత్వాధినేతలే ఒప్పుకొని తప్పుకొనుచున్నారు ఈ ప్రణాళికల పర్యవసానమును గమనించి, మన ప్రధాని నెహ్రూ యిటీవలనే తన ఆశ్చర్యమును, విస్మయమును వెలిబుచ్చినాడు కాంగ్రెసు వారికి ప్రణాళికలు నడుపుటచేతగాదో అన్నట్లు ప్రజాసోషలిస్టు పార్టీ నాయకుడైన అశోకమెహతాను ప్రణాళిక సంఘ ఆధ్వర్యమున అధిష్ఠింప జేసినాడు బాహాటమైన ఉత్పత్తి, తక్షణ ఫలితములు, ఫలితములు మొదట బీదల కుపయోగపడవలయును, వ్యక్తి లాభమును తుడిచివేసి రాష్ట్ర పాలకుల లాభమును ఉద్ధరించగూడదు, ప్రభుత్వముయొక్క అధికారమును పెరుగనీయక ప్రజల సౌభాగ్యమును పెంచవలయును—ఇవి ప్రణాళికల కుండవలసిన ఆదర్శములు, అనుభవసాధ్యములు కాని, ప్రణాళికలను ఢిల్లీలో వూహించి నిర్మించి సాగించుటవలన దేశమునకు ఏలాటి సౌఖ్యము లేదనియు, బ్రహ్మాండమైన ప్రాజక్టులను, కర్మాగారములను కోటానుకోట్ల రూపాయలను వెచ్చించి నిర్మించుటలో ప్రజానీకమునకు ఉపయోగపడదని వ్యతిరేక పక్షముల వారు చేయుచుండిన వాదముల యొక్క యథార్థములను గ్రహించినాము అన్నట్లు గ్రామస్థాయినుండి యిప్పుడు ప్రణాళికలను నిర్మాణము చేయుటకు కాంగ్రెసు ప్రభుత్వము ప్రయత్నము చేయుచున్నట్లగపడుచున్నది ఆ దారి పెడదిరిగి రాజ్యాంగ చట్టము యొక్క 17 వ సవరణగా తేలినది, అని వూహించదగి యున్నది ఇక్కడను ఆ కమ్యూనిస్టు సిద్ధాంతమే వారికి తోచుచున్నది. ఈ 17 వ సవరణము వ్యవసాయకునకు, వ్యవసాయమునకు సంబంధించిన

యితర వృత్తులకు తాము సేద్యము చేసుకొనుచుండిన భూములమీద తాము నివసించుచుండు ఇండ్ల స్థలముల మీద సర్వాధికారమును తమకు కావలసి నప్పు డుపయోగించుట కొరకై కాంగ్రెసు ప్రభుత్వము ఈ సవరణకు పూను కున్నట్లున్నది ప్రజల డబ్బుతో పెద్ద, పెద్ద జాతీయ సంస్థలను నిర్మించు కొని నష్టపడుట చాలదని, గ్రామీణుల జీవనాధారమైన భూములను గూడ చట్టరీత్యా ఆక్రమించుకొని వారికుండిన స్వాతంత్ర్యమును, జీవనమును భంగ పరచుటకే యీ సవరణ వచ్చిన దనుకొనుటయందు పొరపాటు లేదు వ్యక్తి స్వేచ్ఛ, చొరవ, దున్నుకొని, పండించుకొని బ్రతుకువారినుండి తొలగించి, ఎక్కువగా సమిష్టిసేద్యము ద్వారా పండించవలెనను పద్ధతి కమ్యూనిస్టు రాజ్యములలో సర్వత్ర నిష్ఫలమైనదని తెలిసికొనియును, అట్టి కమ్యూ నిస్టు రాజ్యములలో అపజయము ఏర్పడి స్వతంత్ర రాజ్యములనుండి లక్ష లాది టన్నుల ఆహారపదార్థములను దిగుమతి చేసుకొనుచున్న కమ్యూనిస్టు దేశములు పడుబాధను గమనించిన కాంగ్రెసు ప్రభువులు ఆ దారినే నడచు టకు ప్రయత్నించుటవలన భారతదేశమునకు ప్రమాదము అత్యంత సన్నిహిత మైనదని వూహించుట కవకాశ మేర్పడినది. రైతుకు కావలసిన స్వేచ్ఛను, రక్షణలను, సదుపాయములను కలిగించుటకు మారుగ రైతును బానిసగా చేయుటకు పూనుకున్న ప్రయత్నము తప్పక దుష్ఫలమును తేగలదు

దేశాభివృద్ధికి ఆధారము పారిశ్రామిక అభివృద్ధియని తెలిసికొనిన కాంగ్రెసు ప్రభుత్వము, పారిశ్రామికవృద్ధికి ఆధారము ఆహారాభివృద్ధియని తెలిసికొనలేక పోవుట దౌర్భాగ్యము. ఆహారోత్పత్తిదారులకు కావలసిన సౌకర్య ములు కలుగజేయకపోవుటటుండనిచ్చి వానిపైన యెక్కువ భారములు ఒత్తిళ్లు కలుగజేయుటవలన ప్రమాదకరమని కాంగ్రెసు నియంతలు ఇప్పటి కైనను అపకారమును ఆపి ఉపకారమును కలుగజేయుట అవసరము, యుక్తము. రైతునకు అప్పుల బాధ, జీవన సమస్య మితిమీరుచున్నది అని ఒక ప్రక్కన ఒప్పుకుంటూ శిస్తుల పెంపకము, ఆహార ధాన్యోత్పత్తికి గిట్టుబాటు కాని ధరల నిర్ణయించుట, ప్రొక్యూరుమెంటు విధానమును మిల్లర్ల మీద, డీలర్ల మీద బిర్రుగా రుద్దుచు పరోక్షముగా ఉత్పత్తిదారులకు ధర పెరుగకుండా చేయుట మరొక ప్రక్క ఈ నాటి ప్రణాళికలలో ప్రధాన భాగములుగ నిర్ణయించు కొన్నట్లు కాంగ్రెసు నియంతలు క్రూరముతో ప్రవర్తించుచున్నారు. సహకార వ్యయసాయము వీగి పోయెనని స్వేచ్ఛా వ్యవసాయము ఉపయోగకరమని కమ్యూ నిస్టురకపు ఆర్థిక సూత్రములను మరచిపోవలయునని, నిర్బంధరహితమైన పెట్టుబడిదారి పద్ధతులు విజయవంతము లైనందున వానిని సత్వరముగ అనుసరిం చుట యుక్తమని రష్యాప్రధాని కృశ్చేవ్ 1962లో విశదపరచివున్నను రష్యా,చైనా వ్యయసాయ పద్ధతులవల్ల లోటేర్పడి లక్షలాది టన్నులను పెట్టుబడిదారి దేశముల నుండి దిగుమతి చేసుకొనుట ఋజువుపడినను మన కాంగ్రెసుప్రభుత్వ నియం తలకు జ్ఞానోదయము కాక ఇంకను సహకార వ్యవసాయము మీదనే తమ అభిమా నమును చూపుచుండుట, మన దేశములో దాదాపు 180 క్షేత్రములలో సహకార వ్యవసాయమును ఇంకను సాగించుచుండుటవలన ఎంతవరకు అధికార అర్హతను కాం గ్రెసు పొందుచున్నదో వూహించతగియున్నది— ఆక్షేత్రములకు పెట్టుబడి యెంతో, ఉత్పత్తి యెంతో, లాభనష్టములెంతో ఇంకను వెల్లడి కాలేదు ఇప్పటికే అమెరికా నుంచి తిండి గింజలను సంవత్సరం ఒకటికి 150 కోట్లు విలువగల వాటిని PL 480 క్రింద తెప్పించుకొనుచు ఇదివరకు చేసిన అప్పులుగాక క్రొత్త అప్పులపాలగుచున్నది భారతదేశము

ఇవి గాక "అప్పుగొనిసేయు విభవము" లో ఇండియాదేశము ఆనంద మున ఓలలాడుచున్నది 1939 సంవత్సరమున విభాగముకాని ఇండియా అప్పు 1180 కోట్ల రూపాయలు ఇది మొదటి పంచవర్ష ప్రణాళిక మొదటి సంవ త్సరమున 2773 కోట్లకు పెరిగెను. 1962—63 కు రూపాయలు 7996 కోట్లకుపెరిగెను అనగా 1939–1962 మధ్యలో యేడింతలు పెరిగెను. 1964 మార్చిఆఖరుకు 9364 కోట్ల రూపాయలకు పెరుగుచున్నది ఈఅప్పు ఎప్పుడు తీరునో, ఎట్లు తీరునో వూహించలేకున్నాము. ఈ అప్పులకు తగిన ముప్పులు యింకా యెన్నోఉన్నవి. వానిని వివరించుట కిచ్చట తావుచాలదు. ఒక్క మాటలో చెప్పవల యునన్న ప్రపంచపు బ్యాంకు ఇతర దేశములకిచ్చెడి అప్పులలో 60 శాతము మనకు అమెరికానుండి వచ్చియున్నది. రష్యా మున్నగు దేశములనుండి వచ్చిన అప్పు భాగము 7½ శాతము త్వరలో ఈ విదేశీఋణమును తీర్చుకొను ఉపాయము ఎట్లా అను సమస్య ఆర్థిక ప్రవీణులను బాధించుచున్నది అప్పుల కుప్పలో మునుగుచున్న కాంగ్రెసు ప్రభుత్వము ఎట్లు ఆలోచించుచున్నదో అర్థముకాదు. ఇదిగాక దేశ రక్షణ సన్నాహములో ఇంకెంతెంతో అప్పున ఇండియాదేశము మ్రగ్గవలసి యున్నదో పరిపాలకులు తెలిసికొనుట, పాలితులకు చెప్పుట అత్యవసరము.

మనదేశములో అమలుపెట్ట బడుచున్న క్రొత్త క్రొత్త పన్నుల విధింపుల వలన క్రుంగి పోవుచున్న ప్రజానీకము జీవితావసరములను సంపాదించుకోలేని వరుంబళ్లతో బాధపడుచుండుటట్లుండ, ఉక్కు కర్మాగారములమీద అనేక విధములైన జాతీయముచేయబడిన సంస్థలమీద అనుభవము లేని పెత్తనము వల్ల పెట్టుబళ్లు నానాటికి హెచ్చు చుండుటయు వరుంబళ్లు నానాటికి క్షీణిం చుటయు, ప్రభుత్వపు నివేదికల వలన తెలియుచున్నది. ఉదాహరణకు—3 స్టీలు కర్మాగారముల మీద 31—3—63 వరకు 698 కోట్లు రూపాయలు ఖర్చు పెట్టి 61½ కోట్లు రూపాయలను నష్టపడిరి రూర్కెలాలో 26 కోట్లతో నిర్మాణమైన ఎరువుల కర్మాగారము ఉత్పత్తిచేయక నిద్రపోవుచున్నది ఇట్టి అబం దర లెన్నియో కలవు స్వేచ్ఛగా ఉత్పత్తికి అడ్డు తగిలి జాతీయము చేసిన అనేక సంస్థలు అధోగతిలోనే యున్నవి. జాతీయము చేయబడిన బస్సు రవాణా సంస్థ దుర్గతి నానాటికి పెరుగుచుండుట ప్రజానీకమునకు దిన దిన ప్రత్యక్షాను భావమే గదా

జాతీయము చేయబడిన సంస్థలవలన ప్రభుత్వమునకు ద్రవ్యలాభము మిక్కిలి తక్కువగను ప్రజలకు సౌకర్యలాభము యెక్కువగను ఉండవలసినట్లు సిద్ధాంతము కాని మన దేశములో జాతీయము చేయబడిన సంస్థలలో విపరీత ముగా నష్టపడినే సంస్థలు అటుండనిచ్చి, లాభించుచున్న కొన్ని సంస్థలలో ఎంత విపరీత లాభమును ప్రభుత్వము పొందుచున్నది 1963 ఆడిటు రిపోర్టు బయట పెట్టుచున్నది హిందూస్థాన్ ఇన్‌సెక్టిసైడ్సు మీద లాభము 17 శాతము, ట్రావన్‌కూరు మినరల్సు లిమిటెడ్ మీద 21½ శాతము, హిందూస్థాన్ అంటి బయొటిక్సు మీద 27 శాతము, స్టేట్ ట్రేడింగు కార్పొరేషన్ మీద 56.7 శాతము 1961—62లో పొందెను ఈ సంస్థలు ముఖ్యముగ ప్రజాసామాన్య మునకు ప్రతిదినోపయోగవస్తువుల మీద తగిలించు విధింపుమీద వచ్చిన లాభము ఇదిగాక సిమెంటు కంట్రోలుచేసి కేంద్ర ప్రభుత్వము 11 కోట్ల రూ రూపాయలను 3 సంవత్సరములలో లాభమును పొందెను

ఇవి కొన్ని ఉదాహరణములే ఇంకను అనేకములు కలవు— దేశమునకు నష్టము, ప్రజాసామాన్యమునకు కష్టము కలిగించినవి

అమెరికా (U S.) దేశము అభివృద్ధి దశాబ్దంలో (Development decade) తన ఆర్థిక స్తోమతనుఅభివృద్ధిచేసుకొనుచున్నది తానుభవించుచు, ఇతర దేశములకు సహాయపడుచున్నది మనదేశములో ప్రణాళికల పేరుతో క్షీణపంచాబ్ద ములు రెండు దాటి 3—వ దానిలో మెలగుచున్నాము, నలుగుచున్నాము మనకును కొన్ని అభివృద్ధులు కలవు— పన్నుల వృద్ధి, అప్పుల అభివృద్ధి, జీవితవ్రయాభివృద్ధి జాతీయముగ చేయుచుండెడు వానిలోనష్టాభివృద్ధి, గృహ జీవన దుఃఖాభివృద్ధి, పరిపా లనలో ఆలస్యాభివృద్ధి, పలితములలో అతృప్తిఅభివృద్ధి, జాతీయమైన లంచగొండి తనములో అభివృద్ధి, దేశరక్షణయందు అశక్తతాభివృద్ధి, జనానీకమునకు హృదయ కల్లోలాభివృద్ధి.

ఈ ఫలితములు పరిపాలన సామర్థ్యలోపమునే గాక, ఋజువుపరచినను తెలిసికొనుటకు ఒల్లని కాంగ్రెసు నియంతృత్వము అని దృఢముగా తెలిసికొనదగి యున్నది.

# శివతపోభంగము

శ్రీ ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

కవికుల గురువైన కాళిదాసుని కవితాప్రతిభ జగత్ప్రసిద్ధముగదా! అది పలువురు కవివరేణ్యులకు కవితాస్ఫూర్తి నొసగె ననుటయు ప్రసిద్ధమే. ఆ కవీంద్రుని పాత్రసృష్టి నాధారముగ జేసికొనియే శ్రీనాథుడు హరవిలాసమును, నన్నెచోడుడు, కుమార సంభవమును రచించి యటనట కాళిదాసుని కమనీయభావములకు వన్నె వెట్టిరి ముఖ్యముగ శివతపోభంగ సన్నివేశ కల్పనమున కాళిదాసుని ప్రజ్ఞ మిన్నందినది. వసంతవిజృంభణ వర్ణనము, తదనుగుణముగ పార్వతీసౌందర్యపోషణము, ఆ రెండింటితో సరితూగు పాత్రౌచిత్యనిరూపణము మున్నగునవి ప్రత్యేక మొక్కొక రసఖండమయ్యు, పరస్పర భూషణ భూష్యభావముతో వెలసినవి అట్టి ఘట్టముల శ్రీనాథ, నన్నెచోడులు చేసిన రచనలు మూలమగు కాళిదాసుని రచనముతో పోల్చిచూడ దగినవి

సమాధినిష్ఠుడగు పరమేశ్వరుని కాళిదాసు—

"మనో నవద్వార నిషిద్ధవృత్తి హృది వ్యవస్థాప్య సమాధి వశ్యం

యమక్షరం క్షేత్ర విదో విదుః, తం ఆత్మాన మాత్మ న్యవలోకయంతం"

అను నిట్టి పదములందు చక్కగా వర్ణించినాడు. నవ ద్వారములనుండి మరలింపబడిన మనస్సును, ఈశుడు హృదయమున లగ్నముచేసి సమాధిస్థుడై తన్ను దానే అవలోకించు చుండెనట! అట్టి ఈశ్వరుని చూచి మన్మథుడు బెదరిపోయి, "ప్రస్త శర చాపుడై"నాడట! శివు డంత భయంకరుడుగ నుండెనా? శాంతుడుగ లేడా? ఆ శాంతత్వముననే గాంభీర్యము గలదు కాని యది అంత భయంకరము మాత్రముగాదు

ఈ ఘట్టమున శ్రీనాథుడు కాళిదాసును అనుసరించుచు, "నిస్తరంగకమైన మున్నీరువోలె, గర్జితములేని ఘన ఘనాఘనము వోలె ధ్యాననిశ్చలుడగు నిందుధరునిఁ జూచి, ప్రసవ నారాచుఁ డతిభయభ్రాంతుడు" అయ్యెనని వివరించినాడు. "ఉపమా కాళిదాసస్య" అను నా నుడి నంతరించుకొనిన కాళిదాసు భావమునకుఁ దానుపమానముల నదనముగా జేర్చి మెఱుగు పెట్టినాడు నిస్తరంగ సముద్ర మొక యుపమానము. అది నిస్తరంగమైనను, అత్యంత గంభీరము హరుడు—అట్టి—తుది మొదలు తెలియుని యగాధమైన, నట్టనడు సంద్రము వలె నుండెనట! కాళిదాసుని భావమునకు వన్నె రాలేదా? "గర్జితములేని ఘన ఘనా ఘనము" మరొక యుపమానము అట్టి శాంత గంభీరాకారము చూచి మదనుడు—

"ఎదన్ భయ కంపము లుప్పతిల్లగా తియ్యని విల్లు పుష్పములఁ దీర్చిన యమ్ములు. . . . . . . . భూమి బడవైచె" ననునది కాళిదాసుని ప్రస్త చాప శరత్వమున కనువాదము.

ఈ పరమ శివరూప వర్ణనముననే నన్నెచోడుడు వాడిన రీతిని జూడుడు.

"స్ఫురదాధార సరోజ పీఠహృదయాంభోజాత రంధ్రార్పిత
స్మరణాయత్త సముత్థితోజ్జ్వల తథాత్మజ్యోతి రుద్యాంగరు
స్ఫురస స్ఫాటిక హర్మ్య మధ్య కనక స్తంభంబో నాఁబర్వు నొ
త్తురు జూటాకృతి నున్న శంభు దెసవో నుల్కెన్ మనోజుండెదన్"

ఇదియు అశాంత గంభీర రూప వర్ణనమే. కాని రీతి వేరు. కాళిదాస, శ్రీనాథులు, వైదర్భీ రీతిని వాడగా నీతడు పాంచాలీ రీతిని వాడెను భయానకమును స్ఫురింపచేయవలసిన ఇప్పట్టున నిది యుచిత తరమని విజ్ఞులకు వేరుగ తెలుప నక్కరలేదు గదా! మఱొక విశేషము "మనోజుం డెదనుల్కెను" అని మాత్రమే నన్నెచోడుడు వ్రాసినాడు ప్రస్త చాపశరత్వమును రానీయలేదు. ఈ కవిరాజు రతిరాజు మనోధైర్యమును పోషించుట యావశ్యకమని యెంచియుండవలెను

"హృదయాంభోజాత రంధ్రార్పిత స్మరణాయత్త సముత్థితోజ్జ్వల తథాత్మ జ్యోతి" దర్శన మాత్రముననే ప్రస్త చాపశరుడై వచో నామదనుడు, ఇక కావలసిన కార్యమును, సాధింప జాలు ననుటసంభవముగదా! అని ఈ కవిరాజూహించి యుండవలెను ఇది యాతని పాత్రౌచితీ పోషణ చతురతకు నిదర్శనముగదా!

మన్మథుని కార్య సాధనకు సాధనమువలె శివసపర్యార్థ మగజ యేతెంచెను ఆ రాకను కాళిదాసు—

"నిర్వాణ భూయిష్ఠ మథాస్య వీర్యం సంధుక్ష యన్తీవ వపుర్గుణేన
అనుప్రయాతా వనదేవతాభ్యా మదృశ్యత స్థావర రాజకన్యా" అని

వర్ణించినాడు ఆభావమునే శ్రీనాథుడు—

"స్థావర రాజ తనూభవ యావేళన డాయ వచ్చె నభవుని సేవా
హేవాక ప్రౌఢిని వన దేవత లెంతయు గభీరగతి దనుఁ గొలువన్"

అని యనువదించెను. కాని కాళిదాసుని "వపుర్గుణము"ను "అభవ సేవా హేవాక ప్రౌఢి" గా మార్చినాడు పార్వతి వపుర్గుణముచే మన్మథుని వీర్యమును సుద్రిక్త పఱచుచుండెనా! యని కాళిదాసు ప్రేక్షింపగా శ్రీనాథుడు "సేవా హేవాక ప్రౌఢి" చే హరుని విలుప్త ధైర్యునిఁ జేయుట ఎట్లుచితమగు నను కొనెనో చింత్యము.

ఇక నన్నెచోడుడు సందర్భోచిత ప్రాముఖ్యముగల వపుర్గుణ వర్ణనమున నెక్కుడు సొబగు సాధించినాడు.

"ఆ లలితాంగి, భూషితలతాంత, విభూషణ జాల మంత్ర హం
సాలస మందయాన, వికచామల కోమల నీరజాస్య, బా
లాలికులాలి నీలకుటి లాలక, లోల విశాలనేత్ర కు
త్కీల తనూజ వచ్చె మరుదీపమువోలె పినాకిఁ బాలికిన్"

హరమనో ధైర్యమును లుప్త పరచుటకు ఈ శరీర సౌందర్యము మాత్రమే చాలియుండదని కవి యెంచినాడు కాబోలు! శారీరకాలంకార సమృద్ధిని కూడ నభివర్ణించినాడు. చూడుడు,

"కరవీర రచిత నూపురములు చెలువొంద
గాంచన పుష్ప మేఖలలు గట్టి
పున్నాగమయహారములు వెట్టి నవకర్ణి
కార శోభిత కటకములు వెలుగ
కేసర రాజీవకేయూరముల దొడి
రాజీవ కర్ణపూరము లమర్చి
తిలకాభినుత హేమ తిలకంబు లుప్పొంగ
జంపక మాలికా సమితిఁ దాల్చి
మధు లతాంతమయవిమండన మండితు
లైన కన్యకాచయంబు నడుమఁ
బొలిచె నద్రితనయ పుష్పిత జంగమ
లతలనడిమి కల్ప లతయుబోలె"

పుష్పములును, తదవచయమును, శృంగార రసమున కుద్దీపనములు గదా! వాని మాట కాళిదాసుని "అపచిత బలి పుష్పా వేది సమ్మార్గ దక్షా" అను శ్లోక పాదము వలన జ్ఞప్తికి రాగా నా పుష్పాపచయమును మనోజ్ఞముగ విరియింపజేసినాడు అది ఎట్లో చూడుడు —

"మెల పారు నెల మావి తలిరుల నొక కొన్ని
రమణీయమగు చంపకముల హొదివి
లాలితా శోక పల్లవముఁ నొక కొన్ని
గమనీయమగు గుర్వకముల వెట్టి
మాసరంపుటరంటి మోసుల నొక కొన్ని
గొమరారు కర్ణికారముల నించి
తరుణాంబుజాత పత్రంబుల నొక కొన్ని
యమళ సరసోత్పలములు సుట్టి
చెలువ లెల్ల నొండ చిగుళులు బువ్వులు
గలయ దాల్చి పోల్చి బలసి రాగ
శైల రాజతనయ సనుదెంచె నందన
వనము గాపువచ్చు వడువవోలె"

కాబోవు శృంగార రసోద్దతికి ఈపాటి సామగ్రి సమకూర్పవలెనని నన్నెచోడ కవీంద్రునికే తోచెను

ఇక ఆలంబన విభావము సంగతి

"ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం వాసోవసానా తరుణార్క రాగం
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా సంచారిణీ పల్లవినీ లతేవ"

అని మొదలుపెట్టి కాళిదాస కవిచక్రవర్తి పార్వతి పరమశివుని సన్నిధికి ఏతెంచుటను వర్ణించినాడు ఆమె తరుణార్క రాగమ్మైన వసనమును ధరించి స్తనభారముచేఁ గాబోలు కొలదిగ వంగినదై వచ్చెనట! ఆ కాళిదాసు—

"స్రస్తాం నితంబా దవలంబమానా పునఃపునః కేసర దామకాంచీం"

అనియు

"సుగన్ధి నిశ్వాస వివృద్ధతృష్ణం బింబాధరాసన్నచరం ద్విరేఫం
ప్రతిక్షణం సంభ్రమ లోలదృష్టి ర్లీలారవిందేన నివారయన్తీ"

అనియు పార్వతి హేలా విలాసమును వివరించినాడు ఆమె నితంబమ్ము క్రిందికి జారు కేసరదామకాంచిని మామాటికి పట్టుకొనుచుండెనట! అట్లే మాటిమాటికి నిశ్శ్వాస సుగంధమున కాసపడి తన ముఖము ముందట బింబాధరము చెంగట తిరుగాడుచున్న ద్విరేఫమున్ను, విలాసముగా చేత ధరించిన యరవిందముచేఁ ద్రోలుకొనుచుండెనట!

ఈ ఘట్టమును శ్రీనాథుడు —

"చనుగవ వ్రేగు నన్నిగుల నన్నవు గౌనసియాడఁ గెంపు మీ
తినునుఁ బట్టు చేలగటిఁ తింగులు వారఁగఁ గట్టి భూమి భృ
త్తనయ ప్రసూన గుచ్ఛములు దాలిచి లేజిగుత్తురుల్ ధరించి వ
చ్చిన నడ దీ వోలె నిలిచెందరు కేందుకిరీటుసన్నిధిన్"

అని వర్ణించినాడు

కాళిదాసు "ఆవర్జితా కించిది వస్తనాభ్యాం" అని కూర్చిన భావము నకు నీ కవివరేణ్యుడు" చనుగవ వ్రేగునన్ మిగుల సన్నవు గౌనసియాడ" అని మెరుగు పెట్టినాడు. కౌనసి యాడుట యందలి యొయ్యారము విశిష్టము గదా! అంతేకాక "తరుణార్క రాగవసనము" ధరించె ననుటకంటె నామె ఎట్లైనను రాజకుమారిగదా!—"కెంపుమీతిన నునుఁబట్టు చేల" ధరించె ననుట సొగసుగ నున్నది " ప్రసూన గుచ్ఛముల్ దాలిచి లేఁజిగురుల్ ధరించి వచ్చిన నడదీవ" యనునది కాళిదాసుని భావమే అయినను, "నడదీవ" యను లలిత మ్మైన యాచ్ఛిక సమాసము తెలుగుదనము నిటఁ గ్రుమ్మరించినది అట్లే కేసర దామ కాంచి జఘన పులినంబునందుండి జారిపడగ మాటి మాటికి హస్త పద్మముల నెత్తు" అను వాక్యము కాళిదాసు భావమును పూర్తిచేసినను, శ్రీనాథుడు "చపల భావంబుతో నుండె శంభు మ్రోల" అను అదనపు పాదమున తన ప్రతిభను విరియించినాడు. శివుని తన ప్రియునిగా ంచియుండుటచే నామె యట చపల భావ బుఁ జూపుట యనునది శృంగార చేష్టా విశేషముగ కవి సూచించినాడు అట్లే—

"కమ్మని యూర్పు గాడుపుల గందము క్రోలఁగవచ్చి యోష్ఠ బిం
బమ్ము సమీప దేశమున బాయక యాడెడ తేటి కేళిప
ద్మమ్మున మాటిమాటికి సముంచిత విభ్రమలోల దృష్టి యై
యమ్మదిరాక్షి చిమ్ము దరహాసవిక స్వర గండపాళియై"

అను పద్యమునందు అధిక భాగము కాళిదాసుని భావముల యనువాదమే యయినను, దరహాసవిక స్వర గండపాళియై యను విశేషము శ్రీనాథుడు దిద్దిన వన్నె.

ఇట్లింత చేసియు "తాం వీక్ష్య సర్వావయవా నవద్యాం రతేర ప్రీ పదమాదధానాం జితేంద్రియే శూలిని పుష్పచాప, స్వకార్యసిద్ధిం పునరాశశంసే" అనుచు కాళిదాసు వర్ణించిన బహు ముఖ్య భావమును శ్రీనాథుడేలనో విడచి వైచినాడు. శివుడు జితేంద్రియుడు. అందుచే తేలికగా మనశ్చాంచల్యము నొందడు ఆతనిని జయింపబూనుకొన్న మదనుడు పుష్పచాపుడు. శివుడో శూలి పుష్పచాపుడైన తాను జితేంద్రియుడై, శూలియైన, హరుని జయించి, స్వకార్యసిద్ధిని సాధించగలనని ఎంచగలడా? ఎంచజాలకున్నను, స్వకార్యసిద్ధి సాధనముగ ప్రత్యక్షమ్మైన యా పార్వతీ సౌందర్యమును జూచిన పిమ్మట తనకు, కొంత యాస కలుగకపోదు. ఆమె ఎంత అందగత్తె యయినను, జితేంద్రియుడైన శూలి మనస్సును, చలింపజేయ గలుగుట యసంభవము అయినను, మన ధున కాశారేఖ గోచరించుటకుఁ దగిన కారణము గలదు జగత్తునందలి సౌందర్య రాశి కెల్ల పరాకాష్టమ్మైన రతీదేవి చెలువు తనకు విదిత చరము అంతకంటె మించిన సొగసుకత్తె పార్వతి ఆమె సర్వావయ వానవద్య. అందుచే నాతడు స్వకార్యసిద్ధి నాశంసింపఁజాలెను ఇంత ముఖ్యమ్మైన సొబగు చిమ్ము భావమును, శ్రీనాథుడు స్పృశింపకుండుట వింతయే. కాని

"ప్రియము శోభిల్లఁగా సమర్పించె గౌరి
పసని పయ్యెద జాఱదోఁ పల్లవమున

భాను దీప్తులు నిట్టూర్చి ప్రసన్నమైన
పృథుల మందానిల పద్మ బీజమాల"

అను పద్యములోని "పసవి పయ్యెద జాఱ" అను మనోజ్ఞ భావమును ప్రవేశ పెట్టి యా లోటు తీర్చెనని చెప్ప నొప్పును

"రతేరపి హ్రీ పదమాదధానాం" అను కాళిదాస భావమును నన్నెచోడుడును గూర్చలేదు కాని వాచ్యముగ చెప్పకున్నను, వ్యంగ్యముగ చెప్పక మానలేదని గమనింపవలసి యున్నది ఇంతకుముందుదహరించిన "ఆ లలితాంగి భూషిత లతాంత" అను మొదలుగల పద్యమున

"మరునభివృద్ధి, పుష్ప శర మండన మంగజరాజ్య లీలకం
బరరిపు శక్తి, చిత్తభవు పట్టము, మారుమ దేభ మిందిరా
వ సుతునాజ్ఞ కాముక రవాల సమాయుధు దర్ప మారతీ
శ్వర జయలక్ష్మి" అను పద్యమున విస్తరింపబడినది

మరొక విశేషము శివుడు జితేంద్రియుడైన శాంత రసమూర్తి. పార్వతి, ఆతని లభునిగా బడయనెంచి యారాధించు శృంగార రసమూర్తి. మన్మథ ప్రభావ మతనిపైకంటె నామెపై ప్రసరించుట కవకాశము హెచ్చుగదా! మదనాస్త్ర ప్రభావ మామెపై బడగా నామె సహజ సౌందర్యము సహస్ర గుణాధికమై ప్రకాశింపగా, నద్దానివలన శివుడు కించిత్ప్రవిలుప్త ధైర్యుడగుట స్వాభావిక కార్యకారణ సంబంధ క్రమము. ఈ సుకుమార భావమును గమనించి నన్నెచోడుడు —

"అలికాగ్రంబున గ్రాలియాడి బొమలాహ్లాదింపఁ గనోనలం
దలకెన్ సమ్మదవారి మోవియదరెన్ తన్వంగిమై నొత్తెము
త్పులకల్ కంపము గూడ నార్చు లలమిన్ బొందెన్ మనం
బాత్మలో

గొలసెన్ రాగము మోమునం బొలసె గండోల్లాసహాసప్రభల్" అని మదనాస్త్ర ప్రభావము పార్వతిపై ప్రసరించుటను వివరించినాడు ఆమెకు కంపము, రోమాంచము, అశ్రువు మున్నగు సాత్త్విక భావములు విజృంభించెనని వర్ణించినాడు

తత్ప్రభావమున శివుడు చలించుటను—
"ఆ లలిత స్మితాస్య లలితాకుల కోమల చంచలాల సా
లోల విశాల సంస్ఫురితలోచన దృష్టిరస ప్రవాహ మం
దోలిన పర్వి వెల్లిగొని యొక్కట గ్రక్కున ముంచి మీ
దేలఁగనెత్తి, చుట్టి, హరుఁ ద్రిప్పులు వెట్టె మనోజుఁ డుబ్బగాన్"

అనుచు మఱొక మెట్టు దాటి, వివరింప నారంభించి,

"తన మహత్త్వంబు దలపక తరుణి పొంద
వడయ గీడ్పడి తేకువ వాపదలచు
భావజాస్త్రాభిహతి మహాదేవు డొక్క
వ్రేలిమిడి పెంపుసెడి కడువిదలి గొనియె"

అని మన్మథుని కార్యసిద్ధిని సంఘటింప జేసినాడు

ఇట్లు కాళిదాసోపజ్ఞములగు భావ వీచికలను, మూలనుగా జేసికొని నన్నెచోడుడు స్వప్రతిభా వికాస వైభవమును జత రచి, త్ర్యంబక ధైర్య లోపమునకు దగిన రీతిగ పార్వతీ రూప చిత్రణము చేసి ఔచిత్యమును పోషించినాడు.

ఇట్లీ కవిత్రయము ఆయాయి ఘట్టముల నొనర్చిన లలిత భావ రసాలంకార, ప్రౌఢి నిర్వర్తనమును పరిశీలించుకొలదిని సహృదయులకు ఆహ్లాదము వెల్లివిరియగలదు.



# భామతి

శ్రీ రాళ్ళపల్లి గౌరీపతిశాస్త్రి

వ్యాసుడు వ్రాసెను బ్రహ్మసూత్రములు
పూజ్య శంకరులు భాష్యము వ్రాసిరి !
ఆ భాష్యమునకు చక్కని వివరణ
వ్రాయ బూనె వాచస్పతి మిశ్రుడు !

భామతి వాచస్పతి మిశ్రుని సతి !
పసిడిమేని కాంతులతో నలరెడు
ఆమె రూపలావణ్య సంపదలు
అడవిని గాచిన వెన్నెల లాయెను !

శాస్త్ర చర్చలో, ఛాత్ర శిక్షలో
గడుపును వాచస్పతి పవలెల్లను;
రేయి దీపమిడి వ్రాయ దొడంగును
శంకర భాష్యమునకు వ్యాఖ్యానము !

కావ్యలోకమున విహరిస్తూ, వా
చస్పతి గడుపును కాలము రయమున
బరువు మనసుతో మూగ బాధతో
తోచు భామతికి రేయొక యుగముగ.

అర్ధ నిమీలిత లోచనములతో
ఆలోచనలో ఆతడు గడుపును
మనోనేత్రమున మగని ధ్యానమున
మక్కువతో ఆ మానిని గడుపును.

ఏకాగ్రతతో, కావ్య విరచనా
సరళి స్మరిస్తూ ఆతడు గడుపును
విరహా వేదనా భరిత హృదయమై
ప్రియుని స్మరిస్తూ భామతి గడుపును.

కోరిక అతనికి కావ్యసుపుత్రిక
కోరు నామె యొక చక్కని బిడ్డను
మనోజకోర్కై అతని యత్నము
మనోజ వేదన దుర్భర మామెకు !

లక్ష్య మొకటి, లక్షణములు వేఱై
యుండుట సహజము లోకమునందున
లక్షణసామ్యత కల దిద్దరకును !
లక్ష్యం మాత్రం వేరిద్దరకును !

తన మనోరథము సిద్ధించుటకై
మగని ప్రసన్నుని గానొనర్పగల
ఉపాయమునకై అన్వేషింపగ
స్ఫురించె నామెకు ఒక సదుపాయము !

గాఢ తిమిరమును దీపము బాపును
ప్రబలును తిమిరము దీపము బాసిన;
మదిగల విరహపు తలపుల తిమిరము
బలమై జయించు దీపము తీసిన !

సామాన్యముగా దీప పాత్రలో
తైలము పోయును భామతి నిండుగ
నాడు తక్కువగ తైలముపోసెను
దీపము వేగమె ఘనమైపోవగ !

యథారీతి వాచస్పతి మిశ్రుడు
కావ్యలేఖనం కావిస్తూండగ
స్వల్పవ్యవధిలో దీపము ఘనమై
కలిగె నిరోధము కావ్య విరచనకు !

"యావత్తైలం తావ ద్వ్యాఖ్యా
న' మ్మనుకుంటూ అతడు లేచెను
దీపము త్వరగా ఘనమైపోయిన
కారణ మేమని భామతి నడిగెను ।

"కావ్య సుపుత్రికి మీరలు జనకులు
కావలె నేనొక బిడ్డకు మాతను

మాతృత్వంతో స్త్రీ వ్యక్తిత్వం
పరిణతినందును పరిపూర్ణముగా !"

భావ గర్భితపు భామతి పలుకుల
అంతర్యమతని కవగత మయ్యెను;
పెదవుల మందస్మితము మెఱయగా
పలికె కలికితో గంభీరముగా—

"వెఱ్ఱి భామతీ ! సప్త సంతతుల
కావ్య సంతతియె మిక్కిలి శ్రేష్ఠము
జరచే వికృతము కానిది కావ్యము !
నాశన రహితము, నిత్యశోభితము !

గర్భ జనితులా బిడ్డలన్ననో ?
ఎఱుగము కద వారెట్టి వారలో !
మన ఖ్యాతికి వన్నెలు దిద్దెదరో,
కల ఖ్యాతి కళంకిత మొనర్తురో !

క్షణికమైన మన తను వాంఛలతో
కృతి కవరోధము కలుగజేయకుము
నీ సహకారం నాకు లభిస్తే
త్వరగా కావ్యమ్మగు సంపూర్ణము !

పూజ్యశంకరుల భాష్యమునకు, నా
వివరణ గ్రంథమునకు నీ పేరిడి
"భామతి"గా ప్రకటింప దలచితిని
నీ వొసగుము నా కృషికి దోహదము"—

పతి పలుకులలో గల పరమార్థం
భామతి కప్పుడు విశదమ్మైనది !
తొందరపాటున తా నొనరించిన
తప్పిద మామెకు తెలిసివచ్చినది !

కావ్య విరచనా దీక్షాపరుడౌ
కాంతుని కృషిలో సహకరించినది
పతి కృత "భామతి" వ్యాఖ్యా గ్రంథం
అవతరింపగా యశము నందినది !

---

నాటకము:

# నీలిమబ్బు

శ్రీ హితశ్రీ

**పాత్రలు**

| | | |
|---|---|---|
| శారద | — | గిరి |
| రాజేశ్వర్ | — | గోవిందరావు |
| మాధవ్ | — | శరభయ్య |
| | | నరసింహం |

సమయం ఉదయం ఎనిమిది గంటలు.

మేడమీద పోర్షన్‌లో డ్రాయింగు రూము. గది మధ్యగా టీపాయ్, కొన్ని కుర్చీలు, కొద్ది దూరంలో ఒక టేబిల్, దానిమీద రేడియో సెట్, కొన్ని పత్రికలు స్టేజి ఎడమవైపు, కుడివైపు, వెనుక మూడు ద్వారాలు. కుడివైపు దారి. బయటికివెళ్ళే దారి. ఎడమ వైపు గోడకు ఒక నిలువు టద్దం.

తెర లేచేసరికి రాజేశ్వర్ అద్దంముందు నిలబడి టై కట్టుకుంటూంటాడు. ముప్ఫయిమూడేళ్ళ వయసు. ముఖంలో దర్పం ఉట్టిపడుతూంటుంది.

రాజే శారదా, శారదా

శారద (ప్రవేశిస్తూ) వస్తున్నానండీ

ముంజేతిమీద కోటుతో, రెండోచేతితో సిగరెట్ టిన్‌తో శారద ప్రవేశము ఇరవై అయిదు, ఇరవై ఆరేళ్ళ వయసు ఆకర్షణీయమైన విగ్రహం

రాజే వేగిరం

శార (సిగరెట్ టిన్ టీపాయ్‌మీద ఉంచి, కోటు తొడుక్కోటానికి అతనికి సహాయపడుతూ, ఏమిటండి అంత తొందర ? ఇంకా నాలుగు మూలలా తెల వాఁలేదు

రాజే తెల్లారలేదూ ! మై గాడ్ (స్వరంతగ్గించి చిలిపిగా) గడియారపు గదిలో చిన్నముల్లు ఎనిమిదో భార్య కౌగిట్లో వాలిపోయింది. మై డియర్ శారదా

శార (చిరునవ్వుతో) చాల్లెండి పెళ్ళయి పదేళ్ళయినా చిలిపితనం మాత్రం పోలేదు

రాజే 'ఇద్దరు పిల్లలు పుట్టినా'—అని కూడా కలుపు అన్నట్టు శ్యామూ రాముా ఏరీ ?

శార : కాన్వెంటుకి వెళ్ళిపోయారండి.

రాజే . అప్పుడే

శార . ఇవాళ మీరు ఆలస్యంగా నిద్రలేచారండీ.

రాజే అవునవును. రాత్రి చాలసేపు ఆఫీసు కాగితాలు చూస్తూ గడిపాను. ఎప్పుడో తెల్లవారుజామున కునుకు పట్టింది.

శార : నిద్రలేక కళ్ళు ఎర్రబడ్డాయి. ఇదేం చాకిరండీ ? పొద్దస్తమానమూ—?

రాజే ఊరికే జీతం రావాలి కదూ ?

శార ఏం జీతమో. మనిషికి బొత్తిగా విశ్రాంతి లేదు చూస్తూ వూరుకో వలసిందే కాని, నేను చేసే సహాయం ఏమీ లేదు. కదా ! ప్చ్.

రాజే . (నవ్వి) ఏం సహాయం చేయాలిట ? శారదా, నువ్వు నా కెంత సహాయంగా వున్నావో నీకు తెలియదు, నిజం. ఏదో పూర్వజన్మ పుణ్యంకొద్దీ నువ్వు నాకు భార్యగా దొరికావు. యూ ఆర్ మై ఏంజిల్ మై స్వీట్ రోజ్ నే నెంతో అదృష్టవంతుండి శారదా.

శార (ప్రేమగా) అలా అనకండి. అంతా నాదే అదృష్టం. (బూట్సు బ్రష్ చేసి యిస్తుంది.

రాజే . (బూట్సు వేసుకొని) పెళ్ళిళ్ళు స్వర్గంలో నిశ్చయమౌతాయని ఇంగ్లీషులో ఒక ఆర్యోక్తి.

శార ఎక్కడ నిశ్చయమైనా జరిగేది ఈ లోకంలోనే కదా ! స్వర్గమో నరకమో భార్యాభర్తల ప్రవర్తనని బట్టి ఉంటుందండి.

రాజే అవునవును. సిగరెట్ ప్లీజ్,

శార · (సిగరెట్ అందిస్తుంది) ఇవాళ బిజీ ప్రోగ్రాం ఉందనుకుంటాను.

రాజే . అబ్బే పెద్ద బిజీ ప్రోగ్రాం ఏంలేదు.

శార : మరి ప్రొద్దున్నే ప్రయాణం అవుతున్నారు. బ్యాంకు పదింటికి కదూ?

రాజే బ్యాంకి ఇన్‌స్పెక్షన్ జరుగుతోంది ఆ ఇన్‌స్పెక్టరు మహాశయుడు టి. బి. లో వేంచేసి యున్నాడని చెప్పానుకదూ ? హో కుశలప్రశ్న వేసి, అట్నుంచి శరభయ్య దగ్గిరికి వోసారి వెళ్ళి వచ్చేస్తా. అంతే.

శార . శరభయ్య ఎవరండీ ?

రాజే వెజిటబుల్ ఆయిల్స్ ఏజంటు లేడూ ? అతను.

శార (నవ్వుతూ) అతనితో మీకేం పనండీ ? ఓ నూనెడబ్బా పట్టించుకొస్తా రేమిటి ? ఇంటిల్లిపాదీ అప్పత్రి చుట్టూ తిరగాలండోయ్

రాజే . (నవ్వి) అబ్బే, నీ కతని సంగతి తెలీదు శారూ నూనె డబ్బా అని తెచ్చు కుంటే, తీరా తీసి చూస్తే అందులో ఉండేది నీళ్ళే.

శార · మంచినీళ్ళా, ఉప్పునీళ్ళా (నవ్వుతుంది.)

రాజే · (నవ్వి) ఏవైనా, మురుగునీళ్ళు కావులే.

శార బాగుంది. ఆ వర్తకశ్రేష్ఠుడు కబురు పెడితే రాడుటండీ మీరు పని గట్టుకు వెళ్లట మెందుకు.

రాజే . అవసరం మనదీ బ్యాంకులో ఓ యాభై వేల రూపాయలు అప్పు తీసుకున్నాడులే వాయిదా మీరింది ట్టడు. ఇన్‌స్పెక్షను జరుగుతూ ఉన్నదాయె కాస్త గట్టిగా చెప్పి, నెత్తిమీద కూచుని వసూలు చెయ్యాలి మరి

శార అసలు వూళ్ళో ఉన్నాడా, ఎక్కడికైనా ఉడాయించాడా ?

రాజే నువ్వన్నదీ నిజమే ఈమధ్య వూళ్ళో లేడు రాత్రి వస్తాడని కబురు తెలిసింది. మళ్ళీ తెల్లారి ఎక్కడికీ పారిపోకుండా పట్టుకోవాలి

శార బ్యాంకు ఏజంటుగారికి మంచిపనే పెట్టాడు.

రాజే హాహా, బాగా చెప్పావు. అప్పిచ్చేదాకా వాళ్ళు వదలరు. ఇచ్చిం తర్వాత మరి మనం వదలం (నవ్వుతాడు.)

శార బ్యాంకు ఏజంట్ను నక్షత్రకుని చంపి పుట్టారండి.

రాజే ఇప్పటి ప్రపంచ మంతా విశ్వామిత్ర సృష్టిలాగే ఉందిలే.

శార మరి త్రిశంకు లెవరండీ ?

రాజే మధ్య తరగతి ప్రజలు

శార అంటే మనం కూడా ఆ తరగతిలోనే చేరతామా ?

రాజే : ముఖ్యంగా మనమే హోదాకు తగ్గట్టు ఖర్చు పెడదామంటే తాహ తుండదు. తాహతుకి తగ్గట్టు గడుపుదామంటే హోదా అడ్డొస్తుంది.

శార నెల కయిదు వందలు సంపాదించే మీరే అలా అంటే—

రాజే ఇహ ఇతరుల సంగతి ఏమనాలి అంటావు. అంతేనా వాళ్లకి ఈ త్రిశంకుస్వర్గం లేదుగా

శార మీ కబుర్లకేంలెండి. మీరు చేసే దూబరా ఇంకెవరూ చెయ్యరు.

రాజే హతోస్మి. ఇంకేం స్వచ్ఛంద సేవికాదళం ఒకటి ఏర్పాటుచేసి ఇంటింటా జాతీయ పొదుపు ఉద్యమప్రచారం ప్రారంభించు ప్రభుత్వం వారి తరఫున ఒక బంగారుపతకం సమర్పించుకుంటాను

శార నవ్వుతూ) అదే దూబరా అంటే

రాజే (నాలిక కరుచుకొని) ఓ—సారీ. సర్టిఫికేట్‌తో సరిపెట్టేస్తాలే. మరి నేను వెళి వస్తాను.

నిష్క్రమిస్తాడు. శారద టేబిల్‌దగ్గరకు వచ్చి పత్రికలు తిరగేస్తూ ఉంటుంది కొద్దిక్షణాలు తర్వాత చేతిలో ఒక కవరుతో రాజేశ్వర్ తిరిగి ప్రవేశం )

రాజే . (కవరుమీది అడ్రసు చదువుతూ) మిసెస్ శారదా రాజేశ్వర్.

శార (చప్పున అతనివైపు తిరిగి) అప్పుడే పోస్టు వచ్చిందా ?

రాజే . లేదు మేడమ్ ఇది లోకల్‌టపాలో డెలివరి అయింది.

శార ఎక్కడినించండి ?

రాజే మహిళామండలి నించి డియర్.

శార (సంతోషంగా) ఏదీ ? (అందుకుని) ఏమండీ, ఇదేమిటో తెలుసా ?

రాజే ఓ.

శార . (కవరు చింపి త్వరగా చదివి) ఏమండీ, కంగ్రాట్యులేషన్స్ చెప్పండి. మిమ్మల్నే చెప్పండి. (ఉక్కిరిబిక్కిరౌతుంది) అబ్బ.

రాజే కంగ్రాట్యులేషన్స్.

శార థాంక్సు, ఎందుకో తెలుసా ?

రాజే ఓ.

శార : ఒట్టిది. మీకు తెలియదు తెలిస్తే చెప్పండి మరి.

రాజే పీపుల్స్‌బ్యాంక్ ఏజంట్ శ్రీ రాజేశ్వర్‌గారి సతీమణి మిసెస్ శారదా రాజేశ్వర్‌గారు మహిళామండలి వార్షిక సమావేశంలో బహుమ ప్రదానం చేస్తారు. బస్, ఎ సింపుల్ మేటర్ టు గెస్. యామ్ ఐ రైట్ ?

శార నో నో నో.

రాజే అయితే తమరి కేవో ప్రైజ్ వచ్చిందన్నమాట.

శార (నవ్వి) ప్రైజా ? ఎందుకండీ ప్రైజ్ ?

రాజే : (తల గోక్కొని) ఎందుకా ? ఆఁ! పొదుపు పుట్టు పూర్వోత్తరాల్ని బయ టికి లాగి తద్విశ్వరూపసందర్శనాన్ని కాగితంమీద జయప్రదంగా ప్రజాసామాన్యానికి ప్రసాదించిన ఘనతకి. ఏం ?

శార . (నవ్వి) ఇంక మీరు పొదుపు చెయ్యవలసిన అవసరం లేదు లెండి.

రాజే . అదేం ?

శార రెండు చేతులా సంపాదిస్తుంటే ఇంక డబ్బుకి కొరవేముంటుందండి ?

రాజే అంటే ?

శార వేడినీళ్ళకి చన్నీళ్ళు తోడు.

రాజే నీ అభిప్రాయం ?

శార నేను కూడా ఉద్యోగం చేస్తానండి.

రాజే నువ్వా ? ఉద్యోగమా ?

శార ఏం చేయకూడదా ?

రాజే : అహఁ—ఎందుకు చేయకూడదూ ? కాని, ఇచ్చే దెవరు ?

శార అంటే నే నెందుకూ పనికిరానిదాన్ననేగా మీ అభిప్రాయం ? చిరుకోపంతో మూతి ముడుస్తుంది.)

రాజే అబ్బే, నా అభిప్రాయం కాదూ—

శార ఉద్యోగం ఇచ్చేవాళ్ల అభిప్రాయమా ?

రాజే ఎస్—ఐ మీన్—అంటే ఉద్యోగం ఇచ్చేవాళ్లకి నీ విలువ ఏం తెలు స్తుంది చెప్పు ? ఇంటర్వ్యూ దాకానే రాదు ఈ రోజుల్లో ఎన్నో అర్హత లున్నవారికే—

శార : (కోపంగా) నా అర్హత మీకు తెలియకపోయినా, మహిళామండలి వాళ్ళ కైనా తెలిసింది. పోన్లెండి. గుడ్డిలో మెల్ల.

రాజే అంటే ?

శార గర్వంగా) అంటే ఏమిటో ఉత్తరం చదివితే తెలుస్తుంది.

రాజే : (ఉత్తరం తీసికొని చదివి ఆశ్చర్యంగా) మహిళా మండలిలో నిన్ను నెలకి 150 రూపాయల జీతంమీద ఇన్‌స్ట్రక్టర్‌గా నియమించారా ? నిన్నే ?

శార : ఆఁ మిసెస్ శారదా రాజేశ్వర్‌నే తెలిసిందా ?

రాజే : (గట్టిగా వూపిరి పీల్చి వదిలి) ఆశ్చర్యంగా ఉంది.

శార · (దగ్గరగా వచ్చి) ప్లెజంట్ సర్‌ప్రైజ్ ఏం ?

రాజే (సర్దుకుంటూ) ఊఁ ... ఊఁ కానీ ఎప్పుడు దరఖాస్తు చేశావు మాట మాత్రం కూడా నాతో అనలేదే

శార : నిజం చెప్పాలంటే ఈ ఉద్యోగం వస్తుందని నేను అనుకోలేదండీ

రాజే · అయితే ఎందుకు దరఖాస్తు చేశావు ?

శార . వాళ్ళు అడిగిన అర్హతలు నాకున్నాయి. ఓ రాయి విసిరి చూద్దా మనిపించింది.

రాజే ఎవరిమీద ?

శార (షాక్ తిని) ఆఁ ! అదేమిటండీ, అలా అంటారు ?

రాజే ఈ మహిళామండలి కార్యదర్శిని మాటవరుసకి నాతో ఈ ఉద్యోగం విషయం ఎత్తిఉంటె, నేను తెల్లముఖం వేసి ఆమెవైపు గుడ్లప్పగించి చూసేవాడిని కదూ ?

శార మీకు ఆమెతో పరిచయం ఉందని నాకు తెలీదండీ

రాజే ఎందుకుండదు ? బ్యాంక్ అన్న తరువాత లక్షమందికి నాతో అవసరా లుంటాయి పరిచయా లౌతాయి ఈమాత్రం తెలియదా ?

శార . మీతో చెప్పుకోకూడదని నే నెప్పుడూ అనుకోలేదండి ఉద్యోగం నిజంగానే వస్తే తమాషాగా ఉంటుంది. అనుకోని శుభవార్త ఎంతో ఆనందం కలిగిస్తుంది అని ఏమిటో పిచ్చిగా ఆలోచించి ఇలా చేసాను మీకు కష్టం కలిగిస్తే క్షమించండి

రాజే . (చల్లబడి) అదికాదు శారూ నాకు తెలీకుండా నువ్వీ దరఖాస్తు పెట్టావని ఎవరికైనా తెలిస్తే, మనిద్దరిమధ్యా ఏవో అపోహలు, కలతలు ఉన్నాయని లేనిపోని అపవాదు వస్తుంది అదీ పరిస్థితి. ఇంక అలా బాధపడకు మరి నా శారూ సంగతి నాకు తెలీదూ ?

శార . నన్ను క్షమించారు కదూ ?

రాజే . పిచ్చి శారూ. నువ్వే నన్ను క్షమించాలి తొందరపడి నీకు కష్టం కలిగించాను

శార అలా అనకండి ఏమండి నిజంగా మీకు సంతోషంగానే ఉంది కదూ?

రాజే ఎందుకుండకూడదూ ?

శార : వెంటనే ఉద్యోగంలో చేరవలసిందని రాశారు కదండీ.

రాజే . (నిరుత్సాహపరుస్తూ) ఆఁ—ఏం ఉద్యోగంలెద్దూ !

శార . అదేమిటండి నూటయాభై రూపాయల జీతమైతే !

రాజే చాకిరీ చెయ్యద్దూ శారూ ?

శార మీకంటె నేను కష్టపడిపోతున్నా నేమిటి ?

రాజే నేను మగవాడిని నాకు తప్పదు. పైగా అదొక గొప్ప ఆత్మ తృప్తి నిస్తుంది శారూ

శార సంసారబాధ్యత నేనూ పంచుకోవాలి కదండీ

రాజే నువ్వుమాత్రం వూరికే కూర్చుంటున్నావా ? ఇంతకంటె నువ్వు కష్టపడితే నేను చూడలేను ఆడది సంపాయించిపెడుతుంటె మగవాడు తిని కూర్చునే దౌర్భాగ్యం ఈ దేశాని కింకా పట్టలేదు

శార ఆడది సంపాదించటం దౌర్భాగ్యమా ? కుటుంబానికి, దేశానికి అంతో ఇంతో సేవ చెయ్యడం సౌభాగ్యంటండీ ?

రాజే అబల, శిరీష కోమలశరీర, మధుర ప్రణయిని—నిర్జీవంగా ఒక ఆఫీసులో కుర్చీకి అతుక్కుపోవడంకంటె విషాదకరదృశ్యం మరేముంటుంది. నో, నో, నో.

శార : (ఆశ్చర్యంగా ఏమిటండి. ఇంత చదువుకొని మీరింకా వూహాలోకంలో విహరిస్తున్నారా ?

రాజే : ఊహాలోకమా ! నీ కెవరో బాగా నూరిపోశారు.

శార ఎవరో నూరిపోస్తేగాని నా బాధ్యత నాకు తెలియదా ?

రాజే తెలిస్తే ఇలా మాట్లాడవు

శార నాకు స్వంత అభిప్రాయా లుండటానికి వీల్లేదా ?

రాజే ఏమిటి శారూ ? అలా అర్థరహితంగా మాట్లాడతావు ! నీ అభిప్రాయాలతో నేనెప్పుడు జోక్యం కలుగజేసుకున్నాను.

శార : లేదు లేదు. నాకు స్వంత అభిప్రాయా లేమిటండి ? నాకో విశిష్టమైన వ్యక్తిత్వం కావాలని నే నెప్పుడూ కోరుకోలేదు కోరను. ఈ రోజులు ఇలా నిర్విచారంగా గడిచిపోతే చాలు

రాజే . నా హృదయా న్నెలా గాయపరుస్తున్నావో నీకు తెలియటంలేదు. రోజులు నీ కెప్పుడూ నిర్విచారంగానే గడిచిపోతాయి అందుకోసం నువ్వు ఉద్యోగం చేసి కూడబెట్టాల్సిన అవసరంలేదు ఒకవేళ నేను డామ్మని ఉన్నట్టుండి చచ్చినా నీకు వెంటనే ముప్పయివేల రూపాయల ఇన్సూరెన్సు డబ్బువస్తుంది

శార (చెవులు మూసుకుని గాద్గదికంగా) ఛీ ఎంత పాడుమాట అన్నారు. ఇదేనా మీ కర్థమైంది. డబ్బుకోసం నేను గంగవెర్రు లెత్తిచస్తున్నానా.

రాజే (చప్పున చల్లబడి) అదికాదు శారూ నాకంటే నీ బాగు కోరేవా ళ్లెవరున్నారు ? నే నన్నీ ఆలోచించి చెబుతున్నాను. నేను అభ్యుదయనిరోధకుడినని నువ్వు అనుకోవచ్చు కానీ ఈ ఉపన్యాసాలు దంచేవాళ్ళకి అభ్యుదయం అంటే ఏమిటో తెలియదు సంప్రదాయాలమీద తిరుగుబాటు చేయటమే అభ్యుదయలక్షణం కాదు. పాతలో మంచిని గ్రహించే విజ్ఞత రావాలి. ఉద్యోగాలు చేసి ఊళ్ళేలటంలోనే సుఖముందని భ్రమపడి ఎండమావులవైపు రొజుకుంటూ పరిగెత్తటమే అభ్యుదయ మనుకంటేనేనేం చెప్పలేను

శార . అభ్యుదయ మేమిటండి ? నేనేదో బాగుపడాలని, ఎవరినో వూళ్ళో వాళ్ళని ఉద్ధరించాలనీ ఉద్యోగానికి ఎగబడుతున్నానా ? నా సంసారం కోసం, నా భర్తకోసం, నా పిల్లల కోసం ఉద్యోగం చేయటం తప్పా ?

రాజే తప్పని కాదు శారు. అవసరం లేదంటున్నాను.

శార · పొద్దున ఎనిమిదింటికి పిల్లలు కాన్వెంటుకు వెళ్ళి సాయంత్రం నాలుగున్నరకి గానీ రారు మీరు పదింటికి ఆఫీసుకి వెడితే మళ్ళీ అయిదింటికే రాక ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే బదులు చేతైన పని చేస్తే కాలక్షేపమూ అవుతుంది. కాస్తో, కూస్తో డబ్బూ వస్తుంది. దీని కేమిటో లక్ష చెబుతారు.

రాజే . సరే నీతో వాదనెందుకు నేను ప్రపంచంలో పుట్టి సాధించేదేమీ లేదు. కాకపోతే నా భార్యా, బిడ్డలకి ఏ లోటూ రాకుండా నిర్వహించగలుగుతున్నాననే ఆ కాస్త గర్వమూ కూడా నాకు లేకుండా చేస్తావు కదూ !

శార (ఫీలయి) మీరలా బాధపడ్తా రనుకుంటే, ఇంతసేపు ఇలా మాట్లాడేదాన్నే కారండి మీ మాటకి ఎప్పుడు ఎదురు చెప్పాను ? మీ గర్వమే నా గర్వమంటే మీ ఇష్టప్రకారమే చేద్దాం. ఏం, సరేనా ?

(ప్రవేశం గిరి రాజేశ్వర్ వయసే ఉంటుంది ఖరీదైన దుస లు. ఏ విషయాన్నైనా తేలిగ్గా తీసుకొని మాట్లాడే స్వభావం. చేతిలో జిప్ బాగ్ ఉంటుంది.)

గిరి (ప్రవేశిస్తూనే) అపూర్వ తరుణం. అమోఘ సమ్మోహాస్త్రం. అలసించిత ఆశాభంగం ఆంధ్రుల అందచందాల కుందనపు బొమ్మ కుమారీ పూర్వశి నృత్యప్రదర్శన. రసగ్రహణ పారీణుల కొక ఇక్షుఖండం రాజేశ్వర్, ఆ ఝుళంఝుళత్కటక సూచివేగ పదారవిందాల్ని కన్నులారా చూచి తరించు ఏదీ, నాట్యకళాదేవి చరణ మంజీరాలకి నా నీరాజనం ? (బాగ్ తీసి టిక్కెట్ల పుస్తకం, కరపత్రం బయటకి లాగి రాజేశ్వర్ వైపు పడేస్తూ) పేట్రన్ టికెట్ యాభై రూపాయలు మాత్రం !

రాజే (నవ్వుతూ) అలసిపోయావుగానీ కాస్త తీరిగ్గా వూపిరి పీల్చుకోవోయ్ గిరీ.

గిరి వూపిరి పీల్చుకోవటానికి తీరి కెక్కడిది ? రెండు టికెట్లు రాస్తున్నా (పుస్తకం చేతిలోకి తీసుకుంటాడు.)

రాజే (పుస్తకం లాగి బల్లమీద పడేసి) ఆ విషయం తర్వాత ఆలోచిద్దాం గానీ మాకో చిన్న సలహా ఇవ్వు.

గిరి ఓ దానికేం భాగ్యం సలహాలకి నాది పెట్టింది పేరే అది కలహానికి దారితీస్తే నాది కాదు పూచీ. తర్వాత పెట్టకు పేచీ నీ తరహా చూస్తే ఏదో ఉన్నట్టే ఉంది వ్యవహారం (శారదవైపు చూచి) అన్నట్టు శ్రీమతి రాజేశ్వర్ కూడా ఇక్కడే ఉన్నారే నమస్కారమండీ.

శార నమస్కారం
(కరపత్రం అందుకుని చూస్తూంటుంది.)

రాజే మా శారద ఉద్యోగం చేస్తుందటోయ్.

గిరి వెరీగుడ్ అయిడియా

రాజే మహిళామండలిలో ఇన్‌స్ట్రక్టరు ఉద్యోగం వచ్చింది.

గిరి ఓహో ! బహు దివ్యంగా ఉంది.

రాజే ఉద్యోగం చెయ్యవచ్చునా నీ ఉద్దేశ్యం ?

గిరి అవశ్యం

రాజే ఆలోచించి చెబుతున్నావా ? (కనుసన్న చేస్తాడు.)

గిరి (గమనించకుండా) అదే పొరపాటు ఆలోచించటం మనిషికి అలవాటు అది వాడి దురదృష్టం. మనిషి మెదడులోకంటె, ఆతడి ఉద్రేకాల్లో వాసనల్లో, హృదయస్పందనల్లోనే నాకు నమ్మకముంది ఆలోచించి, తర్కించి, వితర్కించి మనిషి చివరికి ఏది చెయ్యకూడదో అదే చేస్తాడు తెలిసిందీ ?

రాజే నువ్వొక వింతమనిషివిలే

గిరి అదే పొరబాటు అంతో, ఇంతో వింతగా ప్రవర్తించని మనిషంటూ ఈ ప్రపంచంలో ఉంటాడా అని

రాజే (శారదవైపు చూచి) ఒకవిధంగా నిజమేనేమో. మా శారదకి ఇలా వింత బుద్ధి వుడుతుందని నే నెప్పుడూ అనుకోలేదు.

శార ఇంతటితో ఆ ఉద్యోగం విషయం వదిలేద్దురూ.

గిరి విషయం వదిలినా ఉద్యోగం వదలటానికి వీల్లేదు శ్రీమతి రాజేశ్వర్ గారూ

శార బాగుంది మీరు వద్దని సలహా యిస్తారని మావారు ఆశపడితే చుక్కెదురయింది

రాజే నాకు మన సంప్రదాయాలమీద గౌరవముంది మన పూర్వులు గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తలు ఒక్కొక్క వృత్తిలో ఒక్కొక్క వృత్తి ప్రావీణ్యం సంపాదించి ఆ వృత్తిమీదే దృష్టి కేంద్రీకరించటంవల్ల ఉత్పత్తి అధికమౌ తుందనే శ్రమ విభజన సిద్ధాంతాన్ని మనవా శ్లెప్పుడో

ప్రూహించి అమల్లో పెట్టారు. ఆ సిద్ధాంతం ప్రకారమే, భర్త జీవిక సంపాదించాలనీ, భార్య కుటుంబాన్ని నిర్వహిస్తూ భర్తకు చేదోడు వాదోడుగా నిలిచి గృహసామ్రాజ్యాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలాలనీ నిర్ణయం జరిగింది ఆ ఆచారమే అనూచానంగా వస్తోంది ఇది ఇప్పుడు ఎందుకు మారాలో నాకు తెలీటంలేదు

గిరి : (చప్పట్లు కొట్టి) హియర్, హియర్ ఇప్పుడు శ్రీమతి శారదా రాజేశ్వర్ తీర్మానానికి వ్యతిరేకంగా మాట్లాడుతారు.

శార (నవ్వి) లేదండీ నేను ఈ సమావేశానికి అధ్యక్షురాల్ని.

గిరి ఓ అయితే నేను వ్యతిరేకిస్తాను మిత్రులారా ! ఈ నిర్ణయంలో ఏదో దురన్యాయం ఉన్నట్టు నాకు తోస్తోంది నా హృదయం ఈ నిర్ణయాన్ని ఒప్పుకోటంలేదు అసలి విధంగా వ్యవస్థని ఏర్పాటు చేయటానికి కారణం మగవాడిమనసులో గూడు కట్టుకున్న స్వార్థం. అది ఎలా చిందులు తొక్కుతుందో నేను చెప్పటానికి సాహసించను స్త్రీ పురుషుల మధ్య సమత నెలకొనాలంటే ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి తప్పనిసరిగా ఉండాలనీ అప్పుడే భార్యాభర్తల మధ్య నిజమైన ప్రేమ వర్ధిల్లుతుందనీ నా విశ్వాసం

శార • (చప్పట్లు కొట్టి) హియర్ హియర్ కాస్టింగ్ వోట్ ఎటు వేయాలో మరి !

రాజే సరిగా ఆలోచిస్తే కదూ నా వాదనలో పస తెలిసేది.

గిరి . అదుగో మళ్ళీ ఆలోచన అంటావు ఆలోచన ఎప్పుడూ మనిషిని పెడ దారి తొక్కిస్తుందోయ్ జడదారీ మెదడు అన్న తర్వాత వక్రించకుండా ఉండదు ఈ ప్రచ్ఛన్నయుద్ధాలూ, వైషమ్యాలూ, ఉద్రిక్తతా, తీవ్రతా—ఇవన్నీ ఆలోచనాఫలితాలు కావూ ? అందుకే మును ములు వట్టి బుద్ధిజాడ్యజనితోన్మాదు లన్నాడు పెద్దన.

రాజే అందుకని పశుప్రాయమైన జీవితం గడపాలా ?

గిరి ఏది పశుప్రాయ జీవితం ? కేవలం ఉద్రేకాల్ని, వాసనల్ని అనుసరించటమైతే కావచ్చు కానీ, అదికాదు నా ఉద్దేశం హృదయస్పందనం ఏ పరిస్థితిలో నైనా ఎవరికైనా ఆలోచనకి ఏమాత్రం ఆస్కారంలేని చక్కటి సలహా ఇస్తుంది అది వెంటనే విసం ఆలోచన ప్రారంభిస్తాం. ఇహ అది పెద్ద సముద్రపు టలలా విరుచుకుపడి మనసుని, ఒడ్డును కోస్తుంది ఇంకేముంది మనిషి వింతపశువైపోతాడు

రాజే థాంక్స్. నీ ఉపన్యాసం వినటానికి కింక టైం లేదు త్వరగా వెళ్ళాలి

గిరి టిక్కట్టు ప్లీజ్ .

రాజే ఒకటి చాలు.

గిరి థాంక్స్. మరి శ్రీమతి రాజేశ్వర్—

రాజే మా శారద. డాన్సు ఇష్టంలేదు.

గిరి : ఐసీ.

శార నాకు తల నొప్పిండీ నృత్యంగురించి నాకేం తెలియదు నిలా ఆనందించగలను

గిరి రాజేశ్వర్ వంటి కళాప్రియుడు, రసికశిఖామణికి సహధర్మచారిణీయ్యుండీ—

రాజే హుష్ ! గిరీ ! ఏమిటా ధోరణి ?

గిరి . ధోరణి ! ఈనెల నృత్యభారతి పత్రికలో ఊర్వశి నాట్యం గురించి అంత బ్రహ్మాండంగా వ్రాశావే. నాకు తెలియదనుకున్నావా ?

రాజే • నే వ్రాశానా ?

గిరి మారుపేరుతో వ్రాస్తే ఎవరి తెలియదనుకున్నావు కదూ ? ఊర్వశి టాంటాం వేశేసిందిలేవోయ్

రాజే అబ్బే ఆమె పొరబాటుపడి ఉంటుంది

గిరి అచ్చువేసేముందు వ్రాతప్రతికి ఆమె అనుమతి దొరికిందని కూడా తెలుసు మహాశయా ?

రాజే నీ కెవరో అబద్ధాలు చెప్పారు.

శార ఆమెది ఈ ఊరేనా ?

గిరి అవునండి నాట్యం కూడా ఇక్కడనే నేర్చుకున్నది ఇప్పుడిప్పుడే ప్రదర్శన లిస్తోంది అదృష్టవశాత్తు రాజేశ్వర్‌లాంటి సద్విమర్శకుల మెప్పు లభించింది ఇంకేం ! ఆఘమేఘాలమీద పాకిపోదూ

రాజే . నేను రాయలే దంటూంటే వినవుగద !

గిరి చూశారా శ్రీమతి రాజేశ్వర్‌గారూ ఎలా బుకాయించేస్తున్నాడో ! మీరు నా పక్షం వహించాలి

శార రాజేశ్వర్ వైపు చూస్తూ) ఏమండి మీకు నృత్యంగురించి అంత బాగ తెలుసని నా కెప్పుడూ చెప్పలేదు కదూ!

గిరి వాట్ ఇది మీకూ రహస్యమే ! మై గుడ్‌నెస్.

రాజే రహస్యానికి ఇందులో ఏముంది ?

గిరి మరి అబద్ధం ఎందుకోయ్ సుబుద్ధీ.

రాజే (పొరపాటు తెలుసుకొని) పబ్లిసిటీ బాధలు నీకు తెలియవూ ?

శార గిరిగారూ, మా శ్యామకు చెప్పండి బ్యాంకింతా టాంటాం వేసేస్తుంది

రాజే అందుకే కదూ నీకు చెప్పలేదు.

శార పోన్లెండి దాచుకోండి రహస్యం

రాజే అబ్బే, అదికాదు నిన్ననే కదూ పత్రికవచ్చింది చెబుదామనుకుంటూనే మర్చిపోయాను

శార (పత్రికలో 'నృత్య భారతి' వెతికి వ్యాసం చూస్తూ ) మర్చిపోరూ !

గిరి మరుపును ప్రసాదించి దేవుడు మనిషికి ఎంత చెరుపు చేశాడో !

శార (వ్యాసం చూసి) ఏమిటండీ మీ మారుపేరూ ? 'విశారద్' బాగుంది సుమండీ

రాజే (ప్రసన్నుడై సొంతంగా పేరు పెట్టుకునేటప్పుడు 'శారద' ని ఎలా మర్చిపోతాను శారూ అందుకే 'విశారద్ !'

శార • (అత్యంత సంతోషభరితురాలై ) తెలుసుకోలేకపోయానండీ !

గిరి . ఆమాటకొస్తే రాజేశ్వర్ ఎత్తుగడలు ఎవరూ తెలుసుకోలేరండోయ్ ! క్లబ్బులో అతనితో డంకా పలాస్ ఆడినవాడి కొంప క్లోజ్ !

రాజే గిరీ ! ఏమిటా అనవసరప్రసంగం !

శార : (అమాయకంగా) డంకాపలాస్ ఏమిటండీ ?

గిరి అదొక జూద విశేషం.

శార జూదమా !

రాజే అతని మాటల కేమిటిలే శారూ. ఏదో అసందర్భంగా మాటాడుతూంటాడు. గిరీ, క్లబ్బులో నేను బ్రిడ్జి తప్ప ఇంకేమైనా ఆడుతుంటే చూశావా ? ఎక్కడ, ఎప్పుడు హాస్యమాడాలో కూడా తెలియదా ! ఊం—శారూ, గిరికి వో యాభై రూపాయలు తెచ్చివ్వు. ఇంక శలవు పుచ్చుకుంటాడు

శార . అలాగే (మధ్య ద్వారం నుంచి నిష్క్రమణ.)

రాజే అబ్బబ్బ గిరీ చంపేశావు కో ఆడవాళ్ళ దగ్గర కొంచెం ఆలోచించి మాట్లాడకూడదూ ?

గిరి · అదే పొరబాటు. మళ్ళీ ఆలోచన అంటావు. నేను అన్నదాంట్లో తప్పేముంది ?

రాజే · నీకో నమస్కారం. సరేగానీ, నేనే నీ దగ్గరికి వద్దామనుకుంటున్నాను· ఆడబోయిన తీర్థ మెదురైంది. ఓ చిన్న సహాయం చేయగలవూ ?

గిరి · పరోపకారార్థ మిదం శరీరం.

రాజే · జనరల్ మర్చెంటు శరభయ్య నెరుగుదువు కదూ ?

గిరి . బాబోయ్, ఆయనతో లావాదేవీ నావల్లకాదు. ఆ మళ్ళాగుళ్ళాలు నేను పడలేను. మరే సహాయమైనా కావాలంటే అడుగు.

రాజే సరే. నాకో యాభై వేలు అప్పివ్వగలవూ ?

గిరి (ఆశ్చర్యంగా) యాభై వేలే ? ఎందుకూ ?

రాజే శరభయ్య బ్యాంకుకి బాకీ ఉన్నాడు అది వాయిదా మీరిపోయింది ఇప్పుడు ఇన్‌స్పెక్షను జరుగుతోంది ఆ అప్పు అలా ఉండటం నా రికార్డుకి పెద్ద మచ్చ.

గిరి అయితే నీకు అప్పు ఎందుకూ ?

రాజే శరభయ్య ఇవాళ బాకీ తీరిస్తే సరేసరి తీరుస్తాడనే అనుకుంటాను. ఒకవేళ మొత్తం జతపడలేదని తాత్సారం చేస్తే ఉపయోగించుదామని అడుగుతున్నాను.

గిరి నీ కేమైనా చాదస్తమా ! అనవసరంగా చిక్కులు కొనితెచ్చు కుంటున్నావు బాకీ తీర్చకపోతే హామీ సరుకు అమ్మేస్తానని బెదిరించు.

రాజే ఆ వివరాలన్నీ నువ్వు నాకు చెప్పాలా ?

గిరి మొహమాటాలకి పోవద్దని చెబుతున్నాను.

రాజే నేను తెలివితక్కువ వాడినా ! బ్యాంకులో మీ శ్రీమతి పేర యాభై వేలు ఫిక్సెడ్ డిపాజిట్ ఉంది కదూ ? ఏమంటావు, మరి ?

గిరి పెద్ద యిరకాటంలో పడేశావు నువ్వనుకున్నంత సులభసాధ్యం కాదు బ్రదర్

రాజే గిరీ మీ ఆవిడ నీ మాట సులభంగా తోసేస్తుందని నే ననుకోను

గిరి మా ఆవిడకి నామీదా, డబ్బుమీదా కూడా సమానమైన ప్రేమే మరి !

రాజే ఆ డబ్బు కాస్త గల్లంతయితే, ఆ ఖాళీలో నీమీద ప్రేమ వ్యాపించటానికి అవకాశం ఉంటుందిలే

గిరి అబ్బే ! ఆ ఖాళీ నా వేపుకే విస్తరిస్తుంది

రాజే వేళాకోళానికేంగాని, ఆపత్సమయంలో నువ్వు నన్నాదుకోవాలి.

గిరి . ఆపత్తు, సంపత్తు ఒకటిగానే చూడాలనేది మన సంప్రదాయం.

రాజే సంప్రదాయాల కేమిటిలే నయాన కాకపోతే భయాన్నయినా మీ శ్రీమతిని ఒప్పించి నాకే సహాయం చెయ్యాలి గిరి

గిరి స్త్రీ ప్రేమ పంచదార బస్తాలాంటిదోయ్ జడివాన కురిస్తే అది కాస్త కరిగిపోతుంది భయపెడితే అసలుకే మోసం

రాజే నువ్వేమైనా అను. అవసరమైతే చెప్తాను. నువ్వు తప్పక నన్నాదుకోవాలి

గిరి ప్రయత్నిస్తాను.

(శారద ప్రవేశం.)

శారద . ఇదిగోనండీ యాభై రూపాయలు.

గిరి థాంక్స్ వస్తానండీ. రాజేశ్వర్, సెలవు (నిష్క్రమణ.)

శార . ఏమిటండీ ఈ దుబారా ? నిన్న కాక మొన్న వందరూపాయలు పారేసుకున్నారు.

రాజే (చుబుకం స్పృశించి) పర్వాలేదులే శారూ. నాకోసం ఎవరైనా వస్తే ఇప్పుడే వస్తానని చెబుతావు కదూ !

(రాజేశ్వర్ నిష్క్రమిస్తాడు. శారద కాసేపు పత్రిక తిరగవేసి బల్లమీద పడేస్తుంది తర్వాత ఉద్యోగపు ఉత్తర్వుని మరోసారి చదివి పెదవి విరిచి కవర్లో పెట్టి బల్లమీదికి గిరవాటేస్తుంది. ఆ తర్వాత రేడియో స్విచ్ ఆన్ చేస్తుంది. ఏదో నిరుత్సాహకరమైన గీతం వినిపిస్తూంటుంది. కుర్చీలో జారగిలబడి ఆ పాట వింటూ ఏదో ఆలోచిస్తూంటుంది.

మాధవ్ ప్రవేశం. ఇరవై ఏళ్ల యువకుడు. బీదదుస్తులు, వెలిసిపోయిన స్లాక్, పాంట్ )

మాధవ్ నమస్కారమండీ . . నమస్కారమండీ

శార (తలెత్తి పరధ్యానంగానే అతనివైపు చూసి మళ్లీ చూపులు కిందికి వాల్చి) ఎవరు ?

మాధ బీదవిద్యార్థినండీ. కాలేజీలో బి. ఏ ఆఖరిసంవత్సరం చదువుతున్నాను

శార . (నిర్లిప్తంగా) ఏం కావాలి ?

మాధ చాలా యిబ్బందుల్లో ఉన్నానండీ ఫీజు కట్టటానికి డబ్బు లేదు· కాలేజీనుంచి పేరు తీసేశారు.

శార నేనేం చెయ్యను ?

మాధ ఏదైనా సహాయం చేస్తే మీ మేలు మర్చిపోనండీ.

శార ఏంలేదు. వెళ్ళు.

మాధ తమలాంటివాళ్ళే అలా అంటే—

శార · నీక్కాదూ చెప్పేది ?

మాధ దయతలిచి ఏమైనా ఇస్తే చాలా సహాయం చేసినవా రవుతారండీ.

శార అబ్బా, కాకిగోల !

మాధ మీకు విసుగు కలిగిస్తే క్షమించండి.

శార . (కోపంగా) ఎందుకలా ప్రాధేయపడతావు. ఎంత బీదవాడివైతే మాత్రం కాస్త ఆత్మాభిమానం ఉండొద్దూ ? (రేడియో ఆపి లేచి అతని దగ్గరగా వచ్చి) నువ్వసలు విద్యార్థివేనా ? (క్షణం అతనివైపు తేరపార చూసి) నువ్వు . నువ్వు ఎవరు ? ... నీ పేరు ?

మాధ · (ఆమెవైపు దీక్షగా చూస్తూ) నా పేరు మాధవ్ అండీ.

శార మాధవ్ · (ఆలోచనగా) మీ నాన్నపేరు ?

మాధ వెంకటప్పయ్యగారు

శార ఏం ఉద్యోగం ?

మాధ · ఎలిమెంటరీ స్కూల్ టీచర్ చేసేవారండీ.

శార అంటే ఇప్పుడు లేరా ?

మాధ . చనిపోయి తొమ్మిది సంవత్సరాలైందండీ

శార : అయ్యో. మీదేవూరు ?

మాధ : రాచవరప్పాడండీ. మా నాన్న పోగానే ఆ ఊరు వదిలి వచ్చేశాం.

శార : రాధ, గోపి కూడా ఇక్కడే ఉన్నారా ?

మాధ : (ఆశ్చర్యంగా) ఆఁ ! మమ్మల్ని మీ రెరుగుదురా ?

శార : నే నెవరో గుర్తులేదా ?

మాధ (పోల్చుకుంటూ) మీరు .... మీరు . ..

శార అంతగా మారిపోయానా ? నేను శారదక్కని కాదా మాధవ్ ?

మాధ : (చప్పున గ్రహించి) శారదక్కా ! ఎన్నాళ్లకు చూశానూ ?

శార. (కన్నీళ్లు గిర్రున తిరుగగా) మాధవ్! ఇలా చితికిపోయిందా మీ కుటుంబం!

మాధ కాదక్కా! మా కుటుంబం సంగతి అడగాలా?

శార రాధ ఏం చేస్తోంది?

మాధ స్కూల్‌ఫైనల్ చదువుతోందక్కా

శార గోపీ?

మాధ ఫోర్తుఫారం

శార అమ్మ ఇక్కడే ఉందా?

మాధ: ఉంది

శార. మరి మీ జీవనం?

మాధ అమ్మ ఎక్కడో వంట చేస్తుంది నేను కాయకష్టం చేసి ఏదో సంపాదిస్తాను.

శార కాయకష్టమా?

మాధ అదే! ఏదో పని.

శార అంటే!

మాధ ఏముందీ! అదే, ట్యూషన్లూ అవీ చెబుతా.

శార ఎలా సరిపోతుంది మాధవ్?

మాధ: సరిపోతే ఇలా ఎక్కే గడపా, దిగే గడపా ఎందుకక్కా?

శార (గాద్గదికంగా) ఇలా చితికిపోతారని ఎప్పుడూ అనుకోలేదు.

మాధ (సంతోషం తెచ్చుకుంటూ) శారదక్కా, నువ్వు సుఖంగా ఉన్నావు అంతే చాలు ఒకప్పుడు అంతస్థులు తెలియవు ఇప్పుడు తెలిసే నువ్వు నన్నిలా ఆదరిస్తుంటే ఏదో తెలియని సంతోషం కలుగుతోంది

శార అంతస్తుల కేమిటిలే మాధవ్ ఇవాల్టి రాజు రేపు బిచ్చగాడు కావచ్చు మాధవ్. గోపీ ఎలా ఉన్నాడు? ఎప్పుడూ ఎత్తుకు మోసేదాన్ని నన్ను వదిలి వెళ్ళేవాడు కాడు

మాధ వాడి కిప్పుడు నువ్వు గుర్తుండవు శారదక్కా

శార. (నిట్టూర్చి) వాడిని ఒక్కసారి చూడాలని ఉంది మాధవ్.

మాధ తప్పకుండా తీసుకొస్తాను.

శార అబ్బ, రాధ ఎంత చిలిపి పిల్ల మహా గడుగ్గాయి అబ్బో పట్టి మొండి ఘటం ఒకసారి ఆటలో ఓడిపోతే ఎలా కొరికిందో—చేతిమీద ఇంకా ఆ మచ్చ పోలేదు

మాధ ఇప్పుడా మొండితనమూ, చిలిపితనమూ అన్నీ కరిగిపోయాయి శారదక్కా. వాళ్ళ వంచి చాకిరీ చేస్తోంది పాపం (గాద్గదికంగా) ఎంత కష్టానికైనా ఓర్చి మా రాధకి మంచి చదువు చెప్పిస్తా నక్కా

శార. నీ చదువుకే యిబ్బంది పడ్తున్నావు కదు మాధవ్?

మాధ. ఎలాగో ఇబ్బందిపడి బి ఎ పూర్తిచేస్తే ఉద్యోగం వస్తుందని ఆశగా ఉందక్కా నాకు ఫస్టుమార్కులు వస్తున్నాయి క్లాసు వస్తే, మంచి ఉద్యోగం వస్తే. మా అమ్మ కష్టాలు గట్టెక్కుతాయి. మా రాధకీ, గోపీకి, చదువు వస్తుంది అక్కా నీకు నవ్వు వస్తోందా?

శార (దుఃఖం ఆపుకొని) లేదు మాధవ్ లేదు నవ్వేటంత దుర్మార్గురాలా మీ శారదక్కా?

మాధ. ఛీ. అలా అనుకోవద్దక్కా ఊరికే అన్నాను.

శార: మాధవ్ చిన్నప్పుడు నువ్వెంతో ధీమాగా దర్పంగా ఉంటేవాడివి భలే కోతలు కోసేవాడివి అప్పుడు నవ్వాను కాని ఇంత దైన్యావస్థలో నిన్ను చూస్తా ననుకోలేదు. ఇది రంపపుకోత మాధవ్.

మాధ విచారించకక్కా. ఎవరి కర్మానికి ఎవరు కర్తలు? 'సరేగాని శారదక్కా, ఒకవేళ నేను బి ఎ చదవటం మానేస్తే మరి బావగారితో చెప్పి ఉద్యోగం ఇప్పించగలవూ?

శార (భరించలేక) మాధవ్ నువ్వు చదువు మానాలిసిన అవసరం లేదు. ఆ విషయంలో నిశ్చింతగా ఉండు ఇలా లోపలికి రా ఇలా కూర్చో. ఇప్పుడే వస్తాను.

(మాధవ్ కూర్చుని పత్రిక తిరగేస్తుంటాడు శారద లోపలికి వెళ్ళి కొద్ది క్షణాల్లో ఒక ప్లేట్లో లడ్లు, బిస్కట్లు, కాఫీ కప్పుతో ఫ్లాస్క్‌తో ప్రవేశం)

మాధ ఇవన్నీ ఇప్పు డెందు కక్కా?

శార. పర్వాలేదు. తీసుకో

మాధ (తీసుకొంటూ) నాటికి—నేటికి మళ్ళీ నువ్వే పెట్టావక్కా నాకు బాగా జ్ఞాపకం పెళ్లి పందిట్లో నేను తారట్లాడుతుంటే, పిలిచి దోసిలినిండా లడ్లు పెట్టావు పదేళ్ళతర్వాత మళ్ళీ నువ్వు పెడితేనే లడ్లు తింటున్నా నక్కా.

శార (కన్నీళ్ళు ఆపుకుంటూ) మాధవ్, కష్టాలు కాపుర ముండవు బాబూ.

మాధ అబ్బే, అది కాదు ఊరికే జ్ఞాపకం వస్తే అన్నాను అంతే అక్కా బావగార్ని అప్పుడు చూడటమే చూడటం ఇప్పుడు చూస్తే గుర్తు పట్టలేనేమో అన్నట్టు అప్పుడుకూడా ఆయనతో నే నసలు మాట్లాడలేదు

శార ఇప్పుడు మాట్లాడుదువు గానిలే

మాధ అబ్బో. ఆఫీసర్ని చూస్తే నాకు భయం

శార. ఆయన్ను చూస్తే భయపడక్కర్లేదులే చెవులు మెలెయ్యరు.

మాధ. (నవ్వి) అయితే నువ్వే బావగారి చెవులు మెలేస్తున్నావా?

శార (నవ్వి) బాగుంది వరస కానీ, ఆ రెండు తినేసెయ్యి

మాధ ఎక్కువ తినటం అలవాటులేదక్కా సరె, నీ మాట తీసెయ్యను.

శార మాధవ్ ఇందాక కాయకష్టం అని ఇంతలో మాట తప్పించావు. నిజం చెప్పు నువ్వేపని చేస్తున్నావు?

మాధ చెప్పాను కదూ ట్యూషన్స్

శార. అది కాయకష్టం ఎలా అవుతుంది?

మాధ. ఏదో నోరుజారి అన్నాను. అంతే ట్యూషన్సే నక్కా.

శార. ఆ ట్యూషన్లు మానేసి గట్టిగా చదివితే క్లాసు తప్పక వస్తుంది కదూ? (కాఫీ కప్పులో కాఫీ పోసి యిస్తుంది)

మాధ ఓ, ఎందుకురాదూ? కాని ఎలా?

శార ఆ విషయం నాకు వదిలెయ్యి ఇంకో ఆరునెలల్లో పరీక్ష లైపోతాయి. ఈ ఆరు నెల్లకే ఎంత కావలసి ఉంటుంది?

మాధ ఏమిటక్కా నువ్వనేది?

శార చెప్పు.

మాధ వో అయిదువందలు సరిపోతాయి.

శార ఆ మొత్తం నే నిస్తాను మాధవ్.

మాధ (ఆశ్చర్యంగా) అక్కా

శార అవును మాధవ్

మాధ ఒద్దక్కా జీతం కట్టటానికి సహాయం చెయ్యి పోనీ.

శార అలా కాదులే. నెలకో వందయిస్తాను. బాగా చదివి క్లాసు తెచ్చుకొని, మంచిఉద్యోగం సంపాదించి, రాధకి, గోపీకి పెద్ద చదువులు చెప్పించు మాధవ్. నాకు తృప్తిగా ఉంటుంది.






PHILLIPS

మాధ : (కృతజ్ఞతాభారంతో) శారదక్కా, చుట్టరికం ఏమీ లేకపోయినా, కొంతకాలం ఇరుగు పొరుగుగా కలిసి మెలిసి ఉన్న అనుబంధాన్ని జ్ఞాపకం ఉంచుకొని ఇంతమేలు చేస్తున్న నీ ఋణాన్ని ఎన్ని జన్మ లెత్తినా తీర్చుకోలే నక్కా. తీర్చుకోలేను. వొద్దక్కా మాట చాలు. నన్ను వెళ్లనియ్యి (కాఫీకప్పు బల్లమీద పెట్టేస్తాడు.)

శార : వెళ్లవచ్చులే మాధవ్ భోజనంచేసి పోదువుగాని.

మాధ : ఇప్పుడు కాదక్కా. తర్వాత వస్తానుగా.

శార : ఫీజు ఎంత కట్టాలి ?

మాధ ఒక యాభై తక్కువైందక్కా.

శార : అది నే నిచ్చేస్తాను ట్యూషన్లు తప్పక మానేసెయ్యి. మొహమాట పడి నీ జీవితాన్ని, నీమీద ఆధారపడిన వాళ్ల జీవితాల్ని నాశనం చెయ్యకు. ఇంకా నన్ను పరాయిదాన్నిగానే చూస్తున్నావా మాధవ్ ?

మాధ ఎంతమాటన్నా వక్కా !

శార మరి నేను చెప్పినట్టు చేస్తానని మాట ఇయ్యి

మాధ (తటపటాయిస్తూ) బావగా రేమైనా అంటారేమో నక్కా.

శార : వారిసంగతి నేను చూసుకుంటానుకదూ

మాధ . కానీ—

శార ఆయన డబ్బులేని నిరుపేద కాదు. నెల కయిదు వందలు సంపాదించే ప్రముఖ ఉద్యోగి ఉన్నతభావాలు కలవారు. వెన్నంటి మనసు. మాధవ్, నిజంగా వారిది అమృతహృదయం అలాంటివారు నూటికి కోటికి ఒకరు అందులో ఇది నాకు సంబంధించిన విషయమని తెలిస్తే ఇహ అడ్డుచెప్పేప్రశ్నే లేదు. ఇంకా ఇంతతక్కువ ఇచ్చావని నన్నే ఎత్తి పొడుస్తారు గానీ, దుబారా చేశావని పల్లెత్తు మాట కూడా అనరు. వారే విషయంలోనూ నన్నెప్పుడూ తప్పు పట్ట లేదు. మాధవ్ ఇంక నువ్వు సందేహించకు.

మాధ అక్కా, అంత మంచి హృదయం గల భర్త లభించటం నిజంగా నీ అదృష్టం

శార అదే నా గర్వకారణం మాధవ్. డబ్బు తెస్తాను. ఉండు.

మాధ : అప్పుగా ఇవ్వక్కా.

శార సరే, నీ యిష్టం వచ్చినట్టే చెయ్యవచ్చులే.
(లోపలికి వెడుతుంది.)

మాధవ్ లేచి గది నాలుగు మూలలా తిరిగి, రేడియో టేబిల్ దగ్గ రికి వచ్చి నిలబడి పుస్తకాలు చూస్తూంటాడు రాజేశ్వర్ తిరిగి ప్రవేశం.)

రాజే :ఎవరది ?

మాధ : (వెనక్కి తిరిగి తొట్రుపడి) నమ .. స్కార .... మండి.

రాజే ఎవరు నువ్వు ?

మాధ : నేనండి ... నేను ......

రాజే అవును. నువ్వే ? నువ్వెవరూ, ఇక్కడి కెందుకు వచ్చావు. ఇక్కడ ఏం చేస్తున్నావూ అని అడుగుతున్నాను.

మాధ ....నేను.. .బీద విద్యార్థిని

రాజే బీదవిద్యార్థివైతే ఇంట్లో జొరబడి సామాన్లన్నీ చక్క బెట్టాలా? స్టుపిడ్

మాధ క్షమించండి ...

రాజే క్షమించేదేమిటి ? ఆ మాత్రం డీసెన్సీ ఉండక్కర్లే. సమయానికి వచ్చాను , మక సరిపోయింది. లేకపోతే ఏదో వుచ్చుకుని ఉడాయించే వాడివే. ఒట్టి స్కౌండ్రల్స్ దొరికారు. శారూ.... శారూ....

శార . (ప్రవేశించి వస్తున్నా నండి. అప్పుడే వచ్చేశారే ఏమిటి అరుస్తున్నారు, ఎవరి మీద ? ఇదిగో మాధవ్, ఈ యాభై రూపాయలు తీసుకో (ఇవ్వ బోతుంది)

రాజే : ఆగు శారూ, ఏమిటూ వితరణ ? ఇతనెవరు ?

శార తర్వాత చెప్తాలెండి. తీసుకో మాధవ్

రాజే నీక్కాదూ చెప్పేది. వినిపించుకోవేం ?

శార : చెప్తానండి. ఏమిటూ హడావిడి ? తీసుకోవేం మాధవ్.

మాధ : (విషణ్ణుడై) అక్కా.

శార : ఇతని పేరు మాధవ్ అండి.

రాజే : ఎవరా మాధవ్ అని అడుగుతున్నాను.

శార : చెప్పేదాకా ఆగలేరా ?

రాజే : అన్నీ తీరిగ్గా కూచుని వినటానికి నాకు టైం ఎక్కడేడిసింది. త్వరగా చెప్పరాదూ ?

మాధ నేను చెప్తానండి నేను ఇక్కడ కాలేజీలో బి ఎ ఆఖరి సంవత్సరం చదువుతున్నాను. బీదవాడిని. ఫీజు కట్టటానికి డబ్బులేక సహాయం అర్థించాను. వారు దయతలచి ఏదో ఇస్తామన్నారు.

రాజే మరి ఆ మాట చెప్పటాని కింత రాద్ధాంత మెందుకు ? తీసుకో వో రూపాయో, రెండో. దటీస్ ఆల్

శార రూపాయో, రెండో కాదండీ. యాభై రూపాయ లిస్తున్నాను.

రాజే నీ కేమైనా మతి పోయిందా ? యాభై రూపాయలా ?

శార చిన్నప్పటినుంచీ వీళ్ల కుటుంబంతో, మా కుటుంబము సన్నిహిత ముగా మెలిగింది తర్వాత పరిస్థితులు ప్రతికూలించి వాళ్లు చితికి పోయారు. చావ చిరిగి చదరయినా కాని సంసారం కుటుంబ భార మంతా మాధవ్ నెత్తిమీద పడ్డదండీ పాపం పదేళ్ల తర్వాత ఇవాళే కనుపించాడు చదువు పూర్తిచేసుకోటానికి అయిదువంద లిస్తానని వాగ్దానం చేశాను.

రాజే . అయిదు వందలా !

శార : అవునండీ.

రాజే : అందుకోసమన్నమాట ఈ కట్టుకథంతా.

శార కట్టుకథేమిటండీ ?

రాజే : లేకపోతే ఇదంతా నిజమనుకున్నావా ?

శార ఏదంతా ?

రాజే . ఈ బీదరికమూ ఎట్సెట్రా !

శార వాళ్ల పరిస్థితులు నాకు తెలుసు.

రాజే పిచ్చి శారూ. నీలాంటి అమాయకు లుండబట్టే దోచుకునేవాళ్లలా దోచుకుంటున్నారు

శార మాధవుని అలా అనకండీ అతని సంగతి మీకు తెలీదు.

రాజే మాధవ్, మాధవ్ అంటే జ్ఞాపకం వచ్చింది ఆమధ్య కాలేజీలో ఎవరో అమ్మాయికి ప్రేమలేఖ రాసినందుకు సస్పెండు చేసింది నిన్నే కదూ ?

మాధ (తెల్లబోయి) నేనా, ప్రేమలేఖా ?

రాజే అవును. ప్రేమలేఖే. అలా తెల్లబోతావేం ? నాకెలా తెలిసిందనా ? వోరి పిచ్చివాడా. ఇలాంటి సంగతులు ఊరుఊరంతా మారుమోగి పోవూ ? చెవులు మూసుకున్నా వినపడకమానవే.

మాధ క్షమించండి

రాజే : నే నెందుకు. ఆ ప్రిన్సిపాల్ని క్షమించమను.

మాధ  మీరు పొరబడుతున్నారు.

రాజే  షటప్. కాలేజీ రోల్సునుంచి నీ పేరు తీసేశారా లేదా ?

మాధ · తీసేశారండీ.

రాజే  అలా అలా దారికి రా.

శార : మాధవ్ !

రాజే : చూశావా శారూ. సంగతి బయటపడ్డది.

మాధ · కాని, కారణం మీరు చెప్పింది కాదు. జీతం కట్టలేదని తీసేశారు.

రాజే  అబ్బాయి, మనిషికి నిజాయితీ ఉండాలి. క్షణంలో మాట మార్చటం బాగుపడేవాళ్ల లక్షణం కాదు.

శార  ఫీజు కట్టనందువల్ల పేరు తీసేశారని నాతో మొదటే చెప్పాడండీ.

రాజే . అబ్బ, ఇంత అమాయకపు మనిషి నెక్కడా చూడలేదు. ఎవరన్నా, నేను ప్రేమలేఖ రాశాను, అందుకని నన్ను కాలేజీనించి వెళ్లగొట్టారు, మీరు అయిదొందలిస్తే మే మిద్దరం పెళ్లి చేసుకుంటాం అని చెబుతారా ?

మాధ : సార్, అనవసరంగా అభాండాలు వేస్తున్నారు. నేను మీకేం అపకారం చేశాను ? ఇదిగో ప్రిన్సిపాల్‌గా రిచ్చిన సర్టిఫికేటు. మీ ఆరోపణల్ని ఉపసంహరించుకుంటారని ఆశిస్తున్నాను (జేబులోంచి సర్టిఫికెట్ తీసి చూపిస్తాడు.)

రాజే  సర్టిఫికేట్ల కేమిటి ఎన్నయినా సృష్టించవచ్చు. కోకొల్లలు.

మాధ · ఇది నేను సృష్టించా నంటారా ?

రాజే  పోనీ, మీ ప్రిన్సిపాల్ ఇచ్చాడే అనుకుందాం దానికి విలువేమిటి, ఏదో ప్రాధేయపడితే ఇచ్చిఉండవచ్చు ఆమాటకొస్తే, నేను కాలేజీలో చదివే రోజుల్లో బ్రహ్మాండమయిన స్ట్రయిక్ లీడ్ చేశాను. కాండక్టు శాటిస్‌ఫాక్టరీ అని సర్టిఫికెట్టిచ్చాడు అంతమాత్రంలో ఫాక్ట్ ఫాక్ట్ కాక పోతుందా ?

మాధ  క్షమించండి. మీపే రేమిటో తెలియదు. తెలిస్తే కలకాలం జ్ఞాపకం ఉంచుకుంటాను.

శార . మాధవ్ !

రాజే  తల పొగరు మంచి మోతాదులోనే ఉంది సరే, జ్ఞాపకం ఉంచుకో, రాజేశ్వర్.

మాధ · రాజేశ్వర్ (ఏదో జ్ఞాపకం చేసుకుంటూ) రాజేశ్వర్ ! క్షమించండి. నా నిజాయితీ ఏమిటో మీకు తప్పక ఋజువు చేసుకోగలను సెలవు. వస్తానక్కా (నిష్క్రమణ).

శార · మాధవ్ ఏమండీ అతన్నలా అవమానించటం మీకు తగదు పిలవండీ (ద్వారం దగ్గరకు వెడుతుంది).

రాజే : ఆ మూర్ఖుడితో ఏమిటి శారూ ! ఎప్పుడో నీకు పరిచయం ఉంటే ఉండవచ్చు. ఇన్ని సంవత్సరాలతర్వాత మనిషి ఎలా మారిపోవటానికి అవకాశముందో గ్రహించవేం ?

శార · ఇంత కఠినంగా ప్రవర్తిస్తారని ఎప్పుడూ అనుకోలేదు కనీసం నా ముఖం చూసైనా, నా మర్యాద నిలబెట్టటం కోసమైనా కాస్త తమా యించుకోలేక పోయారు.

రాజే  నువ్వలా అనుకుంటే క్షమించు శారూ. అవినీతిని నేను సహించలేను. అందుకే అలా ప్రవర్తించాను. పోనీ, ఓ యాభై రూపాయలు అతని కివ్వాలని నీకు గట్టిగా యుంటే కాలేజీకి మనియార్డరు చేస్తాను. ఏం, సరా ?

శార : చేసిన అవమానం చాలకనా ?

రాజే  మనసులో ఉన్నది ముఖాన అనటం నా కలవాటు అంతేకానీ, అతన్ని అవమానించాలని నేనేమీ అభాండాలు వేయలేదు. నాకేం అవసరం ?

శార · మిమ్మల్ని గురించి అతనితో ఎంతో గొప్పగా చెప్పాను. అతనివైపు చూడటానికే ముఖం చెల్లలేదు.

రాజే  (అనునయంగా) నీకు లోకం పోకడ తెలీదు శారూ నల్లనివన్నీ నీళ్లు, తెల్లనివన్నీ పాలు అనుకుంటావు. ఈ మాధవ్‌లాంటి జులాయిగాళ్లు చదువు సంధ్యలు లేక తలిదండ్రుల్ని ఎలా నానా అవస్థలూ పెట్టి వేపుకుతింటారో, అమ్మాయిల్ని ఎలా అల్లరిపాలు చేస్తారో నీకు తెలీదు. అలాంటివాళ్లని చూస్తే నాకు పరమ అసహ్యం.

శార  అంతా తెలిసినట్టు మాట్లాడుతున్నారు. అతన్ని గురించి వాకబు చెయ్యాల్సిన అవసరం మీ కెప్పుడు ఎందుకు కలిగింది ?

రాజే  వాకబుచేయాలా వేరే. నా స్నేహితుల్లో ఎంతోమంది కాలేజీ లెక్చరర్లున్నారు ఆ సంగతు లన్నీ నాకు తెలుస్తూనే ఉంటాయి నీకు నామీద నమ్మకం లేకపోతే నేనేం చెయ్యను పోనీ అతని మాటలే నమ్ము నా దురదృష్ట మనుకుంటాను.

శార  మీ అనుమతి లేకుండా అతనికి సహాయం చేస్తానని వాగ్దానం ఇవ్వటం నాదే తప్పు.

రాజే  అంటే నేను ముష్టి డబ్బుకోసం లోభించానంటావా ?

శార  లోభించటం కాదు. మీకు తెలియకుండా మాటివ్వటానికి నాకేం అధికారం ఉందని ?

రాజే  ఏమిటి శారూ ? ఖర్చుకి నిన్నెప్పుడైనా లెక్కలడిగానా ? ఇది ఇలా ఎందుక చేశావని ప్రశ్నించానా ?

శార  ఆ అవసరం రాలేదు ఇంతవరకూ.

రాజే  ఇప్పుడు ?

శార  రాత్రింబగళ్ళు చాకిరీచేసి సంపాదిస్తున్నారు. ఏదో ఆవేశంకొద్దీ అతనికి సహాయపడా లనుకున్నానే గాని, ఆ డబ్బులో నేను చెమటోడ్చి సంపాదించింది ఒక్క పైస కూడా లేదని నాకు తట్టలేదు

రాజే  ఇంత సంకుచితంగా ఆలోచిస్తావనుకుంటే నే నసలు నోరెత్తేవాడినే కాదు శారూ

శార  మిమ్మల్ని తప్పులు పట్టటంలేదండీ. నా విప్రయోజకత్వాన్ని గురించి చెప్పాను. అంతే. గుండె ఎంత కొట్టుకులాడినా, కన్నీరు మున్నీరైనా, ఒక్క సానుభూతివాక్యం తప్ప నా దగ్గర మరే ఆస్తి లేదని నా కసలు తట్టనే లేదండీ.

రాజే  శారూ నువ్వలా బాధపడితే నేను భరించలేను. ఆ కుర్రాడిని వెతికి తెచ్చి నీముందే ఆ అయిదు వందలూ యిచ్చేస్తాను. అప్పటికైనా నా హృదయం నీకు తెలిస్తే నా మనసు తేలపడుతుంది.

శార  క్షమించండి మిమ్మల్ని బాధించాలని నేనేమీ అనటంలేదు ఈ విషయం ఇంతటితో వదిలేద్దాం.

రాజే · వదిలేద్దాం.. (డ్రాయర్ తెరచి చెక్కు పుస్తకం తీసి వ్రాయటానికి సమకడుతూ) ఇదిగో, ఇంకొక వంద కలిపి ఆరు వందలకి చెక్కు రాస్తున్నాను. అతని పేరు మాధవ్ కదూ. ఇంటిపేరు.

శార · (స్తబ్ధురాలై, తేరుకుని) ఎందుకండీ అంత కోపం ?

రాజే  కోపమా ? భగవాన్, నన్నెవరూ అర్థంచేసుకోరా ?

శార  (దగ్గరికి వచ్చి అనునయంగా) నామాట వినండి. చెక్కూ వద్దు. ఏమీ వద్దు.

రాజే ఇంటిపేరు ?—సరే తర్వాత నువ్వే పూర్తిచెయ్యి. సంతకం పెట్టే స్తాను (సంతకంచేసి చెక్కు పత్రున చింపి ఆమె చేతిలో బలవంతాన పెట్టి) ఇదిగో శారూ. ఆ మాధవ్‌కి అందచేయి.

శార (తల అడ్డంగా తిప్పుతూ) వద్దండీ. మీకంటె నా కెవరూ ఆప్తులు లేరు మీకంటే నాకు ఎక్కువ తెలీదు మీకేది మంచిదని తోస్తే నాకూ అదే మంచిది తెలివితక్కువగా మీ మనసు గాయపరిచాను. క్షమించండి

రాజే నీకు మరీ చాదస్తం ఎక్కువైపోతుంది శారూ సరే నీ యిష్టం. నా ధర్మం నేను నెరవేర్చాను అదే నాకు తృప్తి.

శార . (చెక్కు డ్రాయర్లో పడేసి) ఇంక ఈ విషయం మర్చిపొండి అన్నట్టు త్వరలోనే వచ్చేశారు ఆ ఇన్‌స్పెక్టరూ, వాళ్ళూ కనిపించలేదా ?

రాజే ఇన్‌స్పెక్టరు పొద్దున్నే ఎక్కడికో వెళ్ళాట్ట శరభయ్య కూడా పని మీద వెళ్ళాడన్నారు అర్జంటుగా రమ్మని అతనికి కబురు పెట్టాను. వస్తూ ఉండాలి ఈ కాఫీ కప్పులు ఫ్లాస్కో తీసి లోపల పెట్టు శారూ ఇన్‌స్పెక్టర్ని కాఫీకి ఇన్‌వైట్ చేస్తాను మంచి టిఫిన్, కాఫీ తయారు చేస్తావు కదూ !

శార ఓ స్వీట్, కాషూనట్స్, సాల్టెడ్ కాఫీ.

రాజే మై గాడ్ మనఆతిథ్యం జన్మాంతం మర్చిపోడు

శార టేబిల్‌సాల్ట్, పంచదార పక్క పక్కనే ఉన్నాయండోయ్ అన్నంత పనీ జరిపేను

రాజే అయితే మన సాల్టెడ్ కాఫీ మంచి ప్రచారంలోకే వస్తుంది

(ఇద్దరూ నవ్వుతారు శారద కాఫీ కప్పూ, ప్లేటూ, ఫ్లాస్కూ తీసుకొని మధ్య ద్వారంగుండా నిష్క్రమిస్తుంది రాజేశ్వర్ కొంచెం ఇంపేషంట్‌గా గదిలో తిరుగుతూ, రేడియో సెట్ దగ్గిర ఆగి స్విచ్ ఆన్‌చేసి మరు క్షణంలో ఆర్పేస్తాడు

(బ్రాంచి ఇన్‌స్పెక్టర్ గోవిందరావు ప్రవేశం ఖరీదైన స్లాక్, పాంట్, బూట్స్, కళ్ళజోడు ఉంటుంది చాలా స్ట్రయిట్‌గా మాట్లాడే స్వభావం ),

గోవిం హలో, మిస్టర్ రాజేశ్వర్ గుడ్‌మార్నింగ్

రాజే (తృళ్ళిపడి` వెరీ వెరీ గుడ్‌మార్నింగ్ ఇన్‌స్పెక్టర్ గోవిందరావుగారూ కమ్ ఎలాంగ్ రండి, ఇలా కూర్చోండి పొద్దున టి. బి కి వచ్చాను. అప్పటికే మీరు వెళ్ళిపోయారని తెలిసింది. (ద్వారం దగ్గరికి వెళ్ళి) శారూ ఇన్‌స్పెక్టరుగారికి కాఫీ తెచ్చిపెట్టు.

గోవిం అవునండీ కొద్దిగా పని ఉండి వెళ్ళాను మీరు వచ్చి వెళ్ళారని ప్యూన్ చెప్పాడు వెంటనే యిలా వచ్చేశాను

రాజే కబురుచేస్తే నేనే వచ్చేవాడిని. శ్రమ తీసుకున్నారు.

గోవి శ్రమేముందీ ? ఆ—న్‌స్పెక్షను పూర్తయిపోయిందండి ఆ శర భయ్య వ్యవహారం ఏం చేశారు ? అదొక్కటే మిగిలిపోయింది

రాజే పొద్దున కబురు చేశాను ఇంట్లో లేడట రాగానే ఇక్కడికి రావలసిం దని చెప్పమన్నాను.

గోవిం . (కొంచెం నిరాశగా) డబ్బుచెల్లిస్తాడా ?

రాజే చెల్లిస్తాడని నాకు బాగా నమ్మకముంది.

గోవిం నిజం చెప్పాలంటే నాకా నమ్మక మేమాత్రం లేదు.

రాజే అతను యోగ్యుడేనండీ

గోవిం కావచ్చు కానీ, అతని వ్యాపారం చిక్కుల్లో పడ్డదని విన్నాను.

రాజే . అది ఒకవేళ నిజమైనప్పటికీ మన అప్పుకేం ముప్పు లేదు.

గోవిం : ఎలా ?

రాజే అతన్ని నేను వ్యక్తిగతంగా బాగా ఎరుగుదును. ముందు మన బాకీ తీర్చే మిగతా బాకీదారుల సంగతి ఆలోచిస్తాడు.

గోవిం యు ఆర్ హొపింగ్ ఎగైన్స్ట్ హోప్, ఐ యామ్ ఎఫ్రయిడ్.

రాజే ఏమైనా ఈ బాకీపూర్తిగా పరిష్కారం చేయించే పూచీ నాది.

గోవిం మీదే కావచ్చు. కానీ హెడ్ ఆఫీసుకి పరిస్థితులు తెలియక తప్పదు.

రాజే తప్పదా ?

గోవిం నా ధర్మం నేను నెరవేర్చక తప్పదు

రాజే , దానివల్ల అన్యాయంగా కొందరి జీవితాలు నాశనమౌతాయని మీకుతెలుసు.

గోవిం ' మిస్టర్ రాజేశ్వర్. బాధ్యతాయుతమైన ఉద్యోగంలో ఉన్నారు. తప్పు చేసి తప్పుకోడం ఉద్యోగధర్మానికే కాక మానవధర్మానికి కూడా వ్యతిరేకం

రాజే తప్పా ? ఎవరు చేసారు తప్పు ?

గోవిం రెడ్డొచ్చె మొదలాడమన్నాట్ట. నిన్న జరిగింది రాత్రి మర్చిపోయారా? మిస్టర్ రాజేశ్వర్, జ్ఞాపకం చేస్తాను. నిన్న సెక్యూరిటీ చెకింగ్‌కి, మీరూ, నేనూ, గోడవున్ కీపర్ నరసింహం గోడవున్ల దగ్గరికి వెళ్ళాము. శరభయ్య తీసుకొన్న యాభైవేల అప్పు హామీగా కొన్ని వందల నూనె డబ్బాలు ఉంచాడు. టెస్ట్ చెకింగ్‌కి ఒక డబ్బా విడ గొట్టమన్నాను. మీర చూస్తూనే ఉన్నారు. విడగొట్టిన డబ్బాలో ఏముంది ?

రాజే నూనె

గోవిం కరెక్ట్ రాండమ్‌గా మరొకటి విడగొట్టమన్నాను మీర నన్నా ప్రయత్నంనించి విరమింపజేయటానికి ప్రయత్నించారు నేను పట్టు బట్టాను డబ్బా విడగొట్టారు అందులో ఏముంది ?

రాజే (తల ప్రక్కకు తిప్పుకొని నీళ్ళు

గోవిం నీళ్ళ డబ్బాల హామీమీద యాభైవేల రూపాయలు అప్పిచ్చారా ?

రాజే నూనె డబ్బాలని మోసపోయిన మాట నిజం.

గోవిం ఇందుకు బాధ్యు లెవరు ?

రాజే టెక్నికల్‌గా నేనే కాదనటంలేదు కానీ ముఖ్యంగా గోడవున్‌కీపర్ బాధ్యుడు

గోవిం రాజేశ్వర్ గారూ ఒక అమాయకుణ్ణి, అధికార్లకి అత్యంత విధే యంగా ప్రవర్తించే ఒక బీద ఉద్యోగిని ఇందులో అనవసరంగా ఇరి కించకండి.

రాజే (కోపంగా) అయితే నేను కుట్ర పన్నాననా మీ అభిప్రాయం ?

గోవిం శాంతించండి నేను విచారణ చేశాను. నరసింహాంని టెస్ట్ చెకింగ్ లేకుండా సర్టిఫై చెయ్యమని మీరు అడిగారు

రాజే రభయ్యకి అనేకసార్లు అప్పిచ్చాము పాత కాతాదారే కదా నమ్మక ముంటే వెంటనే సర్టిఫై చెయ్యమన్నాను. అంతే దాన్ని మీరు డిస్టార్ట్ చేస్తున్నారు

గోవిం మిస్టర్ రాజేశ్వర్. ఆఫీసర్ల సూచనల్ని అర్థంచేసుకుని అడుగులకు మడుగులొత్తే దౌర్భాగ్యం ఆర్థిక వ్యవస్థావరప్రసాదం పాపం నర సింహం అందుకు మినహాయింపు కాడు. కానీ లాభం పొందింది మీరు.

రాజే లాభమా ? మీ ఉద్దేశం ?

గోవిం . ఏదైనా కావచ్చు.

రాజే మీరు చాలా అమర్యాదకరంగా ప్రవర్తించటమే కాక, ఘోరమైన అభాండాన్ని నామీద వేస్తున్నారు. ఇన్స్పెక్టర్

గోవిం క్షమించండి

రాజే : ఇందుకు మీరు తర్వాత చాలా పశ్చాత్తాపపడాలిసొస్తుంది.

గోవిం . తప్పు చేశానని తెలిస్తే తప్పక పశ్చాత్తాపపడతాను ఫలితాన్ని సంతోషంగా స్వీకరిస్తాను

రాజే వ్రాతపూర్వకమైన క్షమాపణ కూడా ఇవ్వవలసి వస్తుంది

గోవిం . అలాగే. వెంటనే దర్యాప్తు ప్రారంభించవలసిందని ఇప్పుడే హెడ్ క్వార్టర్స్‌కి రాసేస్తాను.

రాజే (కొంచెం తగ్గి) కానీ, దానివల్ల కలిగే దుష్ఫలితాన్ని గురించి ఆలోచించండి. బ్యాంకు పరపతి ఎలా దెబ్బతింటుందో మీకు తెలుసు. బ్యాంకు ఉద్యోగులమై ఉండి మనం బ్యాంకుకి అలా ద్రోహం చెయ్యటం తగనిపని

గోవిం ఏమిటి, మీ ధర్మపన్నాలు రాజేశ్వర్ ? మీకు బొత్తిగా సాధారణ జ్ఞానం కూడా లోపించిందని అనుకోవలసి వస్తుంది

రాజే ఇన్స్పెక్టర్ అతివిశ్వాసంవల్ల ఒక పొరపాటు జరిగిపోయింది దానివల ఎవరికీ ఏవిధమైన కీడూ జరగకుండా సర్దుబాటు చేయాలని నేనూ విశ్వప్రయత్నం చేస్తున్నాను మీరు సహకరిస్తే నా ప్రయత్నం ఫలిస్తుంది. కొందరి జీవితాల్ని విద్యుక్తధర్మంపేరుతో అమానుషంగా నాశనం చెయ్యటంకంటె మానవత్వంతో సరిదిద్దటం మేలు కదా!

గోవిం అయితే మీ తప్పులకి నేను, నా ఉద్యోగ ధర్మాన్నీ, ఉద్యోగ భద్రతనీ త్యాగం చేయాలన్నమాట

రాజే త్యాగమైతే కావచ్చు కానీ, ఇందుకు మీరు జీవితంలో ఎప్పుడూ విచారించాల్సిన అవసరం రాదని చెప్పగలను.

గోవిం . అంటే, ఋణం తీర్చుకుంటారా ?

రాజే చేతనైతే, వీలైతే తప్పకుండా.

గోవిం (వెటకారంగా) త్యాగం ఆన్ డిమాండ్ ప్రామిసరీ నోటుమీద దొరికే వస్తువు కాదు మిస్టర్ రాజేశ్వర్

రాజే . కాదని తెలుసు కానీ, ఈ ప్రపంచాన్ని, ఇందులోని మనుషుల్నీ, కనీసం ఒక్క మనిషినైనా ప్రేమించినవాడు ఎంతో కొంత త్యాగం తప్పకుండా చెయ్యగలడు.

గోవిం (ముఖ కవళికలు మారుతాయి) ప్రపంచాన్నీ, మనుషుల్ని ప్రేమించినవాడు! (నిట్టూర్చి) మిస్టర్ రాజేశ్వర్,, మీ మాటలు నా హృదయంలో ఏ సున్నిత ప్రదేశాన్ని తాకి బాధించాయో మీకు తెలియదు సరే మీకు తప్పక అవకాశ మిస్తాను ఇవాళ నా ప్రయాణం బుక్ అయిపోయింది ఈ మధ్యాహ్నంలోపల శరభయ్య బాకీ పరిష్కారమైతే ఈ రహస్యం నేను బయటపెట్టను. కానీ, బాకి మాత్రం తప్పక పరిష్కారం కావాలి

రాజే థాంక్స్ ఆ ప్రయత్నంలోనే యున్నాను తర్వాత దైవానుగ్రహం

(శారద కాఫీ ట్రేతో ప్రవేశం)

దిసీజ్ మిసెస్ శారదారాజేశ్వర్ వీరు బ్రాంచి ఇన్స్పెక్టర్ శారూ.

గోవిం : నమస్కారమండీ

శార (తలెత్తి చూస్తూ నమస్కారమండీ.

(శారద గాభరాపడిపోతుంది గోవిందరావు ఆమెవైపు రెప్పవేయక చూస్తాడు. ఆమె అతనివైపు చూస్తుండగా తటాలున ట్రే క్రింద పడి పోతుంది.)

గోవిం . అరెరె ....

శార : (తేరుకుని సారీ

రాజే . ఏమిటి శారూ, ఏం జరిగింది (ట్రే బల్లమీద పెడతాడు)

శార ఏంలేదండీ ఎందుకో శరీరం కొంచెం తూలింది. మళ్ళీ కాఫీ తెస్తా నుండండి (నిష్క్రమణ)

రాజే సారీ, ఇన్‌స్పెక్టర్.

గోవిం : మీకు చాలా శ్రమ కలిగిందాను.

రాజే నో, నో, నో మా శారదకి కొంచెం నర్వస్ వీక్నెస్ ఉంది అప్పుడప్పుడు అలా వస్తుంది. అంతే. మీరేమీ బాధపడకండి.

(ఫ్లాస్కుతో, ఒక కప్పు సాసర్లతో శారద తిరిగి ప్రవేశించి కప్పుల్లో కాఫీ పోసి యిస్తుంది.)

గోవిం థాంక్స్

రాజే నో మెన్షన్.

గోవిం (కాఫీ సిప్‌చేస్తూ) కాఫీ చాలా బాగుందండీ.

రాజే (సిప్‌చేస్తూ) నేను షుగర్ తక్కువ వేసుకుంటాను మీరు స్వీట్ లైక్ చేస్తారనుకుంటాను. శారూ, కొంచెం షుగర్.

శార ఇదిగోనండి, తెచ్చాను (బల్లమీద కప్పు పెడుతుంది)

గోవిం (వేసుకోబోయి ఆగి) ఓ మీరు చాల నెర్వస్‌గా యున్నారు దిసీజ్ టేబిల్‌సాల్ట్ ప్లీజ్

రాజే (నిర్ఘాంతపోయి శారదవైపు చూసి) ఏమిటి శారూ, ఒంట్లో బాగా లేదా ?

శార పొరపాటండీ వెరీసారీ (లోపలికి వెళ్లిబోతూ) సుగర్ అనుకున్నాను. ఇప్పుడే తెస్తా నుండండి

గోవిం వద్దండీ డోంట్ వర్రీ. తాగేశాను నిజాని నాకు షుగర్ తక్కువే ఇష్టం మిస్టర్ రాజేశ్వర్, శరభయ్య వస్తే ఆ విషయం పరిష్కారం చేసెయ్యండి ఏ విషయమూ నాకు చెప్తారుకదూ. లేకపోతే నేనే మళ్లీ వస్తాను ఈలోపల వ్యవహారం చక్కబెరిచేస్తారు కదూ.

రాజే అలాగే.

గోవిం శలవు సెలవండీ, మిసెస్ రాజేశ్వర్

శార నమస్కారమండీ

(ఇన్‌స్పెక్టరు గోవిందరావు నిష్క్రమిస్తాడు.)

రాజే ఏమిటి శారూ, అన్నంతపని చేశావు.

శార నాకు మతి పోయిందండీ.

రాజే . ఎప్పుడూ ఎంతో జాగ్రత్తగా యుండేదానివి. ఆ ట్రే ఎందుకలా జారి పోయింది ?

శార ఆ ఇన్‌స్పెక్టరు పేరేమిటన్నారు?

రాజే గోవింద రావు

శార అవును. అతనే. సందేహం లేదు.

రాజే . (ఆశ్చర్యంగా) నీ కతను తెలుసా?

శార ; (తల ఊపుతుంది) తెలుసు.

రాజే · ఎలా?

శార నేను ఇంటర్ జూనియర్ చదువుతున్నప్పుడు ఆ కాలేజీలో నే అతను బి. ఎస్సీ సీనియర్ చదువుతూండే వాడు.

రాజే ఐ సీ.

శార · చాలా తెలివిగల వాడని పేరు.

రాజే ఓహో

శార డిబేట్సులో మాట్లాడే వాడు. బాగా మాట్లాడ గలడండీ.

రాజే · ఊఁ.

శార తప్పక ఫస్ట్ క్లాస్ వస్తుందనుకునే వారు.

రాజే . రాలేదా?

శార సెకండు క్లాసులో ప్యాసయ్యాడుట.

రాజే · కారణం.

శార చిత్త చాచల్యం

రాజే కొంచెం స్పష్టంగా చెబుదూ.

శార చదువుకునే రోజుల్లో అతనొక అమ్మాయిని ప్రేమించాడుటండీ.

రాజే ఊహూ—గ్రంధసాంగుడే అన్నమాట.

శార దాంతో చదువు మూలబడ్డదట.

రాజే ఆ అమ్మాయి సంగతి?

శార · ఆ అమ్మాయి సలక్షణంగా చదివి ఇంటరు ప్యాసయింది. ఫస్ట్ క్లాసు కూడా వచ్చింది.

రాజే పాపం చెడ్డది అతనే నన్నమాట.

శార . లేని పోని వ్యామోహాలు పెంచుకొని తెలివితక్కువగా వ్యవహరిస్తే వి వహాతుంది మరి

రాజే ఆ అమ్మాయికి అతని మీద ప్రేమ లేదు కాబోలు.

శార అమ్మాయిలు అబ్బాయిలంత తెలివితక్కువ వాళ్ళు కారులెండి.

రాజే ఆమె తిరస్కరించిందన్న మాట.

శార . అంతే కాదు

రాజే పాదరక్షణ ప్రయోగం కూడా జరిగిందా?

శార · అదొక్కటే తరువాయి.

రాజే బాగా బుద్ధి చెప్పింది.

శార · పాపం కాలేజీ నుంచి సస్పెండయాడు కూడా.

రాజే . ఎందుకూ?

శార : లేబరేటరీలో, లైబ్రరీలో, పిక్‌నిక్‌లో కలిగిన స్వల్ప పరిచయాన్ని పురస్కరించుకొని ఒక లావు ప్రేమ లేఖ వ్రాసేశాడు

రాజే ఊహూ—అంతవరకు సాహసించాడూ?

శార ఆ అమ్మాయికి బేజారెత్తి ప్రిన్సిపాల్‌కి రిపోర్ట్ యిచ్చింది. ఇంకేముంది సస్పెన్షన్.

రాజే పూర్ ఫెలో.

శార : పాపం, తర్వాత నాకు చాలా జాలి వేసిందండీ.

రాజే · నీకా!

శార ఎవరైతే మాత్రం జాలి కాదండి బాగుపడవలసిన వాడు అలా వ్యామోహంలో పడి పిచ్చిపని చేసి ఎదురు దెబ్బ తిం టే!

రాజే . అంత వ్యామోహంలో పడటానికి ఆ అమ్మాయి అంత అపురూప సుందరి మరా?

శార , ఏమో, మీరే చెప్పాలి.

రాజే (ఆశ్చర్యంగా) నేనా?

శార (కొంటెగా) మీరే!

రాజే మై గాడ్ ఆ భువనమోహిని లావణ్య సుందరీ మణి నా శాఖామేనా! వాట్ ఎ థ్రిల్!

శార (నవ్వి) దూరపు కొండలే నునుపులెండి.

రాజే ఇన్‌స్పెక్టరుకి నా మీద మహాకోపంగా ఉండి ఉంటుంది.

శార మీ మీదెందుకు కోపం?

రాజే మాత్సర్యం.

శార అతని కోపం మిమ్మల్ని ఏం చేస్తుంది లెండి

రాజే ఇంకొకప్పుడైతే ఈ మాత్సర్యానికి మహాసంతోషించే వాడిని నుంచి ఆసమయంలో ఈ ఇంటర్వ్యూ జరిగిందే.(ఆలోచనగా) శారదా, అనుమాన లేదు. గోవింద రావు నాకు తప్పక అపకారం చేస్తాడు.

శార అతను మీకు చెయ్యగల అపకార మేముంటుందండీ.

రాజే అదే, ఆ శరభయ్య అప్పులేదు? ఇందాక చెప్పానుగా ఆ విషయంలో హెడ్‌క్వార్టర్స్‌కి నా మీద లేని పోని వన్నీ కల్పించి రిపోర్టు రాస్తాడు సందేహం లేదు.

శార పాపం, అత నలాటివాడు కాదండీ.— ఆ రోజుల్లో అందరూ అతనంత మంచివాడు లేడనేవారు ఏమాట కామాటేనండీ, నేనంత అపకారంచేసినా పాపం, అతను నన్ను గురించి ఒక్క చెడుమాటలు కూడా అనలేదండీ. నేను కనిపిస్తే తల వంచుకొని వెళ్ళి పోయేవాడు చాలా జాలి వేసిందండి

రాజే అన్నట్టు ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. అతను ముప్ఫయి ఏళ్ళు వచ్చినా ఇంకా పెళ్ళి చేసుకో లేదట

శార (ఆశ్చర్యంగా) ఆఁ— నిజమా?

రాజే నిజమే

శార (విచార స్వరంతో) నేను తిరస్కరిస్తే, జీవితాంతం బ్రహ్మచారిగా ఉండి పోతానని ఆ ఉత్తరంలో రాశాడండీ పాపం నిజంగా అంత పని చెయ్యడు కద!

రాజే ( ఆలోచనగా) మనిషి ఆదర్శవంతుడుగానే కన్పిస్తాడు శారదా.

శార (జాలిగా) మీరు నచ్చ చెప్ప కూడదూ?

రాజే (ఆమె జాలిని కనిపెట్టి)ఇవి చాలా సున్నిత విషయాలు శారదా, అనవసర జోక్యంవల్ల ఫలితం లేక పోగా పరిస్థితి వక్రించటం, విషమించటం జరగొచ్చు.

శార అయితే పాపం, అతని జీవితం ఇంతేనా?

రాజే అతనెందుకు వివాహం చేసుకోలేదో మనం ఊహాగానం చెయ్యటమే గాని అసలు కారణం మనకేం తెలుసు ఒక వేళ మంచి కట్నం కోసం ఆగా డేమో. ఎవరి మనసుల్లో సంగతులెవరికి తెలుస్తాయి శారదా?

శార మనసుల్లో తెరల్లేక పోతే మనుషుల్లో అంతస్తులకీ, అన్యాయాలకీ అవకాశమే లేదు కదండీ

రాజే బాగా చెప్పావు. సరే గానీ ఇవాళ ఇలా కబుర్లు పెట్టుకున్నావు మాకు నోట్లో వెళ్లేనా?

శార వంటామె మీద సూపర్ విజనే కదండీ నేను చేసే ఘనకార్యం పోతున్నా లెండి

(శారద నిష్క్రమిస్తుంది రాజేశ్వర్ ఆలోచనగా నిమగ్న మానసుడౌతాడు. శరభయ్య ప్రవేశం యాభై ఏళ్ళ వయస్సు. మీసకట్టు. జరీ అంచు కండువా. లాల్చీ, దోవతి. కళ్ళ జోడూ. బ్రాహ్మ. సంస్కారం దుస్తుల్లోనే కానీ మాటలో అంతగా కనిపించదు. నవ్వి నప్పుడు పెద్దగా వికటంగా నవ్వుతాడు)

శరభయ్య : నమస్కారం ఏజంటు గారూ.

రాజే : (అతన్ని చూచి ముఖంలో సంతోషం తాండవించగా) ఓ శరభయ్యగారా, నమస్కారం. అనుకుంటూ ఉండగనే వచ్చారు. రండి ఇలా కూర్చోండి.

శర పొద్దున్నే ఇంటికాణ్ణి కొచ్చేళ్లారంటగా.

రాజే అవునండీ. బ్యాంకు ఇన్‌స్పెక్షను జరుగుతోంది. మీ బాకీ ఒకటి వాయిదా మీరిపోయింది. గుర్తున్నది కదూ!

శర గుర్తుండకేంటండోయ్. అదే గుర్తు లేకపోతే వ్యాపారమేం చేస్తాం. అందులో బ్యాంకు బాకీ గొంతుమీద గండ కత్తెర కదూ(నవ్వుతాడు)

రాజే ఇవాళ తీర్చేస్తారా?

శర ఆ ప్రయత్నంమీదే ఉన్నానండీ తస్సాదియ్యా, మనీ మార్కెట్టు మహా టైటుగా ఉందండీ ఏజంటుగారూ. మీకు తెలియం దేముఅదీ? రూపాయేమిటి, రెండురూపాయ లిచ్చినా పెగల్లేం లేదంటే నమ్మండి

రాజే నిజమే కానీ, బాకీ ఇంక ఆపటానికి వీల్లేదు మీకు తెలుసుగదూ మా యిబ్బందులు

శర తేలికేం మీ సొంతమా ఏమన్నానా? అందులో హెడ్డాఫీసోళ్లాళు కుంటారా? ఏం చేద్దాం చెప్మా సొమ్ము జతపడలేదే

రాజే అలా అంటే కాదు. తలతాకట్టు పెట్టయినా ఎక్కడో తేవాలి

శర తలేంటండోయ్? తాకట్టు పెట్టటానికి మరేం లేనట్టు! (నవ్వి) కొనే మగాడుండాలే కానీ, కొట్టమ్మితే గించున్న పళాన నాలుగు లక్షలు రాల్తాయ్యండోయ్ ఆఁ

రాజే కబుర్లకేం లెండి, పని కావాలి, పని

శర ఏజంటుగారూ. చెన్నపట్నం నించి నిన్ననే వచ్చాను రొస్తంత వూపిరి పీల్చుకోనివ్వండిసార్

రాజే : క్షమించాలి ఆరు నూరైనా ఈ బాకీ యివాళ పరిష్కార మైతేనే మీ మాట నా మాట దక్కుతాయి

శర అహా—మరీ అంత కరెక్టుగా మాట్లాడితే ఎట్లా చెప్పండి చెన్న పట్నంలో వసూలైన బాకీ అలా టి టి మీద ఎకౌంటుకి మార్పించ చేసినా బాగుండిపోయేది. తస్సాదియ్య వ్యాపారం బుద్ధి వ్యాపారం బుద్దే మంచి సరుకు సరసంగా దొరికితే వ్యాగను బుక్ చేసేసి వచ్చా. దాని సిగ్గోసిరి ఈ బాకీ సంగతి సమయానికి గుర్తుకి రాలేదు. సుమండీ.

రాజే : (విసుగ్గా) ఇంతకీ ఏమిటంటారు?

శర : ఏజంటుగారూ, మీరు నన్నెరగరా, మిమ్మల్ని నే నెరగనా! బ్యాంకుకి ఈనాటి కాతాదార్నా చెప్పండి. వేలకి వేలు ఓవరు డ్రాఫ్టు లిచ్చారే ఎప్పుడన్నా తభావ తొచ్చిందీ? అహా— మాట వచ్చింది కనుక అడుగు తున్నా. చెప్పరేం? అవసరమైతే, పోరి హెడ్ ఆఫీసుకు రాయండి. భయమేముంది?

రాజే : (కోపంగా) ఏం రాయాలిట హెడ్డాఫీసుకి?

శర : రాయండి. ఈ బాకీదార్ని నిలవేస్తే అయిదు అక్షల కరెంటు డిపా జిట్టు బ్రరున విత్‌డ్రా చేసి పారేస్తారు. ఆసాములు అని రాయండి. ఆమాత్రం పలుకుబడి లేదంటారేంటండోయ్

రాజే ఈ అనవసర ప్రసంగంవల్ల ఏం లాభం లేదండీ. ఇన్‌స్పెక్టరు వచ్చి నెత్తిమీద కూచున్నాడు.

శర రమ్మనండి భయమేంటి ? కావాలంటే చెయిర్మాన్ చేత చెప్పిస్తాను, చాల్దంటే ఎం ఎల్. ఏ, అదీ చాల్దంటే ఎం. పి. చేత చెప్పిస్తాను. ఏం, మినిస్టర్‌దాకా పోవాలంటా రేమిటి ?

రాజే. వాళ్లెవరూ ఏం చేయలేరు. ఇది బ్యాంకు వ్యవహారం. జరూరుగా సర్దుబాటు కావలసిందే

శర : (కోపంగా) సరే, అమ్ముకోండి సరుకు (లేవబోతాడు) తూనాబొడ్డు.

రాజే సరు కమ్మితే ఏం జరుగుతుందో మీకు తెలుసు.

శర ఏం జరుగుతుం దేమిటి ?

రాజే : కొన్నవాడు కోర్టుకు పోతే మీకు బేడీలు పడతాయి.

శర ఆఁ ! ఏంటండోయ్.

రాజే : శరభయ్యగారూ నూనె డబ్బాలు హామీ యిస్తానని, నీళ్ల డబ్బాలు పెట్టి మోసం చేస్తారా ? సి. ఆర్ పి సి ప్రకారం ఫ్రాడ్ క్రింద మిమ్మల్ని అరెస్టు చేయిస్తాను

శర (నవ్వి) ఏజంటుగారూ, అరెస్టు చేయిస్తారూ ? అందుకేనా వెంఖ్యు లంచం పారేసింది

రాజే నిజాయితీ ఉండాలి. నీళ్ల డబ్బాలు హామీపెడ్తానని నాతో చెప్పారా ? అలాంటి మోసానికి నేను చస్తే ఒప్పుకునేవాడినా ?

శర వేరే చెప్పాలేంటండి ? గుళ్లో దేవుడికి కొబ్బరికాయ కొడితే పూజారి కెందుకండీ భాగం

రాజే ఛీ మీతో వ్యవహారమే బుద్ధితక్కువ అర్జంటుగా అప్పుకావాలి, లేకపోతే వ్యాపారం బాగా నష్టపడి పోతుందని ప్రాధేయపడితే దయ తలచి ఇచ్చాను గానీ, లేకపోతే మీ ముఖం చూసేవాడినా ? బెన్స్ చెకింగ్ లేకుండా స్టాక్ రిసీట్ తెప్పించేవాడినా ? ఇంత దగాకో రనుకోలేదు.

శర రచ్చగొడితే నేను మనిషిని కానండోయ్.

రాజే. లేకపోతే మనిషైనట్టు

శర ఏంటీ (లేవబోతాడు.)

రాజే కూర్చోండి

శర (కూర్చుని) కొంచెం మర్యాదా ఇచ్చి పుచ్చుకోండి, ఏజంటుగారూ. ఇవాళ యిబ్బందుల్లో ఉన్నానని మాటలు జారుస్తున్నారు. వచ్చే సంవత్సరం ఈపాటికి నేను బ్యాంకు డైరెక్టర్నై మీ సంగతి అంతు తేలుస్తాను. ఆఁ !

రాజే అందాకా కటకటాల వెనుక జపం చెయ్యండి. ఇక్కడే ఉంటారు కదూ పోలీస్ ఇన్‌స్పెక్టరుతో సహా యిప్పుడే వస్తాను (లేస్తాడు.)

శర (కాళ్ల వేరాని కొచ్చి) ఏజంటుగారికి అంత ఆగ్రహం వస్తే మాలాంటి వాళ్లు ఎలా బతకాలండీ ?

రాజే లాభంలేదు. చర్య తీసుకోక తప్పదు

శర. ఇవి చేతులు కావు కాళ్లనుకోండి

రాజే అయితే ఎలాగో బాకీ తీర్చేయండి త్వరగా.

శర. నిజం చెప్తున్నాను. ఇప్పుడు నాకు దమ్మిడీ అప్పు పుట్టటంలేదండి

రాజే తాకట్టుపెట్టండి. వడ్డీ ఎక్కువ యివ్వండి. అప్పు దొరక్కేం చేస్తుంది.

శర. అప్పు ఇప్పించండి. మీరు చెప్పినట్టే చేస్తాను.

రాజే నేనా ఇప్పించవలసింది.

శర. మరి నాకు దొరక్కపోతే నన్నేం చెయ్యమంటారు.

రాజే సరే, ప్రయత్నిస్తాను తాకట్టు ఏం పెడతారు ?

శర కొట్టంతా తాకట్టుమీదే ఉంది ఏల్నాటి శని.

రాజే అయితే నేను విన్నది నిజమేనన్నమాట.

శర ఏం విన్నా రేంటి ?

రాజే శరభయ్య పూర్తిగా అప్పుల్లో మునిగిపోయాడని—

శర : ఛ ఛ. అదేంటండి అంతమాటన్నారు. డబ్బంతా ఎక్కడి దక్కడ బిగిసిపోబట్టి గానీ, ఆస్తి అప్పులకి మించే ఉందండోయ్. రెండో తాకట్టుపెడదాం, దానికేం.

రాజే • ఒక అరగంట ఆగి వస్తారా ?

శర చిత్తం అలాగే దయుంచండి చిక్కుల్లో ఉన్నాను అనుకున్నది అనుకున్నట్టు జరిగితే బాకీ తీర్చేద్దును. ఏల్నాటి శని లెండి ప్చ్. సెలవు ఏజంటుగారూ (నిష్క్రమణ) రాజేశ్వర్ ముఖంలో కళ బాగా తగ్గిపోతుంది నిరాశతో శూన్యదృక్కులు చూస్తూ గదిలో అటూ యిటూ తిరుగుతూ, మధ్య మధ్య హస్తవిన్యాసాలతో, తల తిప్ప టంతో ఆశా నిరాశల సంఘర్షణని వ్యక్తం చేస్తాడు తర్వాత ఒక నిశ్చయానికి వచ్చినట్టు ముఖ కవళికలు వ్యక్తం చేస్తాయి.)

రాజే శౌరూ, శౌరూ,

శౌర • (ప్రవేశించి) ఎందుకండీ పిలిచారు

రాజే ఆ శరభయ్య ఇప్పుడే వచ్చి వెళ్ళాడు.

శౌర బాకీ తీర్చేస్తా నన్నాడా?

రాజే లేదు. గడువు కావాలిట.

శౌర గడువిస్తే మీకు మాట వస్తుందా?

రాజే. ఉద్యోగమే ఊడి పోవచ్చు

శౌర : (చకితు రాలై) ఆఁ ! అదేమిటండీ?

రాజే • అవును శౌరూ ఈ అప్పు ఇవ్వటంలో పెద్ద పొరపాటు జరిగింది కొంచెం అశ్రద్ధగా ఉండడం వల్ల సరైన హామీ లేకుండా పోయింది కింది ఉద్యోగుల మీద వదిలి పెట్టడం బుద్ధి పొరపాటు అయిపోయింది.

శౌర అలా ఎందుకు చేశారండీ?

రాజే. బుద్ధి గడ్డి తిని

శౌర (బాధగా మరి ఇప్పుడేం చేద్దాం?

రాజే అదే తోచటం లేదు సమయానికి ఇన్‌స్పెక్టర్ వచ్చి సవారీ చేస్తున్నాడు.

శౌర ఇన్‌స్పెక్టర్‌కి ఈ విషయం తెలిసిందా ?

శౌర సంగతంతా అతనితో చెప్తే అర్థం చేసుకోలేడూ ?

రాజే. చెప్పలేదంటావా ? ఇవ్వాళ లోపల బాకీ పరిష్కారం కాకపోతే హెడ్ ఆఫీసుకి రిపోర్టు చేస్తానని మంకు పట్టు పట్టాడు ఇది నా రికార్డుకి తీరని మచ్చ రిమార్కు చేస్తారు సందేహం లేదు. ఉద్యోగం పోయినా పోవచ్చు కూడా

శౌర రిమార్కు చేస్తే మాత్రం నామర్దా కాదుటండీ.

రాజే. కాకపోతే ఘనత ఎలా అవుతుంది.

శౌర అంతకంటే రాజీనామా చెయ్యటం నయం.

రాజే • రాజీనామా! అవునవును అంతేమరి. యు ఆర్ రైట్.

శౌర అయితే ఇది ఇన్‌స్పెక్షన్ చేతుల్లో ఉందంటారా ?

రాజే ప్రస్తుతం అతని చేతుల్లోనే ఉంది. కొంత గడువిస్తే ఎలాగూ అతను బాకీ చెల్లిస్తాడు. బెడద వదిలిపోతుంది. అన్నట్టు శౌరూ. నే చిన్న

అయిడియా. నువ్వేమీ అనుకోకపోతే. ఇన్‌స్పెక్టరు నీ మాట వింటా డనుకుంటాను

(ఆమెవైపు చూడకుండా మరో దిక్కుకి చూస్తాడు.)

శార నా మాటా ?

రాజే పరిచయం ఉందంటున్నావు. కనుక ఓ మాట అంటే తప్పేముంది.

శార · (దీక్షగా అతనివైపు చూస్తుంది.)

రాజే ఏమంటావు ?

శార ఎంత విచిత్రపరిస్థితి !

రాజే నిజమే. నాకూ ఇష్టంలేదు పోనీ వద్దులే.

శార (మాట్లాడదు.)

రాజే వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకొన్నాట్ట (లేని నవ్వు తెచ్చుకొని) అలాగే ఉంటుందికదు శారూ ?

శార (మాట్లాడకుండా అతనివైపే చూస్తుంది.)

రాజే ఏమిటి శారూ అలా చూస్తున్నావు మాటాడవేం ? సలహా చెప్పవూ?

శార మీకు సలహా చెప్పగలిగినదాన్ని కాను — కానీ —

రాజే కానీ ?

శార ఏం లేదు.

రాజే నాకేమీ పాలుపోవటంలేదు నువ్వే ఏదో ఆలోచన చెప్పి బయట పడే ఉపాయం చూడాలి శారూ.

శార ఏ విధం చెడ్డా ఫలం దక్కదేమో.

రాజే మధ్యాహ్నం అతన్ని ఎలాగా భోజనానికి పిలుస్తాను కదూ ఆ సందర్భంలో అతను పాతపరిచయం ఎలాగూ తిరగేస్తున్నాడు. వీలైతే ఓమాట అనటంలో నష్టమేముంది.

శార (నిర్లిప్తంగా) మీ ఇష్టం.

రాజే గిరిని అడిగాను. వీలైతే వో యాభైవేలు సరభయ్యకి సర్దమని ప్రయత్నిస్తానన్నాడు

శార యాభైవేలు ఎవరిస్తారండి. మీ పిచ్చిభ్రమ కాకపోతే ?

రాజే గిరి సంగతి నీకు తెలీదు శారూ. ప్రాణం ఇచ్చే స్నేహితుడు. ఒకసారి అలా అతని దగ్గరకు వెళ్ళి వస్తాను. దగ్గరే ఇల్లు. ఇప్పుడే వచ్చేస్తాలే. శరభయ్య వస్తే కూర్చోమని చెప్పు (నిష్క్రమణ.)

(శారద ముఖంలో దైన్యం ప్రస్ఫుటమౌతుంది. ఇన్‌స్పెక్టరు గోవిందరావు తిరిగి ప్రవేశం.)

గోవిం మిసెస్ శారదా రాజేశ్వర్ !

శార (ఉలిక్కిపడి ఓ—ఇన్‌స్పెక్టర్ ! కూర్చోండి వారు బయటికి వెళ్ళారు. త్వరలో వచ్చేస్తారు. (స్వరం మామూలుగా ఉండేట్టు ప్రయత్నిస్తూ) నిలబడే ఉన్నారు. కూర్చోండి.

గోవిం పరవాలేదు.

శార (ఏం మాట్లాడాలో తోచక) కాఫీ తెస్తాను.

గోవిం నో థాంక్స్

శార · త్వరగా మాట్లాడాలసిన పని ఉన్నది కాబోలు. వారు ఇప్పుడే బయటికి వెళ్ళారు.

గోవిం చూశాను

శార · (ఆశ్చర్యంగా) ఆ !

గోవిం శార . మిసెస్ శారదా ! గోవిందరావుని ఎప్పుడూ ఎరగనట్టు ప్రవర్తిస్తున్నారు. మర్చిపోయారా ?

శార : (క్షణం ఆగి) లేదు.

గోవిం : (థాంక్స్ గాడ్ నిట్టూర్చుస్తూ) చాలా సంతోషంగా ఉంది.

శార : కాని, కొన్ని విషయాలు మర్చిపోవటం చాలా మంచిది కదండీ

గోవిం అవును అందుకే ఆ సంఘటన—అంటే నా సస్పెన్షన్—మర్చిపోవటానికే ప్రయత్నిస్తాను

శార మీకు అపకారం చేశాను. క్షమించండి

గోవిం లేదు లేదు మీ మనసు తెలుసుకోలేక నేనే అపచారం చేశాను. మీరే క్షమించాలి.

శార మీకు బి ఎస్‌సి లో ఫస్ట్ క్లాస్ తప్పిపోయినందుకు చాల విచారించాను.

గోవిం ఓ, వెరీ కైండ్ ఆఫ్ యూ

శార . నేను తెలిసి కావాలని ఎవరికీ అపకారం చేయలేదు కాని, ఆ సంఘటన నా మనసుని కోత పెడ్తుందండీ.

గోవిం మీకు నామీద అంత జాలి ఉందనుకోలేదండీ

శార అనాలోచితంగా ప్రవర్తించాను కేవలం ఏదో భయావేశంవల్ల అలా చేశానని తరువాత అర్థమైంది మీరు చాలా బాధపడ్డారా ?

గోవిం . (విషాదంగా నవ్వి) ఆ విషయం అడక్కండి

శార నావల్లే మీకు క్లాసు తప్పిపోయింది కదూ ?

గోవిం కాదు కాదు నా దురదృష్టానికి మీరెలా కర్తవుతారు (క్షణంలో తేరుకున్నట్టు) క్లాసు రాకపోయినా ఇబ్బందేముంది లెండి. సి ఎ ప్యాసై మంచి ఉద్యోగంలోనే ఉన్నాను కదా

శార మా వారికి ఆ ఉదంతం చెప్పాను

గోవిం (ఆదుర్దాగా) చెప్పారా? అరె! రాజేశ్వర్‌తో ఆ ప్రసక్తి తేవద్దని మిమ్మల్ని వేడుకోవటానికే వచ్చానండి.

శార చెప్తే తప్పేముందండి?

గోవిం మీ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకొంటున్నానను కోకండి— రాజేశ్వర్ ఆ విషయాన్ని ఎలా తీసుకున్నారు ?

శార మీ విషయం విని బాధ పడ్డారు

గోవిం : ఆయన యోగ్యుడే కావచ్చు కానీ ఇలాంటి సంగతులు మరిచిపోటమే మంచిది లేకపోతే ఎక్కడెక్కప్పుడు అవి ములుకుల్లా గుచ్చుకుంటాయి.

శార ఎవరికి?

గోవిం ఈ సందర్భంలో రాజేశ్వర్‌కి

శార వారిది అంత నీచమైన మనస్తత్వం కాదండీ గోవిందరావు గారూ

గోవిం సంతోషమే ఆయన్నేమి అనటం లేదు నేను జాగ్రత్త కోసం చెప్పాను మీతో చెప్పవచ్చో చెప్పకూడదో తెలియదు ఇందులో ఇంకో చిక్కుంది అది బ్యాంకు వ్యవహారం. మీకు తెలిసే ఉంటుందేమో

శార చెప్పండి.

గోవిం రాజేశ్వర్ శరభయ్య అనే ఆసామీకి యాభై వేల రూపాయలు అప్పు మంజూరు చేశాడు ఆ బాకీ వాయిదా దాటి పోయింది శరభయ్య ఇంత వరకు బాకీ చెల్లించలేదు. వాయిదా మీరితే బ్యాంకు వాళ్లు హామీ ఉంచిన వస్తువుల్ని అమ్మి బాకీ జమకడతారు కాని రాజేశ్వర్ ఆ పని చేయలేదు

శార వారిది సుతి మెత్తని మనసండీ. శరభయ్య కాళ్లా వేళ్లా పడి బతిమాలుకొని ఉంటాడు

గోవిం . అసలు విషయం అది కాదు ఈ అప్పుకి శరభయ్య నూనె డబ్బాలు హామీ ఇచ్చాడు. కానీ వాటిలో ఉన్నది నూనె కాదు, నీళ్లు.

శార . (ఉలిక్కిపడి) నీళ్లా! మా వారు అననే అన్నారు

గోవిం . (అనక్తిగా) అన్నారా? ఎప్పుడు? జ్ఞాపకం తెచ్చుకుని చెప్పండి ఎప్పు డన్నారు రాజేశ్వర్.

శార ఇవాళే నండీ. ఇంత క్రితమే.

గోవిం ఇవాళేనా? కానీ అతనికి అంతకుముందే ఈ మోసం తెలుసునని నా అభిప్రాయం

శార ఏమిటి మీరనేది? తెలిస్తే అప్పు ఎలా ఇస్తారు ?

గోవిం అదే వచ్చిన పేచీ సారీ శారదా దేవి. ఇదంతా లాలూచీ.

శార మీకు మా వారిని గురించి బొత్తిగా తెలియదు, గోవిందరావు గారూ. పూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని నెమ్మదిగా చెప్తున్నాను. మరొకరైతే ఈ మాట లన్నందుకు తక్షణం ఇంటినించి పొమ్మనే దానిని.

గోవిం కనువిప్పు కలిగేదాకా భర్తల్ని గురించి భార్యలు అలాగే అనుకుంటారు. సహజమే

శార వారు అందరిలాంటి వారు కాదు అత్యంత యోగ్యులు. గోవిందరావు గారూ వారిలాంటి మంచివారు నూటికి కోటికి ఒకరు

గోవిం ' భర్త పట్ల భార్యకి అలాంటి అభిప్రాయం ఉండటం మంచిదే

శార మీరు వ్యంగ్యంగా మాట్లాడవలసిన అవసర మేమీ లేదు

గోవిం లేదు శారదా దేవీ, నేనెప్పుడూ చాలా సూటిగా మాట్లాడతాను సరే అసలు విషయంలోకి వస్తాను. టెస్ట్ చెకింగులో ఈ హామీ బండారం బయటపడిపోయింది ఇదంతా హెడ్‌క్వార్టర్స్‌కి రిపోర్టు ఇవ్వటం నా ఉద్యోగ ధర్మం కానీ దీనివల్ల రాజేశ్వర్‌కి బ్లాక్ మార్కు వస్తుంది తప్పకుండా దివర్టు చేస్తారు. చివరికి ఆనింద నేను మోయ వలసి వస్తుంది. ధైర్యంగా భరిస్తాను మీపై ద్వేషం వల్ల నేనీ పని చేసానని రాజేశ్వర్ మీతో చెబుతాడేమోనని ఎందుకో ఒక అధైర్యం కలిగింది ఇప్పటికే నన్ను మీ రపార్థం చేసుకున్నారనే దిగులు గుండెల్లో గూడు కట్టుకుని ఉంది ఇంక మీ మీద ద్వేషం పెంచుకున్నానని కూడా మీరు నమ్మితే అది నా హృదయానికి రంపపు కోత అది నేను భరించలేను అందుకే నిజం చెప్పటానికి వచ్చాను. నా మాట విశ్వసిస్తారు కదూ?

శార (నెమ్మదిగా) మిమ్మల్ని అపార్థం చేసుకోను గోవిందరావు గారూ.

గోవిం ఎంత చల్లని మాట అన్నారు! ఈ పదేళ్ల బడబానలం ఈ ఒక్క మాటతో చల్లారిపోయింది శారదా దేవి

శార పదేళ్ల బడబానలం! ఆ విషయాన్ని అలాగే మననం చేసుకుంటూనే ఉన్నారా మీరు?

గోవిం గాయం గాయమే.

శార ఈ సంఘటన మీ శ్రీమతికి చెప్పారా? (దీక్షగా అతనివంక చూస్తుంది)

గోవిం నాకు వివాహం కాలేదు

శార కాలేదా? ఇంకా సంబంధాలు చూస్తూనే ఉన్నారా!

గోవిం లేదు

శార కారణం?

గోవిం మీకు రాసిన ఉత్తరంలో ఏమి రాశాను?

శార గోవిందరావు గారూ!

గోవిం శారదా దేవి, నేను నిజాయితీలేని మనిషిని కాను.

శార (ఆవేదన దాచుకోనటానికి ముఖం పక్కకి తిప్పుకొని) ఇలా మీ జీవితం ధ్వంసం చేసుకుంటారా?

గోవిం జీవితం బహుముఖమైంది. వివాహంతోనే అది ముడిపడలేదు. సాధించవలసినవి చాలా ఉన్నాయి.

శార · జీవితంలో ఒక అవసరం వివాహం. సంపూర్ణజీవిత వికాసానికి వివాహం అవసరం గోవిందరావుగారూ చదువుకున్నవారు విజ్ఞతతో ప్రవర్తిస్తారని ఆశించాను. ఇలా మొండి పట్టుదలతో జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారని ఎప్పుడూ అనుకోలేదు.

శార . వ్యర్థం చేసుకున్నానని నేను అనుకోటంలేదు.

శార : దానికి కారణం మీకు నా మీద ఉన్న కసి, కోపం, అసూయ.

గోవిం శారదాదేవి!

శార · అవును ప్రేమ నిజాయితీ అనే పరదాల వెనుకాల మీరు దాచుకున్నది ద్వేషం దాంతో మిమల్ని మీరు హింసించుకుంటున్నారు ఇతరులను హింసిస్తున్నారు

గోవిం . శారదాదేవి! ప్రేమ అనేదొకటి స్వకపోల కల్పిత భావమని, అదొక భ్రమ అని మీ అభిప్రాయం! అంతేకదూ? ఇలాంటి అభిప్రాయానికి మీరు రావటానికి కారణం రాజేశ్వర్! అవును

శార మీ పరిశోధన ప్రజ్ఞకి అభినందనలు అలాంటి అభిప్రాయానికి నేను రావటానికి కారణం వారు కాదు— మీరు ఆ అభిప్రాయం క్రమంగా నేను మార్చుకోటానికి కారణం వారు

గోవిం (దెబ్బతిని) శారదాదేవి, రాజేశ్వర్ అదృష్టవంతుడు కానీ .. కాని నా ప్రేమను క్రూరంగా శంకించారు.

శార క్షమించండి కాంతి అద్దం మీద పడి పరావర్తనం చెందే విధంగా ఇద్దరి వ్యక్తుల మధ్య ప్రేమ ప్రకాశిస్తుంది స్త్రీ పురుషుల ఏక పక్ష ప్రేమ అర్థం లేదని నా అభిప్రాయం గోవిందరావు గారూ, మీరు వివాహం చేసుకుని సుఖమయమైన జీవితాన్ని గడిపితే నాకు సంతోషంగా ఉంటుంది.

గోవిం శారదాదేవి, మీ కంటె ఎక్కువ చదువుకున్నా నేమో కాని మీ నిశిత దృష్టి నాకు లేదు మీ మాటలు వింటే నాలో ఏదో మంచు కొండలా కరిగిపోతోంది కృతజ్ఞుణ్ని

శార ఏదో నోటికి వచ్చినట్లు మాటాడాను మీ మనసుకి నొప్పి కలిగితే క్షమించండి.

గోవిం లేదు, లేదు నా కళ్లు తెరిచారు మీ మేలు మర్చిపోలేను.

శార గోవిందరావు గారూ! స్నేహ ధర్మంలో అడుగుతున్నాను. నాకొక మేలు చెయ్య గలరా?

గోవిం (సంతోషంగా) నేను ధన్యుణ్ని శారదాదేవి అంతకంటేనా! నా వంటి అల్పుడు మీకు చేయగలిగిన మేలు ఏముంది ?

శార : ఆ శరభయ్య బాకీ విషయం. అతనికి కొంత గడువు ఇవ్వటానికి వీలు పడదా?

గోవిం . (నిట్టూర్చి) మిసెస్ శారదా రాజేశ్వర్.

శార ఓ, మన్నించండి వీల్లేక పోతే పోనివ్వండి.

గోవిం · ఇంత చిన్న సహాయం మీరు కోరితే వీల్లేక పోతుందా? ఒక కాగితం, కవరూ ఉంటే ఇస్తారా?

శార (డ్రాయర్ తీసి కాగితమూ, కవరూ ఇస్తూ) ఇవిగోనండి

గోవిం (కాగితం మీద త్వరత్వరగా ఏదో రాసి కవర్లో పెట్టి) కొంత గడువు దొరుకుతుంది (కవరు అంటించకుండానే ఆమెకిస్తూ) ఇది రాజేశ్వర్ కివ్వండి. శరభయ్య ఇవాళ డబ్బు చెల్లించక పోతే ఈ కవరు హెడ్ ఆఫీసుకి పోస్టు చేయించ మనండి. ఆ సంగతి నాకు సాయంత్రం లోపల టి.వి.కి కబురు పెట్టించమని చెప్పండి

శార మీ సహాయానికి ఎంతో కృతజ్ఞురాలి నండీ గోవిందరావు గారూ,

గోవిం నో మెన్షన్.

శార ఇవాళ మా యింట్లో భోజనం చేసి వెళ్ళాలి మీరు వారు కూడా చెప్పారు.

గోవిం థాంక్స్ కానీ ఇవాళ కాదు మరెప్పుడైనా కలుసుకునే అవకాశం లభిస్తే మీ ఆహ్వానాన్ని తప్పక వినియోగించుకుంటాను. సెలవు శారదాదేవి

శార · నమస్కారమండీ

(త్వర త్వరగా గోవిందరావు నిష్క్రమణ. శారద కవరు వైపు ఒక సారి చూసి డ్రాయర్లో పడేస్తుంది. గోడవున్ కీపర్ నరసింహం ప్రవేశం. నడి వయసు మనిషి దారిద్ర్యంతో కృంగిపోయిన శరీరం ముడుత పడిన ముఖం ఉన్న వయసును మించి చెబుతుంది. పాత కావి పట్టిన పంచె షర్టు, కండువా— చవకబారు చెప్పులు. పాతరకం ప్రేముగల కళ్ళ జోడు మాటల్లో అణకువ ప్రవర్తనలో, అంగ విన్యాసంలో నమ్రత ద్యోతకమవుతాయి.)

నరసింహం నమస్కారమమ్మా.

శార నమస్కారం కూర్చోండి వారు పనిమీద బయటికి వెళ్ళారు వచ్చే వేళయింది

నర : వినయం (కూర్చోకుండానే) తమరు నన్నెప్పుడూ చూసి ఉండరేమో, నేను బ్యాంకు గోడవున్ కీపర్ని నరసింహం అంటారండి

శార · అలాగా (పేపరు టీపాయ్ మీద పడేసి) పేపరు చూస్తూ ఉండండి ఏజంటు గారు ఇప్పుడే వస్తారు (వెళ్ళబోతుంది)

నర వినయం ( మర్యాదకి పేపరు తీసుకొన్నా దాని వైపు చూడకుండానే) తమతో ఒక్క మాట చెప్పుకో వచ్చా అమ్మా.

శార నాతోనా? ఆఁ— ఏమిటా విషయం?

నర నేను గొప్ప చిక్కుల్లో ఉన్నానమ్మా.

---

శార డబ్బేమైనా అవసరమా?

నర. డబ్బు ఎప్పుడూ అవసరమే. కానీ ఇప్పుడు ప్రత్యేకించి కలిగిన కష్టం అది కాదమ్మా.

శార: (నసుగుతూ) ఏదైనా బ్యాంకు వ్యవహారమైతే అది వారితో చెబితేనే మంచిది నాకా విషయాలేమీ తెలియవు.

నర. చిత్తం. తమరు చాలా దయగల వారని విన్నాను. మీతో చెప్పుకుంటే న్యాయం జరుగుతుందని ఆశ పడుతున్నానమ్మా.

శార: (అయిష్టంగా) ఏం జరిగిం దంటారు?

నర. చిత్తం చెప్తా మీరు వినే ఉంటారేమో శరభయ్య అనే ఆసామీ బ్యాంకులో ఒక లయా యాభై వేలు అప్పు తీసుకున్నాడమ్మా. వాయిదా మీరినా చెల్లించలేదు. ఇన్‌స్పెక్షనులో అతను హామీ ఉంచినది దగా సరుకని బయట పడ్డది.

శార మరి దగా సరుకో మంచి సరుకో చూసుకోకుండా అప్పు ఎలా ఇచ్చారు?

నర అక్కడే పొరపాటు జరిగి పోయిందండి.

శార ఎవరి వల్ల?

నర చిత్తం నా వల్లేనని ఏజంటు గారు రిపోర్టు తయారు చేశారని తెలిసింది.

శార బాధ్యత మీదే కాబోలు

నర. చిత్తం కానీ ఈ అప్పు విషయంలో నేనూ ఏజంటు గారి చిత్తం చొప్పునే వ్యవహరించానండి.

శార. (కొంచెం కోపంగా) అయితే తప్పు వారి దే నంటారా?

నర చిత్తం అంత మాట అనలేదండి

శార. నరసింహం గారూ. మీ తప్పుకి ఇతర్ల మీద నెట్టటం పెద్దమనిషి తరహా కాదు.

నర: గ్రహించకండి. ఏజంటు గారు భరోసా ఇచ్చారనుకొని మోసపోయాను.

శార: మోసపోయారా? వారు మీకు భరోసా ఇచ్చారా?

నర. చిత్తం శరభయ్య పాత కాతా దారేనని, నమ్మకస్తుడనీ అర్జంటుగా అప్పు ఇవ్వాలనీ ఏజంటు గారు నాతో ప్రత్యేకించి చెప్పకపోతే నేను సరుకు చెక్ చెయ్యకుండా ఎప్పటికీ సర్టిఫై చేసే వాడిని కాదండీ

శార నరసింహం గారూ, మీ రేం మాట్లాడుతున్నారో తెలుసా? వారు శరభయ్యతో లాలూచీ ఐ మిమ్మల్నీ, బ్యాంకునీ మోసం చేశారనేగా మీభావం?

నర రామ రామ. ఎంత మాట! మీ కలాటి భావం కలిగిస్తే నన్ను క్షమించండి. నేను చెప్పదలచుకున్నది ఏజంటు గారు నన్ను తొందర పెట్టక పోతే ఈపొరపాటు నా వల్ల జరిగేది కాదని మాత్రమేనండీ.

శార. సరే, అయితే ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?

నర: తమరు నన్ను రక్షించాలి శారదమ్మ

శార క్షమించండి ఇలాంటి వ్యవహారాల్లో నేను జోక్యం కలిగించుకో లేను.

నర: అలా అయితే నేనూ, నా కుటుంబమూ సర్వనాశనమై పోతామండి నా పరిస్థితులు మీకు తెలియవు ఇనుపగజ్జెల తల్లి నా పట్టింట్లో నిత్యం నాట్య మాడుతోంది అష్ట కష్టాలంటారే, అవన్నీ నాకు నిత్యమూ అనుభవైనవేద్యమే. ఈ ఉద్యోగం పోతే నేను అడుక్కు తినవలసిందే

శార. కష్టాలు ఎవరికి లేవు నరసింహం గారూ? పోనీ మీ రన్నట్టు నేను వారికి ఈ విషయంలో కనికరం చూప మని చెప్పినా ఫలితం ఉంటుందనుకోను.

నర. మీరు దయతలిస్తే వారు నా మీద ఈ బాధ్యత మోపకుండా చేయగలరని నాకు ధైర్యం ఉందమ్మా

శార: అంటే ఈ బాధ్యత అంతా వారే స్వీకరించాలని కదూ మీ అభిప్రాయం?

నర. అమ్మా, తలుచుకుంటే ఇది ఎవరి మీదికీ రాకుండా ఉప్పున ఊదేయగల స్తోమత వారికి ఉంది

శార మన్నించండి నేను వారిని ఈ విషయంలో ఒత్తిడి చేయలేను.

నర: అమ్మా, ఈ జీవితంమీద భరించలేని బరువులు ఎన్నో పడి కుంగిపోయాను. ఇంకొక్క గడ్డిపోచ పడినా నడుము విరిగిపోతుంది. అప్పుడు నాకు ఆత్మహత్యే శరణ్యం.

శార ఆత్మహత్య!

నర అంతకంటె నాకు దారి లేదు.

శార. బెదిరిస్తున్నారా నరసింహంగారూ?

నర: కాదమ్మా, జరగబోయే దేదో చెప్పుకుంటున్నాను మీకూ, పిల్లలున్నారు. వాళ్లెంతో అభివృద్ధిలోకి రావాలనీ, మిమ్మల్నీ, దేశాన్నీ, ప్రపంచాన్ని ఉద్ధరించాలని ఎన్నో కలలు కంటారు. నా కలలు ఏమిటో తెలుసా? నా రక్తం పంచుకున్న నా బిడ్డలు కూటికీ, గుడ్డకీ కటకట లాడిపోకుండా పదికాలాలపాటు బతికి ఉంటె చూడాలనే అతి సామాన్యమైన కలలు వాటిని దూది పింజల్లా చెదరగొట్టకండని వేడుకుంటున్నాను

శార. (చలించి) నరసింహంగారూ ఇందులో మీ తప్పేమీ లేకపోతే నేను చేయగలిగింది చేస్తాను

నర నాకు మాట ఇవ్వండి శారదమ్మా.

శార. ప్రయత్నిస్తా నన్నానుగా

నర అలా కాదు వారు రాసిన రిపోర్టు నా కళ్లముందే చింపించివేస్తేనే నాకు మనశ్శాంతి.

శార. మీరు మొండిగా మాట్లాడితే ప్రయోజనం ఉంటుందనుకుంటున్నారా?

నర. నా మనసు మనసులో లేదమ్మా. కానీ, ఏజంటుగారికి నేను నిర్దోషినని తెలుసు. వారు ఆ మాట నా ముఖంమీద చెప్పకపోతే నాకు ఆత్మహత్యే శరణ్యం.

శార సరె, మీ యిష్టం (ముఖం చిట్లించుకుంటుంది.)

నర ఆఁ! అయితే మీరు వాగ్దాన మివ్వలేరా? శారదమ్మా. ఎంతో ఆశతో ఆఖరు ప్రయత్నంగా మీ దగ్గరికి వచ్చాను. ఇది మీ కుటుంబానికి ఎంత మాత్రం శ్రేయస్కరం కాదమ్మా. ఒక నిర్దోషి ఎలా క్షోభ పడుతున్నాడో గ్రహించండి తనపరువు ప్రతిష్ఠలకోసం, తన ఉద్యోగ భద్రతకోసం, రాజేశ్వర్‌గారు నా ఉద్యోగానికి ముప్పు తెచ్చి నా పరువు ప్రతిష్ఠల్ని మంటగలపటానికి ప్రయత్నిస్తున్నారు. ఒకరి తప్పు మరొకరిమీద నెట్టటం పెద్దమనిషి తరహా కాదన్నారు మీరు అంతే కాదు అది ఘోరమైన ద్రోహం విశ్వాసఘాతుకత్వం శారదమ్మా, వినటానికి మీకు కష్టం కలగవచ్చు కానీ చెప్పకతప్పదు.

(రాజేశ్వర్ ప్రవేశిస్తూ, నరసింహాన్ని చూసి ఒకక్షణం తలుపు దగ్గర ఆగుతాడు.)

ఆ శరభయ్య దగ్గిర వెయ్యిరూపాయలు లంచం తీసుకుని రాజేశ్వర్ గారు బ్యాంకుకళ్లల్లో దుమ్ము కొట్టారు. బయటపడేసరికి లోకువగా ఉన్నానని నామీదికి—

రాజే (తటాలున నరసింహం దగ్గరికి దూకి) రాస్కెల్, ఏమిటి వాగుతున్నావ్? (షర్టు కాలరు పట్టుకుని) లంచం తీసుకొన్నానా? ఇడియట్ (కొట్టబోతాడు.)

శార (కలగజేసుకుని) ఏమిటండీ ఇది ? ఆగండి (చెయ్యి పట్టుకుని విడదీస్తుంది) తొందరపడకండి ఎవరి పాపాన వాళ్లే పోతారు

రాజే బతికిపొయ్యావు పో. పో, నా కళ్లముందు నించి. నిన్ను డిస్‌మిస్ చేయించి పారేయకపోతే నాపేరు రాజేశ్వర్ కాదు

శర (తమాయించుకొని, దృఢంగా, ఆవేశంలో) అవును డిస్‌మిస్ చేయిస్తారు చిన్న చేప పెద్దచేపను మింగలేదు గనుక పెద్ద చేప చిన్న చేపను మింగుతుంది అదే యుగధర్మం. ఏజంటుగారూ, నిన్న ఇన్‌స్పెక్టర్‌గారి దగ్గిర మీరు నామీద ఎంత అరిచినా, ఏం నేరం మోపినా నేను కిమ్మనలేదు కారణం వారి ముందు మీ గౌరవాన్ని కాపాడటం నా విధిగా భావించటమే అది మీరు అపార్థం చేసుకున్నారు. వ్యవహారం ఏదోవిధంగా మీరు సర్దుబాటు చేస్తారనుకన్నాను. కానీ, నా మీదికి తప్పంతా తోసేశారూ ఒక బీదవాడిని, చిన్న ఉద్యోగిని నేనేం చెయ్యగలను నోరు మూసుకుని సహిస్తానని ఈ అన్యాయం తలపెట్టారు. రాజేశ్వర్‌గారూ ఒక నిరపరాధిని మీరు ఇంచుమించుగా హత్య చేస్తున్నారు ఆదోషం జీవితాంతం దుస్స్వప్నంలా మీ వెంటబడి తరిమి తరిమి మీకూ, మీ భార్య బిడ్డలకూ సుఖమూ, శాంతిలేకుండా వేధించక మానదని తెలుసుకోండి సెలవు. (నిష్క్రమణ.)

(శారద ప్రాన్పడిపోతుంది.)

రాజే ఏడిశాడు. ఇంకా ఏం కూశాడు శారూ వీడు ?

శార (తేరుకుని) ఏమిటండీ ఈ గొడవంతా ?

రాజే అతను చెప్పలేదా ?

శార అందుకే అడుగుతున్నాను ఎటువంటి నింద వేశారండీ (గాద్గదికంగా) అదంతా ఒట్టిదని చెప్పండి ఏం, ఒట్టిదే కదూ ? నాకు తెలుసండీ ఎక్కడో ఏదో పొరబాటు జరిగిందని అంతా మీ మీదకి విరుచుకుపడుతోంది అంతే కదూ ?

రాజే పిచ్చి శారూ అంతే, అంతే నువ్వివన్నీ మనసుకి ఎక్కించుకోకు. ఈ బ్యాంకు గొడవలు నాకు నిత్యం ఉండేవే కొత్తేమీ లేదులే

(శరభయ్య తిరిగి ప్రవేశం)

శర ఏజంటుగారింట్లోనే ఉన్నారే ఉన్నారో లేరో అని అనుమానిస్తూ వచ్చాను బాకీసంగతేంచెప్తారో, ఏంటో అని ఒకటే యావ అనుకోండి శ్లేష్మంలో పడ్డ ఈగలా గిజగిజ .. ..

రాజే శరభయ్యగారూ, ఈ బాకీ ముమ్మాటికీ ఇవాళ పరిష్కారమై పోవలసిందే మీరేం తిప్పలు పడతారో నాకనవసరం మీకు డబ్బు సమకూర్చవలసిన బాధ్యత నాకేమీ లేదు అది మీ బాధ్యత బాకీ పరిష్కారం కాకపోతే, పోలీసు రిపోర్టిచ్చి తీరుతాను.

శర ఏజంటుగారూ మనిషి వచ్చీ రాగానే అట్లా విరుచుకుపడితే గుండె పగిలి చావాల్సిందేనా !

రాజే నన్ను విసిగించకండి.

శర చూడండమ్మా (శారదతో) కాస్త మీరు చెప్పండమ్మా మనిషి వూబిలో దిగబడ్డాడు, కాస్తంత చేయూత, ఇద్దాం అని, లేకపోతే ఎట్లా ?

రాజే చెయ్యూతిస్తే ఇచ్చినవాడిని వూబిలోకి దిగలాగేది మీలాంటివాళ్లే.

శర . అనండి. అనండి. ఏల్నాటి శని. ఎన్నిమాటలు పడాలో.

రాజే మధ్యాహ్నం రెండు గంటల దాకా గడువిస్తున్నాను

శర ఆ ఇన్‌స్పెక్టర్‌కేదో పారేద్దాంలెండి

శార ఆ ఇన్‌స్పెక్టర్ అలాంటివారు కారు

శర అబ్బో, పై కందరూ అంతేలెండమ్మా. ఏజంటుగారూ [illegible] అనండి ... నేను లొంగదీస్తా.

శార . ప్రయోజనం ఉండదు

శర · అది మనిషినిబట్టి ఉంటుందండీ టాక్టు ఉండాలి టాక్టు.

రాజే శరభయ్యగారూ, నా కాలం వృథా చేయ్యకండి రెండు గంటల లోపల బాకీ పరిష్కారం కావాలి మళ్లీ చెబుతున్నాను లేకపోతే పోలీసు రిపోర్టిచ్చి తీరుతాను చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనంలేదు.

శర మీ రలా నిర్దయగా నా పరువు తీయాలని చూస్తే, మరి నేనూ— (శారదవైపు చూసి ఆగుతాడు)

రాజే (చప్పున తగ్గి) అహా—ఇది నా సొంతడబ్బు కాదుకదటండీ.

ర అందుకే అంత జబుర్దస్తీ ఎందుకూ అంట ?

రాజే అది ఉద్యోగధర్మం

శర నేనేం ఎగ్గొడతానా ? పరాయి సొమ్ము దగ్గర మీకూ నాకూ పేచీ ఎందకండి ?

రాజే పరాయి సొమ్ముకదా అని ఉపేక్షిస్తామా ?

శర ఎందు కుపేక్షిస్తాం ? స్వంత డబ్బులాగే చూసుకుంటున్నాం.

రాజే శరభయ్యగారూ మీరు నన్నిలాంటి ఇరకాటంలో పడేస్తారనుకుంటే మీకు పైసా అప్పు మంజూరు చేసేవాడినికాదు (నుదురు పట్టుకుని ఛీ

ర ఊరికే ఇటు పారేసినట్టే మాట్లాడుతున్నారే !

రాజే (ముఖం చిట్లించుకుని) పోవయ్యా బాబూ, పో, నీకో నమస్కారం.

శర రమ్మంటే వచ్చాను పొమ్మంటే పోతాను పోను మరీ డబ్బులో మునిగితే మనుషులికి డబ్బు కావాలి గానీ, మనుషు లెందుకూ ? వెయ్యిరూపాయలు జేబులో పడేసినప్పుడు—

శార · (దిగ్భ్రాంతితో) ఆఁ!

రాజే (గట్టిగా) శరభయ్యా అతిగా మాట్లాడితే ఇప్పుడే వారంటు తెప్పిస్తాను నువ్వూ, నీ వ్యాపారమూ, నీ పరువూ సర్వనాశనమై క [illegible] జన్మస్థానంలో మగ్గిపోతావు జాగ్రత్త తాహతెరిగి మసలుకో—

(గిరి ప్రవేశం)

గిరి రాజేశ్వర్, ఏమిటి భయద జీమూత ఫెళఫెళార్భటలు ! పిల్లలు భయపడిపోయేరు ! ఎవరు ? ఓ—శరభయ్యగారా శుభం భవతు శరభయ్యగారూ ?

శర · ఏ శుభమో, ఇంటికి పిలిచి గంయి మంటున్నారు ఏజంటుగారు.

గిరి ఏమిటి రాజేశ్వర్ ఈ ప్రచండ యుద్ధకాండ ?

రాజే గిరీ. ఇప్పుడే మీ యింటి వెళ్లి వచ్చాను నువ్వు లేవు అప్పు సంగతి ఏం చేశావు ?

గిరి అప్పు ఇప్పించలేని నా అప్రయోజకత్వాన్ని ఒప్పుకోటానికే ఇప్పుడిలా వచ్చాను రాజేశ్వర్

రాజే ఆఁ ! (నిరాశతో) వాట్ ఎక్సైసిస్ ! ఎంత విషమ పరిస్థితి

గిరి వెరీ సారీ డియర్ రాజేశ్వర్

(శరభయ్య చల్లగా జారుకుంటాడు.)

రాజే దుష్కాలం ప్రవేశించింది దూళొవా ? ఆ శరభయ్య ఎలా చల్లగా జారుకున్నాడో ! వట్టి నక్కజిత్తుల మనిషి. తెలుసుకోలేకపోయాను.

గిరి మనుషుల్ని సరిగా అంచనా కట్టటం అందరికీ అందుబాటులో లేని విద్య రాజేశ్వర్.

రాజే ఈ బ్యాంకుతో నాకు ఋణం తీరింది ఇహ నా ఉద్యోగానికి తిలోదకాలే. సంవత్సరంలో ఇన్నిరోజు లుండగా ఆ ఇన్‌స్పెక్టర్ ఇదే సమయంలో రావటం నా దురదృష్టం నువ్వయినా సమయానికి తప్పక ఆదుకుంటావని ఆశపడ్డాను, గిరీ ఇలా మొండిచెయ్యి చూపిస్తావని అనుకోలేదు.

గిరి నా సమస్త విషయాలు నీకు కూలంకషంగా తెలుసు.

రాజే ఆఫ్‌కోర్స్. తెలుసు.

గిరి శ్రీమతి రాజేశ్వర్. కొంచెం కాఫీ ఇస్తే మీకు పుణ్యం ఉంటుంది.

శార ఓ తప్పకుండా (నిష్క్రమణ.)

గిరి ఇవాళ కొన్ని ముఖ్య విషయాలు తెలుస కున్నాను, రాజేశ్వర్

రాజే అంత అకస్మికంగా తెలుసుకున్న ఆ ముఖ్య విషయా లేమిటి ? నేను వట్టి పరమదౌర్భాగ్యుడైన ఆఫీసర్‌నని !

గిరి : (తెల్లబోయి) నీ విషయాలు కావు.

రాజే ఓ అయితే సరే ఊ చెప్పు.

గిరి నేను ప్యాసైంది వట్టి బి. ఎ.—అనీ థర్డ్‌క్లాసనీ.

రాజే మైగాడ్—ఆఫ్టర్ ట్వెల్వ్ ఇయర్స్ !

గిరి ఆ డిగ్రీ సర్టిఫికెట్ ఇన్నేళ్లనించీ నన్ను చూసి, నవ్వుతూనే ఉందని !

రాజే · మిస్టికల్.

గిరి నాకు ఉద్యోగంలేదు

రాజే · వాట్ డు యు మీన్ ! నీకు ఉద్యోగం లేకపోవట మేమిటి ! ఎక్కడ డాన్సు పర్‌ఫార్మెన్స్ జరిగినా, ఎవరు నాటకం వేసినా, ఎప్పుడు ఎవరికి కవి సన్మానం జరిగినా, ఏ సభ ఎందుకు ఏర్పాటైనా—చక్రం తిప్పేది మిస్టర్ గిరి కాకపోతే మరెవరు ?

గిరి : క్షణం తీరికా, దమ్మిడీ ఆదాయం లేని ఉద్యోగం చేస్తున్నానని ఇవాళ తెలిసింది.

రాజే : అదేమిటోయ్ ఆస్తిమీద అజమాయిషీచేసి కూడ చెబుతున్నావుగా.

గిరి . నాకు సెంటు భూమి లేదు.

రాజే పే రెవరిదైతే ఏం ? నీ భార్యదైతే నీదికాదూ ?

గిరి ఒకరి ఆస్తి ఇద్దరి దెలా అవుతుంది బ్రదర్ !

రాజే . అంటే ఏదో పేచీ వచ్చిందంటావా ?

గిరి : పేచీ పెట్టుకునే స్వభావం కాదు నాది. నీకు తెలుసు.

రాజే : మరి అకస్మాత్తుగా ఈ జ్ఞానోదయం ఎలా కలిగింది.

గిరి · ఎంత ఆప్తమిత్రుడైనా, అతడు ఎటువంటి చిక్కులో ఉన్నా, నా హృదయం ఎంత ఆరాటపడినా నేను చేయగలిగింది శూన్యం

రాజే ఓ అదా ! డోంట్ వర్రీ మిసెస్ గిరికి ఇష్టం లేకపోతే బలవంతమేముంది. నిన్ను అపార్థం చేసుకునేటంత అల్పుణ్ణా గిరి.

గిరి కాదు, కాదు, రాజేశ్వర్. నేను చెప్పేది నా స్వవిషయం. ఇవన్నీ నేనెప్పుడూ ఆలోచించలేదు.

రాజే : ఆలోచించే అలవాటు నీకు లేదుగా.

గిరి : తప్పదు. దేవుడు మెదడు పెట్టింది ఆలోచించటానికే నట ! తెలుసుకున్నాను. కాని, అందులో క్రాస్‌రోడ్లు బిలిబిలిగా పెట్టేశాడోయ్. చీకట్లో చిక్కుపడినట్టు చిక్కుపడిపోవలసిందే.

రాజే : నువ్వేదో వేదాంతం మాట్లాడుతావు. నా కర్థంకాదు.

గిరి అయితే గప్‌చిప్. నాకీ ఉద్యోగం చూసిపెడుదూ !

రాజే ఇద్దరం జాయింటుగా వెతుక్కోవచ్చు. నేనూ ఇక వాంటెడ్ కాలమ్సు చూడవలసిందే.

గిరి అయితే పద పోదాం, దేశం మీదికి.

రాజే మా శ్రీమతికి, నీకూ ఒక్కసారే ఉద్యోగం పిచ్చి పట్టినట్టుంది.

గిరి : పిచ్చి పట్టాలే గానీ పడితే వదల్దు.

రాజే గ్రహశాంతి చేయిద్దాంలే

గిరి (నవ్వి వోం శాంతి శ్శాంతి .

(శారద కాఫీ కప్పులతో ప్రవేశం.)

శార · కాఫీ ప్లీజ్.

గిరి థాంక్స్

శార : ఏమిటి స్వస్తి పలుకుతున్నారు ?

గిరి గ్రహశాంతికిలెండి.

శార . దుష్టగ్రహాలు ఆవేశించటమంటే ఏమిటో అనుకునేదాన్ని ఇవాళ తెలిసింది

రాజే ఆశ్చర్యంగా) ఏమిటి శారూ ఆ మాటలు ?

శార ఈ యింటిని ఏదో గ్రహం పట్టి పీడిస్తుందండి.

గిరి ఆ! రాత్రిళ్లు ఏవైనా చప్పుళ్లు వినిపిస్తాయా ?

శార ఇక రాత్రింబగళ్లు వినిపిస్తాయి.

రాజే . శారూ ! ఏమిటి నీ ధోరణి ?

శార భయపడకండి. భూతవైద్యుడి అవసరం ఏం లేదు.

రాజే (గిరితో) ఇందాక మా శారూకి నెర్వస్ బ్రేక్ డౌన్ వచ్చిందోయ్ గిరీ. వెంటనే తిప్పుకుం దనుకో లేకపోతే చాలా ప్రమాద మయేది

శార పాపం, వారు చాలా భయపడిపోయారు.

గిరి మా రాజేశ్వర్ వట్టి పిరికండి. వట్టి మేకపోతు గాంభీర్యం అంతే !

శార మగవాళ్లంతా అంతేనేమోలెండి.

గిరి నేను ఎక్సెప్షనండోయ్.

రాజే . అంటే నువ్వు బ్లాక్‌షీప్ అన్నమాట.

గిరి అదే మా శ్రీమతి అభిప్రాయం. సరే, మీరు మంచి మందు పుచ్చుకోవాలండి నెర్వస్‌నెస్ మహా డేంజరస్ డిసీజ్. ఆ చప్పుళ్లు అవి ఉన్నాయి. చూశారూ, అదంతా భ్రాంతి. నరాల బలహీనతవల్ల అలా భ్రమ కలుగుతుంది. అంతే.

రాజే . అంతే శారూ ! ఉట్టి భ్రమ. ఏదో కల్పించుకుని బాధపడటం ఆ వ్యాధి లక్షణం

శార వ్యాధి నిర్ణయ విద్య ఎప్పుడు నేర్చుకున్నారు ? నాకు చెప్పనేలేదే ?

రాజే : అబ్బో. మనవాడి దగ్గర రహస్యాల పుట్ట ఉందండోయ్.

శార : (విషాదంగా నవ్వి) ఇప్పుడిప్పుడే తెలుస్తోంది లెండి.

గిరి : హిప్నొటైజ్ చేస్తేగాని ఆ రహస్యాలన్నీ బయటికి రావండి.

శార · ఆ విద్య నేర్చుకుంటాలెండి, అయితే !

గిరి శుభస్య శీఘ్రం లేకపోతే రాజేశ్వర్‌ని పట్టపగ్గాలుండవు.

రాజే . గిరీ ! నీ నాలుక మహా పదునైంది సుమా. బలే ప్రమాదకరం.

శార . రెండు నాలుకల కంటె ప్రమాదకరం కాదులెండి.

గిరి బాగా చెప్పారు. మా శ్రీమతి నాలుక్కి రెండు వైపులా పదునైనా, రెండు నాలుకలు లేవని సంతోషిస్తున్నాను

రాజే : మా శారూ నాలుక్కి అసలు పదునే—లేదు పాపం !

గిరి ఉంటే నువ్విలా ఎందుకుంటావు ? మరి నేను వస్తా—హిప్నాటిజం మీద మంచి పుస్తకాలు పంపిస్తారెండి శారదాదేవిగారూ. రాజేశ్వర్ అంతు తేల్చేద్దాం.

శార (నవ్వి) థ్యాంక్స్.
(గిరి నిష్క్రమణ)

రాజే ఏమిటి శారూ, నీకేమైనా పిచ్చా ?

శార : ఏమో, మీరే చెప్పాలి. పిచ్చివాళ్లకు తాము పిచ్చివాళ్లమని తెలుస్తుందా ?

రాజే : నువ్వనవసరంగా అపోహలు పెంచుకుంటున్నావు

శార అయితే క్షమించండి.

రాజే నా పరిస్థితి కొంచెం గమనించు ఎంత మానసిక సంక్షోభంలో పడి కొట్టుకులాడుతున్నానో గ్రహించలేదా ? నలుగురితో నువ్వా నన్ను అపార్థం చేసుకొని మనసుని కోత పెడితే నేనేం కావాలి ? ఈ విపత్తు నించి ఎలా తప్పుకోవాలో తెలీక నేను అవస్థపడుతుంటే సలహా ఇవ్వటం మాని నువ్వా ఒక రాయి విసుర్తావా ?

శార క్షమించండి కాని, ప్రస్తుతం మీ ఉద్యోగానికేం భంగం రాదేమో.

రాజే ఎందుకు రాదు ఆ ఇన్‌స్పెక్టర్ పట్టి మొండి ఘటం తప్పక రిపోర్టు రాస్తాడు. నాకు వెంటనే సస్పెన్షన్ రావటం ఖాయం.

శార గడువు ఇస్తే శరభయ్య బాకీ చెల్లిస్తా డన్నారుగా.

రాజే గడువిచ్చే దాత ఏడీ ? ఎక్కడ ఉన్నాడు ?

శార టి. బి. లో.

రాజే : ఆ ! నీ అభిప్రాయం !

శార ఇన్‌స్పెక్టర్ !

రాజే ఇన్‌స్పెక్టరా ?

శార : (డ్రాయరులోంచి కవరు తీసి అతనికిస్తూ) ఈ కవరు హెడ్ ఆఫీసుకి పంపిస్తే గడువిస్తారట ఇన్‌స్పెక్టర్ మిమ్మల్ని ఈ ఉత్తరం పోస్టు చేయించమన్నాడు.

రాజే (అర్థంకాక) హెడ్ ఆఫీసు గడువివ్వట మేమిటి ? గడువిచ్చేది, నేను.

శార (ఆశ్చర్యంగా) ఆఁ ! అయితే మరి ఆ ఉత్తరం ?

రాజే తమాషాగా ఉంది. చూద్దాం ఏం రాశాడో ? (ఉత్తరం తీసి చదువుతుంటే ముఖ కవళికలు మారతాయి) ఇదేమిటో తెలుసా శారూ ?

శార ఏమిటి ?

రాజే : ఇన్‌స్పెక్టరు గోవిందరావు రాజీనామా.

శార : (ఆశ్చర్యంగా) రాజీనామా !

రాజే అవును ఇన్‌స్పెక్టర్ ఇక్కడికి ఎప్పుడు వచ్చాడు ?

శార మీరు వెళ్లిన కాసేపటికి

రాజే . బాకీ పరిష్కారానికి గడువు కావాలని అడిగావన్నమాట.

శార అవును అడగమన్నారుగా.

రాజే : ఊఁ. రాజీనామా ఎందుకు చేయవలసి వచ్చిందో ఆశ్చర్యంగా ఉంది.

శార ఆశ్చర్య మేముంది ? గడువు కావాలంటే అదొక్కటే మార్గం కాబోలు.

రాజే . ఇది త్యాగమేనా ?

శార కాదు. తల వెర్రి !

రాజే : తెడ్డుండగా చెయ్యి కాల్చుకుంటారా ?

శార . తెడ్డుకి వంటకం గుణం అబ్బుతుందా ?

రాజే ఇంత త్యాగానికి కారణం ?

శార . అతని మంచితనం.

రాజే : అంతేనా ?

శార : ముంజేతి కంకణానికి అద్దం కావాలా ?

రాజే ఓ, సరే. ఈ ఉత్తరాన్ని నన్ను పోస్టు చెయ్యమంటావా ?

శార అది మీ యిష్టం.

రాజే పోస్టు చెయ్యమని అతను చెప్పాడుగా !

శార అవసరమైతే—

రాజే అలా చెప్పటంలో అతని భావం ?

శార మీ ఆపదని వారించాలనే.

రాజే : తనే పోస్టు చేయకూడదా ?

శార : ఆలోచిస్తే ఆపనే చేసి ఉండేవాడేమో.

రాజే పిచ్చి శారూ ! ఈ ఉత్తరం నువ్వు చదువుతావనీ, రాజీనామాకి నువ్వు ఒప్పుకోవనీ అతని ఉద్దేశం. సహాయం చేసినట్టుండాలి ఎవ్వరికీ తెలియ కూడదు. కానీ, తనత్యాగం చిరస్మరణీయం కావాలి హుఁ.

శార పుణ్యానికి పోతే పాపం ఎదురైందట

రాజే కవరు అంటించకుండా ఇవ్వటంలో ఉద్దేశం ?

శార మీరు బి ఎల్ ప్యాసైనట్టు అతనికి తెలీదేమో.

రాజే ఎందుకు శారూ ఈ మద్దతు ? అతనిమీద గౌరవమా, లేక మనకార్యం సాధించాననే అహమా ?

శార . మీకుగానీ, నాకుగానీ అహమే ఉంటే, అతన్ని ఈ భిక్ష అడగటమే సంభవించేది కాదు.

రాజే భిక్ష !

శార భిక్ష కాదా ? ప్రాణం చచ్చిపోయింది ఎలా అడిగానో నాకే తెలియదు.

రాజే నువ్వలా కించపడతావంటే అడగమనేవాడినే కాదు. శారదా ! నా కష్టసుఖాల్లో, నా మానావమానాల్లో సంతోషంగా పాలు పంచుకుంటా వనుకున్నాను.

శార పొడవండి, సూదుల్లాంటి మాటలతో

రాజే అదికాదు శారూ. ఇష్టంలేని పని చెయ్యమని నిన్నెప్పుడైనా బలవంతం చేశానా ?

శార . మీ కర్తం కాదు. కాదు.

రాజే . క్షమించు శారూ. నేను లోతుగా ఆలోచించలేదు. మనస్సు సంక్షోభంలో ఉన్నప్పుడు ఏమో చేస్తాము అంతమాత్రానికే మనిషి పనికి మాలినవాడై పోతాడా ?

శార ఎందుకండీ, లేనిపోని మాటలు !

రాజే నీ వేదన అర్థమైంది శారూ కానీ, ఈ రాజీనామా నేను పోస్టు చేస్తాననే అనుకుంటున్నావా ?

శార ఇంక మీరు దాన్ని ఏమి చేసినా నా కనవసరం.

రాజే అంతేనా ?

శార అంతే.

శార నా వ్యవహారాల్లో నీకేమీ అభిరుచి లేదన్నమాట.

శార : మీ వ్యవహారా లేమిటో నాకు తెలియవు.

రాజే తెలుసుకోటానికి ఎప్పుడన్నా ప్రయత్నించావా ?

శార మీరు చెప్పనివిషయాల్లో నా కాసక్తి లేదు.

రాజే . గురువిందగింజ తన ఎరుపే గాని నలుపెరుగదట.

శార . (తీక్షణంగా) స్పష్టంగా చెప్పండి.

రాజే వేరే చెప్పట మెందుకు ?

శార (ఆవేశంతో) చెప్పక్కర్లేదు. మీ అభిప్రాయం తెలుసు ఛీ. ఇంత క్రూరంగా మాట్లాడగలరని నే నెప్పుడూ అనుకోలేదు. మీతో చెప్పకూడని విషయాలు నా కేమీ లేవని మీకు తెలియదా ? చెప్పండి, తెలియదా ?

రాజే శారూ, ఆవేశపడకు. ఒకర్ని ఒకరం నిందించుకోటంవల్ల ప్రయోజనంలేదు. ప్రశాంతంగా ఉన్న సంసారతటాకంలో గులకరాయి విసరటం, ఎవరు విసిరినా, అది అందర్నీ క్షోభపెడుతుంది.

శార . నిజం చెప్పారు. మీరు విసిరిన గులకరాళ్లకి లేగిన అలలు సమసిపోటానికి చాలాకాలం పట్టవచ్చు. కానీ, ఓర్పుతో వేచిఉంటాను.

రాజే ఏమిటి శారూ, నేను విసిరిన గులకరాళ్లు ?

శార . ఇన్‌స్పెక్టర్‌తో, నరసింహంతో ఏ మ్మల్ని గురించి నేను అన్న మాటల్ని తలుచుకుంటే సిగ్గు వేస్తోంది.

రాజే : ఓహ్ ! (నిట్టూర్పు).

శార : "వారిది సుతిమెత్తని మనసు వారిలాంటి మంచివారు నూటికి కోటికి ఒకరు." అని అంటున్నప్పుడు ఇన్‌స్పెక్టర్ కళ్లలోని అవహాస్యాన్ని చూసి ఫెడేలున చెంపదెబ్బ కొట్టాలనుకున్నాను. కొట్టానుకూడా. నయం

రాజే : (బాధగా) శారూ!

శార . "నరసింహంగారూ, మీ తప్పుని ఇతరులమీదికి పెట్టటం పెద్దమనిషి తరహా కాదు" అన్నప్పుడు నా గర్వాన్ని అతను లోలోపల ఎంత పరిహసించాడో ఇప్పుడు తలుచుకోటానికి భయం వేస్తుంది "పెద్దమనిషి తరహా కాదు అది ఘోరమైన ద్రోహం, విశ్వాస ఘాతుకత్వం" అని నరసింహం మీమీద నేరారోపణ చేస్తుంటే, ఆ అబద్ధానికి అతను భస్మమై పోవాలని శపించాను. (గాద్గదికంగా) నన్ను క్షమించండి. నేనే భస్మమై పోకూడదూ !

రాజే శారూ దీనంగా) నీ కెంతబాధ కలిగించాను !

శార . ఆ శరభయ్య అలా దౌర్జన్యంగా మాట్లాడుతుంటే మీరు చెప్పిన తగ్గిపోతే ఉక్రోషంతో నేనే అతన్ని చెప్పుతో కొట్టి గెంటాలనుకున్నాను. కాని....కాని....అలానే కసిగా, బలంగా గ౦డెలో బాకుల్లాంటి మాటలతో ఒక్కపోటు పొడిచాడు. అంత నా నే నెలా బతికున్నానో నా కాశ్చర్యంగానే ఉంది.

రాజే . శారూ నేను తప్పు చేశాను. నిజమే ఆ తప్పుని ఇంకొకరిమీదికి నెట్టటానికి కూడా ప్రయత్నించాను. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను.

శార . ఇంత జరిగినా ఇంకా క్షణం కిందటిదాకా నేను భ్రమలోనే ఉన్నాను. బయట పడిపోయినప్పుడు హుందాగా రాజీనామా పారేస్తా రనుకున్నాను కనీసం ఆ గొప్పతనాన్ని తలుచుకు నయినా గర్వించగల ననుకున్నాను. కానీ, మీ ఉద్యోగం నిలవటానికి న్స్పెక్టరు రాజీనామా ఇచ్చాడు.

రాజే ఓహో ఇప్పుడు తెలిసింది శారూ నాకంటె తన ఉదాత్తుడని చాటుకోటానికే, నీమీద కసి తీర్చుకోటానికే రాజీనామా యిచ్చాడు.

శార . మ్రొక్కబోతే గుడి విరిగి మీద పడిందట !

రాజే . (కోపంగా,అసూయతో) సరే నాకంటే అతనే యోగ్యుడు. నేను ఉద్యోగం ఎలాగైనా నిలబెట్టుకోవాలని తాపత్రయపడే అధముణ్ని. హు! శారూ నా భార్యా పిల్లలు కలకాలం సుఖపడాలనే ప్రబల వాంఛ నన్ను తాళ్లు పెట్టి కట్టి పడేసి నా అభిమానాన్ని కుటుంబక్షేమం ముందు బలి పెట్టిందని తెలుసుకోలేక పోయాను. ఈ బంధమే లేకపోతే, డబ్బుకోసం నానా అవస్థలు, ఈ మానసికసంక్షోభం, ఈ రంపపు కోత ఇవన్నీ నా దరి దాపులకి రాగలిగేవా ?

(మాధవ్ తిరిగి ప్రవేశం)

మాధ . శారదక్కా.

శార : మాధవ్.

మాధ నా నిజాయితీని బుజువు చేసుకోవటానికి వచ్చానక్కా.

శార . నీ నిజాయితీ నే నెప్పుడు శంకించలేదు మాధవ్

మాధ : నాకు తెలుసక్కా. రాజేశ్వర్ గారూ, క్షమించండి. ఈ మధ్య మీ డబ్బేమైనా పోయిందా?

శార . అవును మాధవ్ పోయింది.

మాధ వారిని చెప్పనివ్వక్కా.

రాజే : అవును పోయింది. ఆ సంగతి నీకెలా తెలుసు?

మాధ : ఎంత కాలం కిందట పోయింది?

రాజే ఏడీ, మొన్నేగా.

మాధ : ఎంత డబ్బు పోయిందండీ?

రాజే . వంద చిల్లరనుకుంటాను. ఏం శారూ? అంతేనా?

శార : అవునండీ

# గుండె జలుబును పోగొట్టుకోండి ఇదుగో

# అమృతాంజనము

శమనం కల్గించే పది రకాల ఔషధాలు చేరిన మందు కాబట్టి అమృతాంజన్ అమోఘమైన శ్రమ నివారిణి. అతి కొంచెమే చాలు కాబట్టి ఒకే సీసా నెలల తరబడి వస్తుంది మీకు 70 ఏళ్లు పేరుమోగిన నమ్మకమైన ఇంటి మందు. అమృతాంజన్ కండల నొప్పులకు, బెణుకు, తలనొప్పి, ఇతర నొప్పులు, జలుబులు బాధలకు కూడా అమోఘమైనది. వాతావరణంలో మార్పు సంసార తాపత్రయాలు నొప్పులు, జలుబులు ఇతర బాధలు కలిగిస్తాయి. అవసరానికి అందుబాటుగా అమృతాంజన్ సీసా ఒకటి ఇంట్లో ఉంచండి.

అమృతాంజన్ 10 రకాల
ఔషధాలు చేరిన మందు






అమృతాంజన్ క్రొత్తగా అట్ట పెట్టెలో వస్తూంది. సీసా 'అలూ' క్యాప్‌తో సీలు చేయబడి ఉంటుంది.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM 2381

మాధ ఎక్కడ పోయి ఉంటుందీ చెప్పగలరా?

రాజే బాగుంది. అది తెలిస్తే వెళ్ళి తెచ్చుకునే వాడిని.

మాధ : బహుశా—

రాజే బజార్లోనే

మాధ ఆఖరిసారి డబ్బు జేబులోంచి ఎప్పుడు తీసి ఉంటారు?

రాజే (విసుగ్గా) వివరాలన్నీ ఎందుకు? నీకు దొరికిందా?

మాధ దయచేసి చెప్పండి

రాజే జ్ఞాపకం లేదు హోటల్లో కాఫీ తాగి, చిల్లర డబ్బులు షర్టుజేబులో వేసుకున్నాను పర్స్ పాంట్ జేబులో పెట్టుకున్నాను. తర్వాత ఏం చేశానో తెలియదు రిక్షా ఎక్కాననుకుంటాను.

మాధ పగలా— రాత్రా?

రాజే రాత్రే

మాధ ఎన్ని గంటలకి?

రాజే సుమారు ఏడింటికి.

మాధ ఏడింటికి ఇంటికి వస్తుంటే ఎవరో కొట్టేసి ఉంటారా?

రాజే ఇంటికి అప్పుడే రాలేదు సినిమాకి వెళ్ళాను.

మాధ : సినిమాకు వెళ్ళారా?

రాజే అవును.

మాధ అబద్ధం

రాజే వాట్ డు యు మీన్?

మాధ డాక్టర్ ఊర్వశి ఇంటికి వెళ్ళారు.

రాజే : షటప్

మాధ నిజం చెప్పండి.

రాజే యు స్కౌండ్రల్ (కొట్టబోతాడు)

శార ఆగండి (ఆపుతుంది)

మాధ కొట్టండి అభ్యంతరము లేదు కానీ నిజం దాయకండి. హోటలునుంచి రిక్షాలో సరాసరి ఊర్వశి ఇంటికి వెళ్ళారు.

శార నీ కెలా తెలుసు? మాధవ్

మాధ : ఆ రిక్షావాలా—

శార నీకు స్నేహితుడా?

మాధ : దాచి ప్రయోజనం లేదు అక్కా. ఆ రిక్షా వాలా నేనే.

శార మాధవ్! (అతని జుట్టు నిమురుతుంది) ఇదా నీ కాయకష్టం.

రాజే నువ్వా!

శార 'నువ్వా' అంటున్నారు మీరు వెళ్ళింది నిజమే నన్నమాట.

రాజే (తల దించుకొని) ఊఁ

శార సినిమాకని అబద్ధ మాడారు!

మాధ అక్కా వారిని బండిలో పెట్టుకు ఆ ఇంట్లోకి వెళ్ళేటప్పుడు పర్స్ పాంట్ జేబులోంచి రిక్షాసీటుమీదికి పడిపోయింది గావును. ఆయన లోపలికి వెళ్ళిన తరువాత దిండు సర్దుతూ చూశాను పర్సూను ఆ యింటికి వెడితే ఆ ఇల్లు ఫలానా వారిదని తెలిసింది 'పర్స్' ఇవ్వటానికి బిడియపడ్డాను.

# ప్రతాపరుద్రీయ నాటకము

## శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

విద్యానాథ విరచితమైన ప్రతాపరుద్రీయయశోభూషణములోని నాటకోదాహరణమున కాకతీయుల నాటి చరిత్రమునకు సంబంధించిన ప్రధానాంశములు కొన్ని కానవచ్చుచున్నవి చరిత్రకారులు తెలిపెడి చరిత్రాంశములే యయినను, సమకాలిక శాసనాదివాక్యములను, సారస్వతమునుండి తెలియవచ్చెడి విషయములను ఆధారముగా దీసికొని, ఆ విషయములకు రచయిత యూహలను జోడించి, కూర్చిపెట్టినవియే యగనుగాని అన్య మెన్నడును కాజాలవు ప్రతాప చరిత్రము సిద్ధేశ్వర చరిత్రము సోమదేవ రాజీయము స్థానికచరిత్రము అనునవి తెలుగు భాషలో నుండిన కాకతీయులచరిత్రమునకు సంబంధించిన సారస్వత గ్రంథములు ఇవి యన్నియు 16 మొదలు 18 వ శతాబ్ది తుదివరకు గల కాలములో బయలుదేరినవి కావున ఈ గ్రంథములు నాలిగింటిలో వినికిడి మాటలే హెచ్చుగ వచ్చిచేరినవి వీనివలన దెలియవచ్చెడి చరిత్రాంశములకు, ఆ యా కాలములందుండెడి తామ్ర శిలా శాసనముల వలన దెలియవచ్చెడి చరిత్రాంశములకును అంతర మెంతయో కానవచ్చుచున్నది

ఈ విధముగనే ప్రతాపరుద్రుని కాలమునాడు ఓరుగల్లు పాలకుల పాలన విధానమును ప్రత్యక్షముగ జూచి, వారి వారి చరిత్రమును ప్రత్యక్షముగ నెరిగి, ఆనాటి సంప్రదాయములను బాగుగ దెలిసి రచించిన ప్రతాపరుద్రయశోభూషణమున విద్యానాథుడు కూర్చిపెట్టిన విషయములకును, 19, 20 శతాబ్దులలో చరిత్రకారు లూహించిన విషయములకును నెంతో యంతరము కాన్పించుచున్నది విద్యానాథుని వాక్యములకు, ఆతనికి సమకాలికుడుగా నుండవలసిన రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము లోని వాక్యములకు నొకదానితో నొకటికి విసంవాదము కానవచ్చుచున్నది రావిపాటి త్రిపురాంతకుని కాలము నిదమిత్థమని నిర్ణయించుట వీలుపడదని పెద్దలే తెలిపియున్నారు వినుకొండవల్లభామాత్యుడు, త్రిపురాంతకుని ప్రేమాభిరామమును తెలుగు బాస చేసితినని తాను రచించిన క్రీడాభిరామమున దెలిపియుండుటచేతను, క్రీడాభిరామములో దెలిపిన కాకతీయచరిత్రాంశము లీ నాటికిని ఓరుగల్లు కోటలోని శిథిలములలో గానవచ్చుచుండుటచేతను, ప్రేమాభిరామ ప్రతాపరుద్రయశోభూషణములు రెండును రెండవప్రతాపరుద్రుని పాలమునాడు బయలుదేరినవనియే చెప్పవచ్చును కాదనువా రుందురేని, ఆ కోటలోనికిబోయి పరికింపవలయునని నా మనవి ఈ రెండిటిటను విసంవాదముగల విషయములను గొన్నిటిని తెలిపెదను

ప్రతాపరుద్రుని కోరుగల్లు నగరములో పట్టాభిషేకము జరుగనైయున్నపుడు ముందుగ ప్రతీహారి యొకడు వచ్చి బంగారు బెత్తముచేతబట్టి సంకులముగా నుండిన జనమును తొలగించుచు నిట్లనును

రే! రే! నరేశ్వరాః!

దన్తివ్యూహ ముపాయనీకృత మముం కుర్వన్తు పురా, బహి
ర్యస్యో ద్యద్బృంహితై ర్ఘటికా ఘంటా ధ్వనిః శ్రూయతే,
దూరే చాస్తు రథాశ్వమేతదఖిలం యస్యాతి సమ్మర్దతో
నిష్క్రామ త్ప్రవిశచ్చ నాగరకులం నస్వైర మా చేష్టతే
ప్రతా. నాటకము. 4 అం 1 శ్లో.

రాజులారా! కానుకలుగా గొని తెచ్చిన ఈ ఏనుగుల గుంపును పట్టణమునకు బయట బెట్టుడు. ఈ గజములు గట్టిగా ఘీంకరించుచుండుటచే గడియారమునుండి వినవచ్చెడి ఘంటాధ్వని వినవచ్చుటలేదు అనగా ప్రొద్దు గడియలను దెలుపుటకై ప్రయోగించిన గంటల చప్పుడు వినబడుట లేదనుట మఱియు మీరు గొనివచ్చిన రథములు, గుఱ్ఱములు అన్నియు దూరముగ నుంచవలెను వీని తొడ త్రొక్కిడి వలన వచ్చిపోయెడి పురజనులు స్వేచ్ఛగ తిరుగలేకున్నారు—అని ఈ శ్లోకమునకు భావము దీనినిబట్టి యా నాడోరుగల్లు కోటలో గడియల ప్రొద్దును దెలుపుటకై ఘంటానాదము చేయు గడియారముండెడిదని తెలియవచ్చుచున్నది. ఇంతేగాక రథములు గుఱ్ఱములు మున్నగునవి సంకులముగా తిరుగుచుండుటచే రాచబాటలో జనులు సంచరించుటకు తొడ త్రొక్కిడిగా నుండెడిదనియు తెలియుచున్నది ఈ విషయములను క్రీడాభిరామములోని ఈ క్రింది పద్యములవిషయములు విసంవదించుచున్నవి

ఉడు వీధిన్ శిఖరావలంబియగు సంధ్యోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్
క్రీడా 155 ప

ఓరుగల్లు కోటలోని గడియారములో మధ్యాహ్నమగుసరికి పదునాఱు గంటల మ్రోతలు వినవచ్చె ననుటచే, ఆ ఘటికాగారములో గడియ కొక్కొక్కటి చొప్పున ఘంటాధ్వని ప్రయోగింపబడుచుండెడిదని తెలియవచ్చుచున్నది. మఱియు ఓరుగల్లు పట్టణమునందున్న రాతికోటలోనికి మంచెన శర్మ ప్రవేశమిట్లు చిత్రింపబడియున్నది

సప్త పాతాళ విష్టప మహాప్రస్థాన
ఘంటాపథంబైన గనప పరిఖ
తారకా మండల స్తబకావతంసమై
కనుచూపు గొనిన ప్రాకార రేఖ
పుంజీభవించిన భువన గోళము భంగి
సంకులాంగణమైన వంక దార
మెఱుగు టెక్కెలతోడి మేరు శైలము బోలు
పెనుపైడి తలుపుల పెద్ద గవని
చూచె జేరె ప్రవేశించె జొచ్చె వీథి
సఖుడు దానును రథఘోట శకట కరటి
యూథ సంబాధముల కొయ్య నోసరిలుచు
మందగతి నోరుగల్లు గోవిందశర్మ
క్రీడా 112 ప.

ప్రవేశించి టిట్టిభ నామధేయుండైన కోమటిసెట్టిగారితో నాతడిట్లనియె.

రాజమార్గంబు వారణఘటా ఘోటక
శకటికా భట కోటి సంకులంబు
ధరణిధరప్రస్తరశేణి బహుళంబు
గావున మనమందుఁ బోవవలదు . . .

క్రీడా 113, 114

ఈ వర్ణనమునందలి విషయముల గుర్తులు శిథిలావశిష్టమైన ఓరుగల్లు రాతికోటకు వెనుక ముందులలోఁ గొన్ని కానవచ్చుచున్నవి కోట చుట్టును కందకము, చుట్టు తిరిగి వచ్చిన నాలుగు క్రోసుల మేరగల యెత్తయిన ప్రాకారము ప్రవేశ ద్వార ప్రదేశములో మలుపులు, పెద్ద పెద్ద తలుపులు గల ద్వారములు ఆనాటి విభవము నీనాఁడు కూడ స్మరింపఁజేయునవిగనే నిలిచియున్నవి మరి యా నాఁడా రాజమార్గము గుఱ్ఱపు దళములు ఏనుగుల గుంపులు రథములు తిరుగుచుండు నపు డెంత సంకులముగా నుండెడిదో? ఆ విషయమును మన మీ నాఁ డూహించుట శక్యముగాదు మట్టికోట రాతి కోటలలోని ద్వార ప్రదేశముల ఎత్తు చూచి యూహ చేయగలిగిన విద్యానాథ త్రిపురాంతకు లిరువురు సత్యమునే తెలిపినారని యనిపింపక మానదు

క్రీ. శ 1423 ప్రాంతమున ప్రతాపరుద్ర సామ్రాజ్యము విచ్ఛిన్నమై ఓరుగల్లుకోట ధ్వంసమై పోయిన తరువాత, నడుమ చితాబఖాను శాసనములోఁ గాక, ఆ కోటకు సంబంధించిన విషయము లేవి వెలికి వచ్చినను అవన్నియు పైనుండి యూహించి గతానుగతికముగా జనులు చెప్పుకొను మాటలేగాని, ఆనాఁటి శాసనాద్యాధారములకుఁగాని, ప్రతాపరుద్రయశోభూషణ ప్రేమాభిరామముల విషయములకుఁగాని సరిపడునవిగాఁ గానరావు. ఆంధ్రప్రదేశ్ అవతరించునంతవరకు మహమ్మదీయులతో సంబంధములేని భారతీయున కెవ్వనికి నా కోటలో ప్రవేశించుటకుఁగాని, ఆ శిథిలములం దవశిష్టమైన చారిత్రక విషయములను స్వేచ్ఛగ పరికించుటకుఁగాని యవకాశమే లభింపలేదను విషయము ఓరుగల్లుకైఫియతులోని తుది వాక్యములు చెప్పుచునే యున్నవి ప్రేమాభిరామమును తెనుఁగు చేసిన వల్లభామాత్యుఁ డా కోటలోనికిఁ బ్రవేశింపకున్నను, సంస్కృత రూపకమును రచించిన త్రిపురాంతకుఁ డా కోటలోని విషయములను దా నెఱుఁగకుండ రచియించె ననుట మాత్రము సరిపడనిదియే యగును. ఈ విషయము పొసగదను వారుందురేని, వారొక మా రా కోటలోనికిఁ బోయి శిథిలావశిష్టమైన శిలాఖండములను పరికించి, విషయములను సమన్వయించుకొని కాదనుట బావ్యమని నా మనవి

ప్రతాపరుద్రీయనాటకములో ఆ ప్రతీహారి మఱికొన్ని మాటలనును "అధి కృతాః! కిమి దానీ మార భధ్వే? కిముపక్రాన్తః స్వయంభూదేవ సమారాధన విధిః? కచ్చి ద్దత్తాః పురదేవతాభ్యోబలయః? . భూపాలాః యథావకాశ మాధ్వమ్ సజ్జీ కురుధ్వ ముపాయన జాతమ్ నవ్వధానమ్మర్షం సహతేమమ వేత్ర యష్టిః "

ప్రభుకార్యనియుక్తులారా! మీరిప్పుడే పనిప్రారంభించుచున్నారు? స్వయంభూదేవ సమారాధన క్రమము ముగిసెనా? పట్టణదేవతలకు బలులిచ్చుట జరిగెనా? రాజులారా! మీ యవకాశానుసారముగా నుండుఁడు. కానుకలు సిద్ధము చేసికొని యుండుఁడు. నా చేతిబెత్తము వట్టి యలజడిని సహింపదని—యీ వాక్యముల భావము. కాకతీయప్రభువులలో గణపతి దేవునకు రుద్రమకు ప్రతాపరుద్రునకు గూడ స్వయంభూదేవుడు కుల దేవత కావున వారి కాలమునం దోరుగల్లు కోటలో జరిగెడి యుత్సవము లన్నియు స్వయంభూదేవ సమారాధన పూర్వకముగనే జరుగుచుండెడివను విషయమును ప్రతాపరుద్రీయ నాటకముద్ఘోషించుచున్నది. స్వయంభూదేవుఁడు రుద్రమదేవికి స్వప్నమున గానవచ్చి, ప్రతాప రుద్రుని యువరాజుగా పట్టాభిషేకము చేయుమని యాజ్ఞాపింపగా జరుగ మొదలుపెట్టిన దీ ఈపట్టాభిషేక మహోత్సవము. ఇక నా పట్టణాధిష్ఠానదేవతలు, భైరవుడు, వీరభద్రుఁడు, మైలార దేవుడు, కాకతి ఏక వీర మున్నగు క్రీడాభిరామమునందు ఉదాహృతులైన దేవతా మూర్తులు కావలయును. క్రీడాభిరామములోని యీ క్రింది పద్యములో నానాటి గ్రామదేవతల యుత్సవ మిట్లు వర్ణింపబడినది.

అదిగో యెత్తిన వారు పట్టణము మధ్యక్షోణి సింహధ్వజం
బదిగో కట్టిన వారు నింబదళమాల్యాతోరణవ్రాతముల్
విదితంబయ్యె మహోత్సవంబు నెఱయన్ వీథీ విటంకంబులం
దదిగో నిల్చినవారు పూర్ణకలశం బాబాల వృద్ధాంగనల్.

క్రీడా 146

పురదేవతల కుత్సవములు జరుగు నపుడు పురమధ్యమున సింహ ధ్వజము నెత్తుట, ఆ దేవతలు పార్వతీ దేవి కపరమూర్తులని నిరూపించుటకే. వేప కొమ్మలతోఁ దోరణములు వ్రేలాడ గట్టుట, వీధుల కొనలందు పిల్లలు మొదలుగ వృద్ధులవరకు స్త్రీలు జలముతో నిండిన కలశములు పట్టి అమ్మవారికి వార పోయుటకు నిలిచి యుండుట యానాఁడు గలదని యీ పద్యము చెప్పుచున్నది. ఈనాఁటికిని ఆయా పురదేవతల యుత్సవములలో నీ విధానము లన్నియు గాన వచ్చుచునే యున్నవి. ఓరుగల్లు కోటలో శిథిలములై చెదరిపడియున్న శిలా ఖండములలో సింహముల వరుసలు, ఏనుగులపై సింహములు, సింహముల నోళ్ళలో మరల నేనుగులు చిత్రించిన విలక్షణమైన శిల్పములు గాన వచ్చుచున్నవి అవి యేయే దేవాలయములకు సంబంధించినవో? ఇంకను నాట్యభంగిమలున్న స్త్రీప్రతిమలు గల శిలాఖండములు రాతికోట తూర్పు ద్వారము మొదలు ఉత్తరద్వారము వఱకు ప్రాకారపు గోడమీదఁ బడవేసి యున్నవి అవన్నియు నేయే తావులనుండి పెకలింపఁ బడి యా తావునకుఁ జేరినవో? అవి యేయే దేవళములకు చెందినవో? చూచి గుర్తించెడివా రుండిన బాగుండునని నా మనవి.

మఱియు నిట్టి పురదేవతల యుత్సవములలో, ఆ సాదులు మద్యములు త్రావి, ఘటములో గరగలో తలపైఁ దాల్చి, తప్పెట్లు తాళములు మ్రోగుచుండగా నృత్యము సాగింతురు. ఈ పరిపాటి నాఁడ ఓరుగంటిలో నా నాఁడుగలదని క్రీడాభిరామమునం దీ క్రింది విధముగా నభివర్ణితమైనది

అకలంక స్థితి సీధుపానరతులై యా సాదులుప్పొంగి యో
యకలో యమ్మకలో యమక్కలో యదీ యట్టట్టకో యంచుఁ బా
యక తప్పెట్లును దక్కె తాళములు నింపై సొంపు రంజిల్లఁగాఁ
జుక జుం జుంజుక జుంజు జుమ్మమనుచు సాగుం గడున్వాద్యముల్

ఈ విధమైన వాద్యముల మ్రోఁతతో నా సాదులుప్పొంగి నృత్యము చేయుట, తెలుగునాటనీనాటికిని గ్రామ దేవతల యుత్సవములలోఁ దరుచు గాన వచ్చుచునే యున్నది మరియు నిట్టిపురాధిష్ఠాన దేవతలకు వివిధములయిన బలుల నిచ్చుట కూడఁ బలు తావు లందుఁ గాన వచ్చుచునే యున్నది.

ప్రతాపరుద్రీయనాటకోదాహరణమునందే, పట్టాభిషేక మహోత్సవము జరిగిన తరువాత ప్రతాపరుద్రుడాస్థానిలో మంత్రుల మాటలమీద సింహాసనమునం దుపవిష్టుడై, తన్ను సేవింపవచ్చిన వారి కందఱకు దర్శనమిచ్చి, వారి మెప్పుల నందుకొని, సముచిత సంభాషణము నెఱపి నట్టులును, ఈ క్రమములో ప్రతీహారి వచనానుసారముగ పనులు సాగినట్లు తెలియుచున్నది ప్రతాప రుద్ర మహారాజు సింహాసనోపవిష్టుడైన తరువాత ప్రతీహారి, రాజుల పేరులు చెప్పి వారిచే గానుకలర్పింపజేసెను ఆ వెనుక పురోహితులు రాజునకు స్వస్తి వచనములు పలుకుదురు పిమ్మట నాయా వర్ణవృద్ధులు ప్రవేశించి యాశీర్వదించెదరు. ఆ తరువాత వ్రక్కృతులు దండనాథులు సామంత రాజులు ప్రవేశించి వరుసగా స్వస్తివచనములు పలుకుదురు. అనంతరము మరలఁ బురోహితులు ఆలయాస్థాన విద్వాంసులు రాజునకు వివిధ దేవతానుగ్రహము లభించుఁగాక యని యాశీర్వదించెదరు. ఈ క్రమ మంతయు మానసోల్లాస నిరూపిత విషయమునకు సరిపడుచున్నది.

పశ్చిమచాళుక్య ప్రభువైన కుమార సోమేశ్వరుడు రచించిన మానసోల్లాసములో ఆస్థానీభోగమను నధ్యాయము 105 శ్లోకములు గలది. ఒక ప్రభువు తనపాలనము నందున్న జనులందఱకుఁ బ్రీతిని గలిగించుటకై ఆస్థానీభోగము నెట్లనుభవింప వలెనో? యీ విషయము నీయధ్యాయమున వివరించి యున్నాడు. ఆస్థాన మండపమును రాజు సింహాసనోపవిష్టుడై యెవ్వరిచే నే విధముగ గొలువ

బడ వలెనో? యెవ్వరి నే విధముగ గౌరవింప వలెనో? యా విషయములను బ్రపంచించి యున్నాడు

అధునాస్థాన భోగోఽయం కధ్యతే జనవల్లభః
చామరై ర్వ్యజనై రేవం వీజ్యమానో మహీపతిః
ఆస్థానమండపన్యస్త వరసింహాసన స్థితః
సమాహూయ ప్రతీహారం సర్వ్యాహ్వానం సమాదిశేత్

ఆస్థానగతులైన జనులందరకు తుష్టినిచ్చెడి యాస్థానభోగమును గూర్చి చెప్పుచున్నాము. భూపతి వింజామరలతోను విసన కర్రలతోను వీచ బడుచు, ఆస్థాన మండపము నందుంచిన సింహాసనమునగూర్చుండి, ప్రతిహారునిచే నంద ఱను బిలిపింపవలెను. ఇట్లుపక్రమించి, ఆస్థానిలో క్రమముగా నెవరెవరిని బ్రవేశ పెట్టవలెనో! వారినేయే స్థానములందు గూర్చుండ బెట్టవలెనో? వారినేయే విధముగ సంభావింపవలెనో? తెలిపియున్నాడు.

1 ముందుగ నంతః పుర స్త్రీలు ప్రవేశింపవలెనని తెలుపుచు, వారి యాభరణములు వస్త్రమాల్యాదికము, వారి యవయవవిన్యాసములు, వారు వచ్చి ఆస్థానమున బ్రవేశింప వలసిన పద్ధతి, వారెక్కి రావలసిన యాన సాధనములు వారు చేసెడి చేష్టలు, వివిధ దేశములకు సంబంధించిన స్త్రీల రూప గుణాదికములు నిరూపితమైనవి అట్టి వనితలు జనుల దృష్టుల నాకర్షించుచు వచ్చి, నగుమొగములతో రాజున కిరు ప్రక్కలం జేరి యాసనములందు గూర్చుండ వలెను

2. తరువాత రాజ కుమారులు వచ్చి, రాజునకు నమస్కరించి యుచితాసనములందు దగ్గఱగాం గూర్చుండ వలెను.

3 పిమ్మట రాజ పురోహితుడు శుభ్రమైన వస్త్రములు రత్నకుండలములు ధరించి రాజ కుమారులకు సమీపమునం గూర్చుండ వలెను.

4 ఆ వెనుక — అమాత్యులు, మంత్రులు, సచివులు నిరువైపులమండలాధీశ్వరులు, సామంత రాజులు వారి మంత్రులు రాజాజ్ఞతో నాసనములపై గూర్చుండ వలెను

5. క్రమముగా — ధర్మార్థ కామ పురుషార్థాధి కారులు, సైన్యములు, దుర్గములు, వస్త్రములు, భూషణములు, నాణెములు, రంగులు, తూకములు, ముద్రలు, ధరలు, చారులు, దుష్టశిక్షణము, రేవులు, నావలు, త్రోవలు, ద్వారములు, ద్వీపములు, మోతలు, ద్వారపాలకులు, మల్లులు, చతురంగ బలములు, యుద్ధములు, దేవాలయములు, శాస్త్రములు, దానము, దండము, గజములు, అశ్వములు, రథములు, ప్రాణములు, ఆయుధములు, ధనస్సులు, మృగములు, స్నానములు, వంటకములు, నీళ్ళు, దీపములు, నూనెలు, గోవులు, నివాసములు, పాలు, విద్యలు, నృత్య గీత వాద్యములు, చిత్తరువులు, గనులు, సుంకములు, రాళ్ళు, ముద్రలు, — మున్నగు విభాగముల మీద నధికారము గల వారు, పచ్చనిరంగు గల, పొడుగు చేతుల అంగీలు ధరించి, తలపాగలు చుట్టుకొని కనకాభరణములు దాల్చి, భక్తినమ్రులై రాజ సమీపమునం గూర్చుండ వలెను

ఇంకను కవులు దైవజ్ఞులు చక్కగ మాట్లాడువారు చదువు వారు, కథలు చెప్పు వారు, భట్టులు, సూతులు, మాగధులు, వందులు వాగ్గేయ కారులు, గాయకులు, వేణు వీణావాదకులు, వాద్యకారులు, నర్తకులు, నటులు, వైతాళికులు, చాటువులను పలుకు వారు—ఇత్యాదిగా వివిధ కళావిభాగములకు జెందిన వారు వచ్చి రాజునకు విజయమును బలుకుచుండవలెను ఈ వచ్చిన వారిలో దేశాధిపతులను పతీహారి పేరు పేరున బిలువగా వారు వచ్చి రాజునకు సాష్టాంగ నమస్కారము చేయ వలెను

కాంశ్చి త్ప్రసన్నయా దృష్ట్యా కాంశ్చిన్మధుర భాషితైః
కాంశ్చి త్ప్రభూత దానేన కాంశ్చిన్మానేన హర్షయేత్.

ఆస్థానికి వచ్చిన వారిలోం గొందఱను ప్రసన్నమయిన చూపుతో, కొందఱను తీయని మాటలతో, కొందఱకు తగిన వస్త్రాభరణాది దానములతో కొంద ఱను గౌరవము తోను రాజు సంతోషపెట్టవలెను.

ఈ విధమైన క్రమమును పాటించియే ప్రతాపరుద్రమహారాజు ఆస్థానమండపమున సింహాసనోపవిష్టుడైనపుడు మంత్రి సామంత పురోహిత వర్ణవృద్ధామాత్యాదులు ప్రవేశించి, ప్రతాపరుద్రునకు విజయమును బలికిన వెనుక రాజు వారికి యథార్హముగ బరమేశ్వర ప్రీతిగా దానములు గావించి నట్లులు నాటకము లోని యీ క్రింది వాక్యములు తార్కాణించు చున్నవి

రాజా: ప్రసీదతు భగవాన్ స్వయం భూదేవః ఇతి పురోహితా వర్జిత కనకకలశ సలిల ధారా పురస్సరం సకలభోగసమగ్రాన్ గ్రామాన్ విప్రసాత్కరోతి. అన్యేషామపి నగరవాసినాం యథా ప్రధానం సంభావనా మాచరితి ''

భగవంతుడైన స్వయం భూ దేవుడనుగ్రహించు గాక యని, పురోహితులు బంగారు కలశములనుండి జలధారలు వదులు చుండ, సకల భోగ సమన్వితములైన గ్రామములను రాజు విప్రులకు దానము చేయును మిగిలిన నగర వాసులకుఁ గూడ తగు విదమున సత్కారము గావించును— అని యీ వాక్యములభావము

పశ్చిమ చాళుక్య ప్రభువులనుండి వచ్చిన సామంత మాండలి కాధి కారము క్రమముగా పెరిగి త్రిలింగాధిపత్యమును వహించిననాఁడు కూడ కుమార సోమేశ్వర విబద్ధమైన సరణి కాకతీయులచే ననుసరింప బడెనని పైని దెలిపిన విషయమును బట్టి తెలియ వచ్చుచున్నది. ఈ క్రింది విద్యానాథుని వాక్యములు, వానికి కుమార స్వామి సోమయాజి చేసిన వివరణము దీనికి సుపోద్బలకములై యున్నవి.

మంత్రిణః సాంప్రతం యథార్హ మర్హణయా మాననీయాః
పౌరాణాం శ్రేణయః.
రాజా సానన్దాదార్యం —
జాగర్తు రాజ శబ్దోఽయం మమ్యే వాజ్ఞాఫలైకభూః
రాజ్యోపభోగవిభవః సర్వ సాధారణో హి నః

ప్రభుశక్తి ఫలమగు అనుగ్రహాదికమునకు ప్రధాన స్థానమైన యీ రాజ శబ్దమే నాకుండుఁ గాక రాజ్యభోగవిభవము మన కందఱకు సమానమే యగుఁ గాక యని యీ శ్లోక భావము ఆజ్ఞాశ్రయుడు ప్రభువే యగునని మాన సోల్లాస విషయముతో వ్యాఖ్యాత యిట్లు సమర్థించి యున్నాడు.

తదుక్తం మానసోల్లాసే—
అనుగ్రహే నిగ్రహేచ దానేచాదానకర్మణి
ప్రవృత్తౌ చ నివృత్తౌ చ గ్రహణే మోక్షణే తథా
స్వయం సమర్థో యస్సోఽయం రాజా సాజ్ఞా నిరర్థకా
ఆజ్ఞామాత్రమేవ మేవ భూయాత్ అనుభవః పునరస్మాకం సర్వేషా మితి వాక్యార్థః

నిగ్రహానుగ్రహములకు, ఇచ్చి పుచ్చుకొనుటకు, పని చేయుటకు, మానుటకు, పట్టు కొనుటకు, వదలుటకు, స్వయముగ సమర్థుడైన వాఁడే రాజు. అతని యాజ్ఞయే నిరర్థకమై వెలయును అట్టి ఆజ్ఞామాత్రమే నాకుండు గాక. ఇట్టి ప్రభుశక్తి వలనఁ గలిగెడి రాజ్య భోగానుభవము ప్రకృతు లందరకు పౌరు లందరకు సమానముగ లభించు గాక యని యీ వాక్యముల భావము. దీనిని బట్టి యానాఁడు శ్రుతి స్మృతి సమ్మతమైన రాజకీయ పరిపాటి యెట్లు పాటింపబడినదో తెలియుచున్నది.

మరియొక విషయమునఁ గూడ నీ మానసోల్లాసవిషయమెట్లు సమన్వితమగునో పరికింతము. ఈ నాటకోదాహరణ ప్రారంభమునందే రుద్రమదేవికి కుల దేవతయైన స్వయంభూదేవుడు స్వప్నమునందుఁ గర్తవ్యోపదేశమును జేసెనని తెలిపి నపుడు, పురోహితు లామె పలుకుల నభినందించుచు నీ క్రింధివిధముగఁ దెలిపెదరు.

స్వైవోత్థూచేతి నిర్దిష్టా సోతూ చేతి ప్రథా మగాత్.
తవ మాతా శివా సాక్షా ద్దేవో గణపతిః పితా

గణపతి దేవునకు బుత్ర సంతానము లేనికారణమున రుద్రమక 'రుద్రు' డను నామకరణము చేసి పుత్రరూపమున వ్యవహరించినట్లు నీ శ్లోకము తరువాత వాక్యములు తెలుపుచున్నవి. అందుచే నీ నాటకమున రుద్రమ దేవిని 'మహారాజ' యని సంబోధించుట జరిగినది. మహారాజా! నీ తల్లి ఉమ అనియు సోమ అనియు నిర్దేశింపబడినది అనగా తొలుత ఉమ్మక్క యనియు తరువాత సోమాంబ యనియు వ్యవహారము కలదనుట అట్టి నీ తల్లి సాక్షాత్తు పార్వతియే నీ తండ్రి గణపతి దేవుడు ప్రథమ గణాధిపతియగు పరమ శివుడే— అని యీ శ్లోకభావము. కావుననే రుద్రమదేవి తలిదండ్రులకు పార్వతీ పరమేశ్వరులకు నభేదమని వ్యాఖ్యాత తెలిపి యున్నాడు

ఈ శ్లోకమునకు ముందున్న శ్లోకములో రుద్రమదేవి పలుకులలో 'అస్మాకం నిజదోః ప్రసూతి మధునా ధన్యా మజో మన్యతే' అనుటనుబట్టి రుద్రమదేవి తల్లికూడ క్షత్రియవంశమునకు జెందినదియేయై యుండ వలెను కాని యామె యే కులమునుండి వచ్చినదో యిదమిత్థమని తెలియ వచ్చుటలేదు ఆమె క్షత్రియవంశమునకుఁ జెందినదియే కావలె ననుట నిశ్చయము కుమార సోమేశ్వరుఁడు మానసోల్లాసము యోషిద్భోగప్రకరణములో నీ క్రింది విధముగఁ దెలిపియున్నాఁడు.

క్షత్రియాన్వయ సంభూతాశీలాచార గుణాన్వితా
సురూపా చానుకూలాచ తరుణీ శుభలక్షణా
మృగీవా పద్మినీ వాపి చిత్రిణీ వడవాథవా
దేవాద్యంశక సంభూతా రాజ్ఞీ కార్యామహీభుజా
వైశ్యశూద్ర కులోత్పన్నా రూప యౌవన సంయుతాః
గీత నృత్త కలాదక్షా శ్చిత్తజ్ఞాః ప్రేమ నిర్భరాః
అవరోధ వధూః కాన్తాః కుర్యా ద్భోగాయ భూపతిః.

క్షత్రియ వంశమందుఁ బుట్టి, శీలము, ఆచారము, మంచిగుణములు గలిగి, చక్కని యాకారముగలదై, అనుకూలవతియై, శుభలక్షణములు గల తరుణిని మృగిమొదలైన మంచి జాతికిఁజెందిన దానిని, దేవాద్యుత్తమాంశ వలన జన్మించిన దానిని, భూపాలకుఁడు పట్టపురాణినిగాఁ జేయవలెను ఈ రెండు శ్లోకములలోని విశేషణములు విశేష్యము ఏకవచనాంతములు గావున పట్టపు రాణి యగు తరుణి యొక్కతయే యుండు ననుట నిశ్చయము ఇతర కులములందు జన్మించి రూప యౌవనములు గలవారై, గీత నృత్త కళలలో సమర్థులై, మనసు నెఱిగినవారై, ప్రేమనిర్భరలైన తరుణులను భూపతి భోగానుభవమునకై అంతఃపుర కాంతలనుగాఁ జేయవలయునను నది స్మృతి సమ్మతమైన నిబంధనము 'కృతాభిషేకా మహిషీ భోగిన్యోన్యాః కులస్త్రియః' అనెడి అమరకోశ నిర్వచనమును బట్టి కూడ నీ విషయము సమర్థిత మగుచున్నది విధివిహితముగఁ బెండ్లాడిన స్వసమానకులస్త్రీ యందే మహీపతి సంతానమును గనవలె ననియు, అట్టి ధార్మికసంతానమునకే, తరువాత రాజ్యము సంక్రమించునను నది కూడ నానాటి స్మృతిసమ్మతమైన నిబంధనమే కాకతిగణపతిదేవుని తరువాత రుద్రమదేవియే కాకతీయ సామ్రాజ్యాధికారిణి యగుటచే, పట్టమహిషికి జన్మించిన ప్రథమసంతానము రుద్రమదేవియే యగుట, ఆమె తల్లి సోమాంబ సమాన క్షత్రియ వంశ సంజాత యగుటయు నిశ్చితమే ఆమె యే వంశమునకుఁ జెందిన దగునో యించెము పరికించెదము

కాకతీయసామ్రాజ్యము మొదటిరుద్రుని పాలనమునాఁడే త్రిలింగ సామ్రాజ్యముగ రూపొందినది త్రిలింగ సామ్రాజ్యమునకు సన్నిహితముగా నుండినది యాదవవంశమువారిచేఁ బాలింపఁబడుచున్న సేవణ దేశము. దేవగిరి వారికి రాజధాని త్రిలింగసామ్రాజ్యమును స్థాపించిన వెనుక రుద్రుఁడు యాదవులమీఁదికి దండెత్తిపోఁగా, జైత్రపాలునిచే నాతఁడు రణరంగమున నిహతుఁ డయ్యెనని, హేమాద్రి రచించిన 'చతుర్వర్గ చింతామణి' యను ధర్మ శాస్త్ర నిబంధనగ్రంథమున వ్రతఖండప్రారంభములోని యీ క్రింది శ్లోకములవలనఁ దెలియవచ్చుచున్నది. హేమాద్రి యాదవరాజులకు మంత్రిగా నుండి యీగ్రంథమును రచించుచు నా రాజప్రశస్తిని విపులముగఁ దెలిపి యున్నాఁడు.

దీక్షిత్వా రణరఙ్గ దేవయజనే ప్రోద్యన్త శస్త్ర స్రువః
శ్రేణీభి ర్గతిపతీ న్హుతవతా యేన ప్రతాపానలే
త్రైలిఙ్గాధిపతేః పశోర్విశసనం రౌద్రస్య రుద్రాకృతేః
కృత్వా పూరుషమేధయజ్ఞ విధినా లబ్ధ స్త్రిలోకీ జయః.

జైత్రపాలుఁడు (జైతుగి) అను యాదవభూపతి, రణరంగవిహార మను యజ్ఞమునందు దీక్షవహించి, శస్త్రమను స్రువము (హోమ సాధనము) నెత్తి, ప్రతాపమను అగ్నిలో భూపతులను హోమముచేయుచు, రౌద్రమైన యాకారము గల రుద్రుఁడను త్రిలింగ దేశాధిపతిని, పురుషమేధ విధానమున విశసనము (వధ) చేసి త్రిలోక విజయమును సంపాదించెనని యీశ్లోక భావము. దీనినిబట్టి జైత్రపాలునితో యుద్ధము చేయుచు రుద్రుఁడు వీరస్వర్గము నొందెనని తెలియవచ్చుచున్నది

రుద్రుని తరువాత నాతని సోదరుఁడైన మహాదేవుఁడు కూడ యాదవులతోడి గజ యుద్ధములో వీరస్వర్గము నలంకరించినట్లును, మహాదేవ సుతుఁడైన గణపతి వారితోఁ దలపడి, యుద్ధములోఁ బట్టుబడి విడువఁ బడినట్లును, ఈ క్రింది శాసన శ్లోకముల వలన దెలియ వచ్చుచున్నది

జాతో మాధవభూపతిర్గుణగిరి స్తస్మాన్మహీవల్లభాత్
యస్సప్త్యసుమహాహవే గజవధూ కుమ్భద్వయు స్యోపరి,
ప్రఖ్యాతాప్సరసస్తనద్వయతటే ప్రాబోధి యోధాగ్రణీ
లోకే ఖ్యాతవిశాలనిర్మలయశా వీరశ్రియా మాశ్రయః1,

గణపతిదేవుని కుమార్తె కోటగణాంబ నెలకొల్పిన యెనమదల శాసనములోని దీ శ్లోకము. ప్రోలునివలన గుణగిరి యైన ఉమాధవభూపతి— అనఁగా మహాదేవ భూపతి జన్మించెను. యోధాగ్రణియైన ఆతఁడు సంకుల యుద్ధములో ఆఁడేనుఁగు కుంభస్థలముల రెండింటి మీఁద నిద్రించి, ప్రసిద్ధమైన అప్సరస స్తనద్వయప్రదేశమునందు మేల్కొని లోకములో మహావీరుఁ డను యశస్సు నార్జించుకొని విఖ్యాతుఁ డయ్యెనని ఈశ్లోక భావము

అనగా మహాదేవ మహారాజు గజ యుద్ధములో వీర స్వర్గ మలంకరించె ననుట మఱియు యాదవ వంశములోని సింఘన నెలకొల్పిన బహాల శాసనములో జైత్రపాలుని ప్రశస్తిని దెలుపు శ్లోక మిట్లున్నది

హిమమయూఖ మయూఖ విశృంఖలా
ఖిల యశోభర శోభితదిక్చయః,
గణపతిం పతి మంధ్రభువో వ్యధా
ద్యధి ధృతం కరుణా వరుణాలయః 2

జైత్రపాలుఁడు చంద్రకిరణకాంతివలె వ్యాపించిన యశోభారముచే దిగ్వలయమును శోభింపఁ జేయుచు, దయాసముద్రుఁడై యుద్ధములోఁ బట్టుబడిన గణపతి దేవు నాంధ్రభూమి కధిపతినిగాఁ జేసెనని ఈ శ్లోక భావము. దీనిని బట్టి యాదవులతో యుద్ధమునకుఁ దలపడినపుడు గణపతిదేవుఁడు వారిచేఁ బట్టుబడి మరల విడుమ బడుట జరిగెననియు, యాదవ భూపాలుఁ డీతని వదిలివేయుచు త్రిలింగ సామ్రాజ్యాధిపత్యము నీతని కిచ్చెననియు దెలియ వచ్చుచున్నది. ఇంతే కాదు గణపతిదేవుని పాలన సమయమంతటిలోను మరల యాదవులతో కాకతీయులకు యుద్ధము నే విధముగను జరిగినటు కూడఁ దెలియ రాదు కాన జైత్రపాలుఁడు గణపతి మీఁద దయచూపించి రాజ్యము నిచ్చుటయే గాక తన కూఁతును గూడ నిచ్చెనని యూహింపవలసి వచ్చుచున్నది. గణపతి తరువాత రుద్రాంబ రాజ్యము చేయునపుడు, యాదవులతో యుద్ధము చేయుట సంభవించెననియు, ఆ యుద్ధములో మహాదేవ నృపతి రుద్రమదేవికి సంబంధించిన సైన్యమును, ఏనుఁగులను పంచ మహా శబ్దములను దీసికొని రుద్రమదేవిని వదలివేసినట్లు తెలియ వచ్చుచున్నది ఈ విషయమును దెలుపు శ్లోకము హేమాద్రి రచించిన యాదవరాజప్రశస్తిలో నీ క్రింది విధముగ నున్నది

వాహానా మపి యస్య వైరివిషయే స్యాతస్వతాం ధన్వినా
మాతిల్లిజ్ఞ న్నృపాజ్ఞ నాదపహృతం బా(వా?) ద్యాది(ల?) లీలా భవత్,

1 Epi. Ind, Vol. III p.p 97.
2 Epi. Ind Vol. III p p 111.

యస్త్స్యైశ్వరగోజహార కరిణ స్త్వత్పఞ్చశబ్దాది కాన్
యస్త్స్యాజ వధూ వధా దుపరత స్త్రద్రు . జారుద్రమహాన్ 3

ఈ శ్లోకమును తమ దక్షిణ దేశచరిత్రలో నుదాహరించిన భండార్కరు గారే ఈ శ్లోక పాఠము తప్పులతో నిండియుండెనని తెలిపియున్నారు త్రిలింగ దేశమునకు రాణియైన రుద్రమదేవి వలుకు యుద్ధమున కుద్యుత్తులైన వారి గుఱ్ఱములను ధనుర్ధారులను గజములను హరించి వేయుట మహాదేవ మహీపాలున కొక క్రీడ యయ్యెననియు, రుద్రమదేవితో వచ్చిన యుద్ధములో ఆమెకు గల యేనుఁగులను పంచ శబ్దాది బిరుదములను అపహరించెననియు, స్త్రీ వధ చేయుట భావ్యము కాదని యామెను వదలివేసెననియు నీ శ్లోకమువలన నూహింప హింప నగుచున్నది.

ఈ చరిత్రమునందే మఱియొక క్రమమున నీ రాజప్రశస్తిని దెలుపు వపుడు ఈ క్రింది శ్లోకము ఉదాహరింపఁ బడినది.

అయం శిశు స్త్రీ శరణాగతానాం
హన్తా మహాదేవనృపో నజాతు,
ఇత్థం వినిశ్చిత్య తతోఽతి భీత్యై
రంధ్రైః పురస్త్రీనిహితా నృపత్వే — రాజప్రశస్తి శ్లో 14

మహాదేవ భూపాలుఁడు చిన్నపిల్లలను స్త్రీలను శరణాగతులను నెన్నడుఁ చంపఁ డని నిశ్చయించి, ఆంధ్రులాతనికి భయపడి స్త్రీని పాలకత్వ ము నందుంచి వారని ఈ శ్లోక భావము ఇది యాలంకారిక క్రమమున నిరూపించు విషయమైనను, అతని నాఁ డాంధ్రదేశ పాలన స్థానమందున్న రుద్రమదేవి వాతఁడు చంపకుండ వదలివేసినట్లు తెలియ వచ్చుచున్నది మఱియు యుద్ధములోఁ బట్టుబడిన యామెను గూడ, జైతుగి గణపతిని వదలినట్లే మహాదేవుఁడు వదలివేసినట్లు తెలియుచున్నది. ఈ వర్ణన క్రమమును పరికించినను గణపతి దేవుని సమయములో మరల యాదవులతో నాతనికిఁ దలపడుట తటస్థింప లేదనియు యూహింపనగుచున్నది యాదవ వంశ సంజాతయైన 'రుద్రమ' యను నామెను గణపతిదేవునకిచ్చి యాదవభూపతి వివాహము చేసినట్లును, ఆమెకు ఉమ్మక్కయను కూఁతురు పుట్టినట్లును, ప్రతాపచరిత్రము మొదలయిన గ్రంథములు తెలుపుచున్నవి తల్లి కూఁతుళ్ల నామములు వ్యత్యస్తములైనవన్నమాట కాని, గణపతికిఁ బట్టపు రాణిగా నుండిన యామె యాదవ వంశమున బుట్టిన వనితయనుట కీ ప్రతాపచరిత్రాదులు సహకరించుచునేయున్నవి. యాదవవంశము చంద్రవంశమను మాటను హేమాద్రి రాజప్రశస్తిలో స్పష్టము చేసియే యున్నాడు ఈ స్థానిక చరిత్రలైన ప్రతాపచరిత్రాదులలో, గణపతిదేవుడు జాయపసేనాని సోదరీలయిన నారమ పేరమలను బెండ్లాడెనని యుండెను గదా! వా రేమి కావలయునను ప్రశ్న జనింపక మానదు. ఈ విషయమును గూర్చి జాయపసేనాని దివి దుర్గమున నెలకొల్పిన గణపేశ్వరాలయ శాసనమును పరికించిన, వారు అయ్యకులమునకుఁ జెందిన స్త్రీలనియు, ఆ నారమ పేరమల నిరువురను కాకతి గణపతిదేవుఁ డంతఃపుర కాంతలనుగాఁ జేసెనని తెలియవచ్చుచున్నది అచటి శ్లోకము లిట్లున్నవి.

స్త్రీరత్న పుంరత్న గజాశ్వరత్న, నానాశిలారత్నచయం సమన్తాత్
ఆహృత్యచాస్మై ద్వెలనాండు దేశా, ప్రావేశయత్స్వంపుర మేవ భూపః 35

అధ రూపవిలాస విభ్రమై, రసమానే భువనత్రయేఽప్యమూ
గణపత్యవనీపతిర్వ్యధా దయితే నారమ పేర మాహ్వయే 36

గణపతిదేవుఁడు, దివి దుర్గముతో సహ వెలనాఁడను జయించినప్పు డా ప్రభువులు అర్పించిన స్త్రీపురుష గజాశ్వ శిలారత్నములను (వాని వానిలో శ్రేష్ఠమైన వానిని) ఓరుగలు నకుఁ బంపిన వెనుక, రూపవిలాస విభ్రమములతో ముల్లోకములందు సాటిలేని నారమ పేరమలను జాయపసేనాని సోదరీలను ప్రేయసు లనుగాఁ జేసెనని యీ శ్లోకములభావము జాయపసేనాని కుల మయ్యకులమని యీ శాసనములోని 16 వ శ్లోకము తెలుపుచున్నది 4 అయ్యకులము చతుర్థకులమను విషయమును గుడివాడలోని కుందేశ్వరస్వామి దేవాలయమునందలి శాసనములోని 5 విషయము తెలుపుచున్నది.

ఆ శాసనములోని వాక్యములు కొన్ని యుదాహరించెదను —

కుందేశాయాతి భక్త్యా ప్రధి కవితిథౌ నాగసూనుర్బలాఢ్యః
గుండః పద్మాసనాంఘ్రిద్వయభవకులజో నాంగమాంబాసుపుత్రః.

శక వర్షంబులు 1165 నేంట్ని పౌష్య శుద్ధ చతుర్దశీ శనివారము నాం డుత్తరాయన సంక్రాంతి నిమిత్తముగాను చామెనబోయని కొడుకు నాగనబోయండు, నాగని బోయని నాగసానికొడు కయ్యకులము వాండే శివాలయము గట్టించిన మల్లెబోయుండు మేనల్లుడు గుండెబోయుండు గుడివాడ కుందేశ్వర శ్రీ మహాదేవరకుం బెట్టిన నఖండదీప మొక్కటి.

కావున అయ్యకులమునకుఁ జెంది, వెలనాటి విజయమున కానుకలుగా లభించిన స్త్రీరత్నములైన నారమ పేరమలను గణపతిదేవుఁడు 'దయితే వ్యధాత్' అనుటచే అంతఃపురకాంతలనుగాఁ జేసె ననుట నిశ్చయము ఈ విషయము మానసోల్లాస విషయాను సంధానముచే సమన్విత మగును

ప్రతాపచరిత్రము సిద్ధేశ్వరచరిత్రము సోమదేవరాజీయము ఓరుగల్లు కైఫీయతు ఇవి యన్నియు గతాను గతికములైన కట్టుకతలతో నిండి యున్న గ్రంథములు వీనిలోఁ గొన్ని విషయములు సమకాలిక చారిత్రక నిదర్శనములకు సరిపడునవిగను, కొన్ని సరిపడునవిగను నుండును. గణపతిదేవుని తండ్రి మహాదేవరాజు యాదవులతో వచ్చిన యుద్ధములో వీరగతి నొందెనని సిద్ధేశ్వర చరిత్రములోని యీ క్రింది ద్విపదలు,

గతులచే గజయాధతతులచే నొచ్చి
యుతులితహతిచే మహాదేవ విభుఁడు
గతిఁ బొందె సంతట గణపతిరాజు

తెలుపుటచేఁ దెలియుచున్నది

అసువులఁ బాపైఁ దా మసలక రాజు
నెసగంగఁ జంపెను నసరుంబుతోడ
నెస దేవగిరి రాజు లపుడు .
తమ తమ జతగూడ తగు కానుకలును
నమరంగ రుద్రమ్మ యను కన్య నిచ్చి
గణపతిరాజుకు కల్యాణ మపుడు
గణన కెక్కఁగఁ జేయు

సిద్ధేశ్వర చరిత్రము పుటలు 112—113

దీనినిబట్టి గణపతిదేవుని పట్టపురాణి యాదవవంశజనితయైన కన్య యని తెలియుచున్నది కాని, గణపతిదేవుని భార్య రుద్రమ, ఆమె కూఁతురు ఉమ్మక్క అని యీ చరిత్రములు చెప్పుచున్నవి గాని, ప్రతాపరుద్రయశోభూషణమున విద్యానాథుఁడు తెలిపిన విషయమునకు, శాసనాద్యాధారముల వలనఁ దెలియవచ్చెడి విషయమునకు నిది సరిపడదు వీనిలో నెచట నైనను రుద్రమ గణపతిదేవునకు కూతు రైనట్లులే గాని రాణి యైనటు తెలియవచ్చుటలేదు. కావున ఉమ్మక్క, ఆమెయే సోమాంబ గణపతిదేవునకు పట్టమహిషి యనియు ఆమెయే జైత్రపాలుని తనయ యనియు, రుద్రమ ఆమెకుఁ దనయ యనియు నిర్ణయించుకొనిననాఁడు నీ వ్యత్యాసము దూరమై, మానసోల్లాస ప్రతిపాదితవిషయము కూడ సమన్విత మగునని నా మనవి సహృదయులగు వారిందరి సామరస్యమును గ్రహింప వేఁడికోలు

3 See Early History of the Dekkan, R. G. Bhandarkar page 160

4. Epi. Ind. Vol. III pp. 87.

5 S. I. I. Vol V. No. 218.



# వసంతాగమనము

శ్రీ స్వామి

సీ॥ నిదురబోయెడు ముగ్ధహృదయాల మేల్కొల్పి
పూలపొట్లలతేనె పాలనింపి
రజతసమాధిలో రాజిల్లు కీటక
యోగిని రమణీయ భోగిజేసి
తెలిమంచు తెఱలలో చలిగాలి వడకు భూ
జములకు చిగురు పచ్చడముగప్పి
స్వాదుగీతాల వసంతు నాహ్వానింప
అమృతమ్ము పికకంఠమందుబోసి.

తే॥గీ తనువునిండుగ పులకలందముగ మెరయ
కులుకు నడకల నొయ్యార మొలుకుచుండ
ధారుణీదేవి సుస్వాగతమ్మొసంగ
మాధవుడు వచ్చె చైత్రమాసాధిపతిగ.

ఉ. ఎంత నుతింపవచ్చు మనసింతగ దోచిన యీ వసంతమిం
తింతనరాని ప్రేమ నుదయింపగజేసెను సర్వదంపత
స్వాంతములందు; నీధరణి సర్వము దివ్యవిహారభూమిగా
వింతు నటంచు నెంచి సుమవృష్టి నెలర్చిన కంతువింతయై.

చ. తరుణ విలాసవేషమును దాల్చి రమాసతి వెంటవచ్చు సుం
దరతరమూర్తి మాధవువిధంబున బంభరగానమాధురీ
భరిత మనోహర ప్రసవ భాసురభూషిత ధారుణీ మన
స్సరసిజ భాస్కరుండగు వసంతుడు వచ్చె సమంచితంబుగన్.

మ. రమణీయోజ్జ్వల కాంతిమూర్తియగు స్వర్గస్వామి విల్ బూని దు
ర్దమ బాధాకర శైత్యరాక్షసుని గర్వంబున్ విదారించి వా
నిమదిన్ భీతిని పాదుకొల్ప భువిపై నిల్పంగ నవ్వింటి వ
ర్ణములం గౌరవమొప్ప దాల్చెనో యనం రాజిల్లెడిన్ పుష్పముల్.

ఉ. రాజుల పూజచేసి కవిరాజుల కంఠముల న్నటించి నీ
రేజ ముఖీలలామలకు ప్రీతినిగూర్చితి లన్నినాళ్లు వి
భ్రాజిత పుష్పమూర్తు లికరండు సెబాసన దేశభక్తితో
రాజిలునట్టి వారి పదరాజిని గొల్వగ నిండువేడుకన్.

---

# సినిమా సాహిత్యం

పీ రా జీ

నవల, నాటకము, ప్రబంధము, సినిమా, వంటి గద్య, పద్య దృశ్యకావ్యమేదైనా అందులో ఉండవల్సినది, ఉండేది కూడా కథ అగ్రశ్రేణి నిర్మాత, దర్శకుడు వి. శాంతారాం కూడా 'సినిమాకు కథ ఆత్మ వంటిది' అన్నాడు కథ అనే పదానికి శబ్దరత్నాకరం చూసినా "ఇంచుక సత్యమును కలిగిన కల్పిత ప్రబంధము" అని ఉంటుంది అందుచేత 'కథ' లో యించుక సత్యము ఉండాలి, అది సమకాలీన జీవితవిధానాలనుంచి గ్రహింపబడటమూ అవసరము అతే 'సినిమా' వరకూ మన చర్చ పరిమితం చేసుకుంటే, మనకు పౌరాణిక, జానపద, చరిత్రాత్మక, సాంఘికములనే సినిమాకథలు తటస్థపడతాయి వీటిలో పౌరాణిక, జానపద కథలలో ఉండవల్సిన 'యించుక సత్యం' గురించి చర్చించవల్సిన అగత్యము లేదనుకుంటాను చరిత్రాత్మకమైన కథలు కూడా మనకు సినిమాలలో చాలా కొంచెం అగపిస్తున్నాయి రానురాను సినిమాలలో ఎక్కువభాగము సాంఘికమనే ముద్రను వేసుకుని విడుదల అవుతున్నాయి మన తెనుగులో ఇటీవల వస్తున్న చాలా సినిమాలలో బెంగాలీ, తమిళ కథలు ఎక్కువగా ఉంటున్నాయి ఇది శోచనీయమైన విషయము కొందరు పిన్నలు, పెద్దలు కూడా ఈ విషయములో ఒక ప్రశ్న వేస్తున్నారు "కథలలో తెనుగు కథ, తమిళకథ, బెంగాలీ కథ అని ఉంటాయా ?"

నిజమే, యీ ప్రశ్న నిస్సందేహంగా సమాధానించవల్సిన ప్రశ్నే ప్రజలు, వారే భాషవారైనా, ఏ జాతివారైనా, దుఃఖం, సంతోషము, భయము, ప్రేమా వంటి మానసిక శారీరక ఉద్రేకాలు సామాన్యమైనవిగానే ఉంటాయి గనుక, కథ లన్నింటా లక్షణ లక్ష్యముల సామ్య మున్నదని చెప్పవచ్చును కాని, భాష ఒక్కటే గాక, ఆర్థిక, సామాజిక, నైసర్గిక ప్రభావంతోబాటు, 'కథ'కు చెందిన ప్రాంతీయత లేక జాతీయత, అక్కడి ప్రజల సంస్కార, సంపర్కముల ప్రభావం కూడా కథకు 'పుష్టి' నిస్తాయి—'సమకాలీనజీవితాన్ని చిత్తశుద్ధితో ప్రతిబింబించడం మంచి సాహిత్య లక్షణమే గాక లక్ష్యం కూడా కావలెనని అంటారు కదా ! ఐతే సాంఘికములు అని చెప్పబడుతూ ఉన్న ఎన్నో తెనుగు సినిమాలలో సాంసారికమైన విషయాలకు ప్రాధాన్యత లభిస్తున్నదే కాని సామాజికత అనేది చాలా చాలా తక్కువగా కనిపిస్తున్నది ఎక్కువగా సినిమా నిర్మాతలు తెనుగు కథలలోని యీ లోపానికి, ప్రేక్షకుల అభిరుచిని ఒక కారణంగా పేర్కొంటూ ఉంటారు కానీ, సినిమాల స్థాయి పెరిగితేనే తప్ప ప్రేక్షకుల అభిరుచి మారదు, అనే వాదం కూడా ఉన్నది

"సినిమాలు అక్షరాస్యులు, నిరక్షరాస్యులు, చిన్నవారూ, పెద్దవారూ అందరూ చూస్తారు. సాహిత్య గ్రంథాలలోని 'వస్తువు' కన్నా యీ సినిమా కథలోని 'వస్తువు', దాని ఉదాత్తత' కూడా మరింత శ్రద్ధతో రూపొందించవలసి ఉన్నది వాస్తవానికి సాహిత్యరంగంలో కొంత పేరూ—ప్రఖ్యాతి సాధించిన ప్రతిభావంతులు, కవులు, సినిమారంగంలో అడుగు పెడుతున్నారు సినిమా కథలకు మాటలు, పాటలు వ్రాస్తున్నారు. కొందరు కథలను కూడా కూర్చుతున్నారు కాని, కథలో గల ముఖ్యమైన లోపాలను—సామాన్య ప్రేక్షకుడు మొదలు, ఆసుభవజ్ఞులైన విమర్శకుల వరకూ ప్రతిఒక్కరూ పేర్కొంటూ ఉన్న బలహీనతలను వీ రెవ్వరూ సంస్కరించలేక పోతున్నారు.

సినిమాకి టెలివిజను, నాటకమూ, లేక మరో రకమైన వ్యాపకమూ అలాంటి పోటీ బొత్తిగా లేని మన దేశంలో కూడా సినిమాకథ, సినిమా స్థాయి—ఉత్తమ ప్రమాణాలను సాధించలేకపోవడం విచారించదగ్గ విషయమే! సినిమాను కేవలం 'కళ' గాను సంఘోద్ధరణకు పూనుకునే ఉపకరణం గానూ రూపొందించమని ఎవరూ అనలేరు కాని, అధికసంఖ్యాకులు చూసి ప్రభావితులు కాగల యీ 'వ్యాపారం' లో కూడా ప్రజల నైతికస్థాయి పట్ల ప్రత్యేకమైన బాధ్యత ఒకటి ఉండటం ఆరోగ్యప్రదమని అందరూ ఒప్పుకుంటారు. తెనుగులో మంచి కథలు లేవు అని కొంద రంటున్నారు ప్రజలు వారికొక భాష, సంస్కార సంస్కృతులు, ఆర్థిక విధానము, నైసర్గిక పటు బాటు ఉన్నవి కదా ! వీటిని ప్రతిబింబించగల సన్నివేశాలను ఏర్పకూర్చ కలిగితనే 'కథ' వస్తుంది అంచేత శ్రద్ధ, ఆసక్తి, బాధ్యతపడి ప్రయత్నంచేస్తే మంచి కథలు రూపొందుతాయి అలా గాక, బెంగాలీకథనో లేక, తమిళ కథనో తెనుగులో మలిచినప్పుడు పాత్రల తత్వం పరాయిదిగానే ఉండిపోయి కేవలం యివి తెనుగుదనంలేని తెనుగు సినిమాలుగా ఉండిపోతున్నాయి కారణం సినిమాలో 'ఆత్మ' వంటిదైన కథ తెనుగుది కాపోడంవల్ల, బెంగాలీ, లేక తమిళ తత్వమే తెనుగు కథలోకి "పరకాయప్రవేశం" వేయడంవల—మాటలు తెనుగువే అయినా భావాలుమాత్రం "తర్జుమా గ్రంథం" గా ఉంటున్నాయి ఇది కొన్ని కథల సంగతి

ఇక మరికొన్ని కథలలో పాత్ర కల్పన, సన్నివేశాలరూపమూ కూడా కృత్రిమంగా ఉంటున్నవి నిర్మాతలు ప్రేక్షకుల బలహీనతలను దోచుకుని వారిలోని నిద్రాణమైన కోర్కెలకు మేతగా ఉండగల నాలుగైదు సంఘటన లను ఏర్పి కూర్చ మనడంవలన—సినిమా రచయిత యీ కృతకమైన కథలను రాస్తున్నాడు అన్నమాటలో కొంత సత్యము, కొంత అసత్యము ఉండవచ్చు నేమోగాని, నిర్మాతపట గల బాధ్యతలో సగమైనా 'కవి' కి ప్రేక్షకుని ఎట్ల కూడా ఉండాలి అని మనం కోరడం బెసబబు కాదనుకుంటాను ఎక్కువగ యిటీవల విడుదల అవుతున్న తెనుగు సినిమా కథలలో 'ప్రేమ' 'అనుమానం' అనే రెండు 'పదార్థాల'ను విపరీతంగా వాడుతున్నారు ప్రేమ జయించడం—అనుమానానికి ఆధారం లేకపోవడం, అనే నీతిని బోధించె యీ కథల్లోని సంఘటనలన్నీ వినోదాన్ని విపరీతమైన సానుభూతిని కలిగించగల (1) అవాస్తవిక (2) దైవికమైన సంఘటనలతో మాత్రం రూపొందిస్తున్నారు

స్వాతంత్ర్యం రాకపూర్వం గల సినిమాలలో "ప్రజంటేషను వాల్యూ" కొంతవరకూ ఉండేదని విజ్ఞు లంటారు ఈమధ్య వస్తున్న 'సినిమాలలో 'ఎక్స్‌ప్లాయిటేషను' ఎక్కువైనది నిర్మాతలు లక్షలకొద్దీ ధనం వ్యయం చేసి నిర్మించే సినిమాలక్ష్యం 'ధనం' మే అయినా వాటి ప్రయోజనం కూడా కొంత ఉండి తీరాలి ఇది మంచికథలు ఎన్నుకున్నప్పుడె సాధ్యమవుతుంది.

ప్రేక్షకులలో అమాయికులు, నిరక్షరాస్యులు యెక్కువ అక్షరాస్యులలో లలో కూడా అనేకమందికి ఆశలు తీరగల అవకాశాలు తక్కువ సినిమా నుంచి మనమంతా వినోదమే ఆశిస్తున్నాము' అన్న మాటలో కూడా సత్యమే ఎక్కువ అయినా, ప్రేక్షకులలో అన్ని తరగతులవారూ సినిమాలో 'కథ' ఉండాలి అని కోరుతున్నారు 'మీకు సినిమాలో ఏమి కావాలి ?' అని అడిగినప్పుడు "మాకు మంచి కథ కావాలి" అని ఎక్కువమంది అంటున్నారు 'కథ' సినిమాకు కూడా ఆత్మవంటిది అని నిర్మాతలు అంటున్నారు అందుచేతనే 'చిత్తశుద్ధి' అవసరమంటాను ఉత్తమస్థాయి చిత్రాల నిర్మాణానికి, ఉత్తమ కథల అవసరము,

ఉత్తమ కథలరచనకు చిత్తశుద్ధి, బాధ్యత గల పరిశీలన, పరిశోధన కూడా అవసరము అని అనుకోవాలి

తెలుగు సినిమాలో సంభాషణల మధ్య నినాదరూపంగా సందేశమూ, వినోద రూపంలో 'విమర్శా' అగుపిస్తున్నాయి కాని పాత్రలతత్వాన్ని సన్నివేశాల ద్వారా చూపించగలిగితేనే తప్ప సందేశంలోని ఉదాత్తత, విమర్శ లోని స్థాయి ప్రయోజనానికి రావు

వర్తమానంలో వస్తున్నకథలలో ఎక్కువ మేరకు, అన్నీ ఒకే మూసలో పోసిన పాత్రలకు, వేర్వేరు రగిలీలు, డిజైనులు వేసినట్లు ఉంటున్నా యంటే అతిశయోక్తి కాదు

సాంఘికమైన కథలు గగన మనుకున్నాము ఇక సాంసారికమైన కథలలో కూడా నేటి మన సినిమాలు యదార్థానికి ఎడంగా ఉంటు న్నాయి. సమస్యలను సేర్కొని వాటికి అవసరమైన సంఘర్షణను రేకెత్తించి—పర్యవసానం చూపడానికి బదులు సమస్యలను ఆధారంగా చేసు కొని కృతకమైన మలుపుల ద్వారా, దైవికమూ, యాదృచ్ఛికమూ కాగల పతాక సన్నివేశాలతో దగా చేయగల కథలు వస్తున్నాయి.

కథలోని బలహీనత, సంభాషణలలోను, సంగీతంలోను, నటనలో కూడా వికృతమైన ఫలితాలను చూపుతాయి కథలో బలం లేదని రచయిత సంభాషణలలో 'బూతు' కాదని బుకాయించగల ద్వంద్వార్థాలను, పాటల సాహి త్యంలో సన్నివేశాని కతకని ముతుక శృంగారరసాన్ని చొప్పించవలసి వస్తున్నది ఇందుకు బాధ్యత ప్రేక్షకులది అనడంకన్నా కథకులది నిర్మాతలదీ అనడమే భావ్యమేమో ..

ఒక చిత్ర నిర్మాణ వ్యయం ఏడు నుంచి పది దాకా లక్షల రూపాయ లలో ఉంటే—అందులో కథ'కు అది తెరపై ప్రదర్శించడానికి వేకూర్చు కునే హంగులకూ ఎంత వ్యయం చేస్తున్నారు'' అన్న ప్రశ్నకి రాగల సమా ధానంలోనే మంచి కథల రహస్యం యిమిడిఉందని చెప్పాలి

మన సినిమా కథలలో తెనుగుదనం లోపించడానికి తమిళ సినిమాల ప్రభావం సంభాషణల పద ఎక్కువగా ఉన్నది అని చెప్పవచ్చును కథలో అంటే పాత్రల రూపకల్పనలో కూడా యీ లోపం ఉంటున్నది అందుకు బెంగాలి చిత్రాలప్రభావం కారణం తమిళ చిత్రాలు తమిళంలోను, బెంగాలీ సినిమాలు ఆ భాషలోను గొప్పవి కావని ఎవరూ అనరు కాని, వాటి అనుకరణ తెలుగు సినిమా స్థాయిని పెరుగదీసిందన్నమాట అబద్ధంకాదు

మంచి కథలకు ప్రేక్షకులలో వాటికి లభ్యంకాగల ప్రాచుర్యమే కొలత బద్ధ అయితే కాశీ మజిలీ కథల కన్నా జానపద చిత్రాలకన్నా మంచి సాంఘిక చిత్రాలను మనం యిప్పటో ఆశించలే మనుకోవాలి మన సాంఘిక చిత్రాల లోని తత్వం మారితే తప్ప యిప్పుడు వస్తున్న సాహిత్యంలో ఔచిత్య ప్రసక్తికి తావుండదు

కేవలం వేషధారణ, ఆధునికమైన సెట్టింగులు చిత్రాన్ని ఎంతమాత్రమూ సాంఘికం చెయ్యలేవని నిర్మాతలు, కథకులు గుర్తించాలి అంటే ప్రేక్ష కుల అభిరుచి, కథలకు ఔచితి యీ రెండింటకి కనిష్ఠ ప్రమాణ మొకటి ఉండాలి

సాంఘిక చిత్రాలలోని కథలు వ్యూహించి, బాక్సాఫీసు సూత్రాలను పెంజావేసి తయారుచేస్తున్నంత కాలమూ బలమైన కథ తయారుకాదు సరి కదా, తారాబలం, మిగిలిన హంగుల అవసరం యింకా యింకా పెరగగల ప్రమాద మున్నది మంచి కథకు మంచి సంభాషణలు, మంచి సన్నివేశాలు రూపొందుతాయి నటీనటులకు యిది దోహద మిస్తుంది నటీనటుల పేరు బలంమీద గాక కథలోని ఉదాత్తత ద్వారా ప్రేక్షకుల నాకట్టుకునే ప్రయత్నం

విజంగా తారాబలాన్ని పారిశ్రై చేసేవ్యయాన్ని తగ్గించడమే కాదు, చిత్ర నిర్మాణ వ్యయాన్ని కూడా తగ్గించవచ్చును

ప్రస్తుతం మన దేశంలో ఒక రాష్ట్రంలో శతదినోత్సవం చేసుకున్న సినిమా వెండితెర హక్కులను సంపాదించి ఆవిధంగా విజయవంతం కాగల చిత్రాన్ని నిర్మించాలనే అభిలాష, ఆశయం, రాజ్యమేలుతున్నాయి. 'కథ' దారి కథది దానికి తెనుగు ప్రాణం పోసే రచయిత రచన దారి దానిదే "మరొకని కథ, తన రచన, నిర్మాత యిష్టం, ప్రేక్షకుని అదృష్టం— ఈవిధంగా సాగుతున్న సినీ సాహిత్య క్షేత్రంలో—ఏ రచయిత నుంచేనా మనం పూర్తి ప్రతిభను పొందలేము ఐతే తప్పంతా నిర్మాతదేనని రచయిత తప్పుకోడం భావ్యం కాదు సినిమాభాష, సినిమా శైలి, సినిమా ఫక్కీ, సినిమా సాహిత్యం అంటూ 'కృతకమైన ప్రతీ దానిని' చులకన చేయడ మొకటి సంప్రదాయ మయిపోతున్నదీ అంటే అందుకు సినీమా రచయితలు కూడా బాధ్యత వహించవల్సినదే !

సాంఘికచిత్రాలలో యీటీవల వస్తున్న కథ లన్నింటా ఆర్థిక వ్యత్యాసాన్ని సన్నివేశాల రూపకల్పనకూ కులతత్వాలను రాజకీయమైన సంకుచిత తత్వాలను సంభాషణల 'వడి' కీ వాడుకోడం ఎక్కువ అవుతున్నదే గాని, సమస్యలకు యివ్వదగ్గ "సీరియస్ అప్రోచ్" ఉండటంలేదు

మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలు తెచ్చిన ఎన్నో అనర్థాలతో పాటు, శాస్త్ర, వైద్య రంగాలలో నూత్న ఆవిష్కరణలను, ఔషధాలను కూడా ప్రజలకు యిచ్చాయి. యుద్ధం ఎంత అపకారం చేస్తుందో—అంత 'చైతన్యం' కూడా తెస్తోంది— అనే సత్యాన్ని కళ్ళక కట్టినటు ఎన్నో ఇంగ్లీషు సినిమాలు వచ్చాయి. ఆ విధంగా స్వాతంత్ర్యం రాక మునుపు, అది సిద్ధించిన వెను మనదేశంలో వచ్చిన అనేకమైన ఆర్థిక, సామాజిక మార్పులలోని మంచి, చెడ్డలను, ప్రతిబింబించగల కథలు ఈ పదిహేను సంవత్సరాలలో వేళ్ల మీద లెక్క పెట డానికైనా లేవు. అంటే నేటి మన సినిమా సాహిత్య స్థాయి ఆశాజనకంగా లేదు అన్న సత్యం తేట తెల మవుతున్న ది

ఉత్తమ సాంఘిక చిత్రములంటే వర్తమాన చరిత్రను చెప్పగల చిత్రమని చెప్పాలి దీనికి పరిశీలనా శక్తి, ఓపిక, రెండూ ఉండాలి. కథను తయారు చేయడంలో శరవేగ నిర్మాణ పథకాలు హానికరమైనవి. సినిమా నిర్మాణంలో కథ; దాని మీదచర్చ, కథా సృష్టి చాలా తక్కువ వ్యవధిలో పూర్తిఐపోతాయని వింటున్నాము. ఒక సినిమా నిర్మాణంలో నటీనటుల ఆలస్యానికి కాల్‌షీట్లు ఇవ్వలేక పోవడం, ఇతరమైన సాంకేతికమైన ఏర్పాట్లలో జాప్యం— వీటి ఇబ్బందులే ఎక్కువ అని కూడా వింటున్నాము కథ'కు కూడా చాలినంత పరిశోధన జరగాలి

విద్యార్థి సమస్య గలవని చెప్ప బడుతూ ఉన్న చిత్రాలని కొన్ని విడుదల అవుతున్నాయనుకోండి ఇందులో యువతీ యువకుల ప్రణయ కలాపాల పవిత్రత మీద ఉపన్యాసాలు ఉంటున్నాయి కాని వాటి చిత్రీకరణంలో, పాటలయొక్క సాహిత్యరచనలోను కూడా ఈ ప్రేమయొక్క పరువు, పవిత్రత, రెండూ భంగపాటుకు గురిఔతున్నాయి పైగా నేటివిద్యార్థులకు ప్రేమ కన్నా పెద్ద సమస్య లేదనడం ప్రేమ పర్యవసానం యెప్పుడు సుఖాంతమో, విషాదాంతమో ఐ పవిత్రతను సాధించటమే అవడము ఈ సినిమాల "సాంఘికత" గా చూస్తున్నాం. ఇటువంటి కథలలో వినోదానికి అవకాశాలున్నాయి. నిజమే ! కాని వాటిని వినోద చిత్రాలని ఎందుకనగూడదు? సాంఘిక మనడ మెందుకు "

మత సామరస్యం, కుల ఐకమత్యం, కార్మిక ధనిక వర్గాల వైషమ్యం మొదలైన సామాజిక వస్తువును నేటి సినిమాలు తమ స్వప్రయోజనానికి ఎక్కువగా వాడుకుంటున్నాయి కథలన్నింటిపైన పేర్కొన్న విషయాల ప్రసక్తి ఉంటుంది వాటి నిజ స్వరూప ప్రతి బింబం మాత్రం ఛాయా లేశమైనా ఉండదు ఈ కథలలో ముగింపు బహు కృత్రిమంగా ఉండటాన్ని ఏ తెనుగు సినిమా కథనైనా బుజావుగా చూసి మనం గ్రహించ వచ్చును

కార్మిక సమస్యల పేరిట విడుదల అయ్యే చిత్రాలలో కార్మికులు అపార్థం చేసుకోడం— పెట్టుబడిదారు పశ్చాత్తాప పడటం— అనే 'సెంటిమెంటల్' పరిష్కారం యథార్థానికి భిన్నంగా ఉంటుంది. కాని తెనుగు సినిమా కథలో కార్మిక సమస్యలు రైతు సమస్యలు కూడా ఆ రెండు రకాల దైనందిన జీవనవిధానాలకు దూరంగా ఉండటమే గాకుండా, వారికీ ధనికవర్గానికీ గల వైషమ్యాన్ని కేవలం 'స్త్రీ' మూలకమైనదిగా చిత్రించడం కూడా మనం చూస్తున్నాం

సెక్సును అన్నిరకాల సమస్యలకూ ఒక ఆలంబనగా వాడుకునే తెనుగు సినిమా సాహిత్యంలో ఔచిత్యం పాలు లోపిస్తున్నది. ఈ మధ్య వచ్చిన సినిమాలలో పురుష పాత్రలకు పురాణ కథలలోని పురుష పాత్రలకు దుస్తులలోను వేషధారణలోను మార్పు మాత్రమే చూస్తున్నాము స్త్రీ పవిత్రమైన తన శీలాన్ని రుజూ చేసుకునేటందుకు సాంఘిక చిత్రంలో కూడా పడరాని కష్టాలు పడుతున్నది పురుషుడు పర స్త్రీలోలుడు అవడం మొదలు త్రాగుడు జూదం మొదలైన వ్యసనాలన్నీ రుచి చూసి తిరిగి శీలవతిగా తనకై వేచివున్న భార్యను స్వీకరించడం— సాంఘిక ప్రగతి ఎంత వరకు కాగలదో రచయితలు విజ్ఞులు ఆలోచించవలసిన విషయమే. ఈ సాంఘిక మనబడే కథలలో కన్నా పౌరాణిక చిత్రాలలోనే స్త్రీ ప్రతిపత్తిని ఎత్తి చూపగల మంచి సన్ని వేశాలు దొరుకుతున్నాయేమో

రచయిత, తన ఉనికిని వ్యక్తిత్వాన్ని కూడా పుస్తక రచన ద్వారా ఏవిధంగా ఉత్తమ స్థాయిలో నిలుపుకోవాలనుకుంటాడో, అదే విధంగా సినిమాలకు రచన చేస్తున్నప్పుడు కూడా, నిర్మాతకు ఒక్కనికే గాక, ప్రేక్షకునికి కూడా బాధ్యుడై యుంటేనే తప్ప తెనగులో మంచి సాంఘిక కథలు రావని చెప్పాలి.

తెనుగు నాట నవలల్లో కొంచెం మాత్రమే వింధ్య రాణి బారిష్టర్ పార్వతీశం, దత్తత, పూజారి, కాలాతీత వ్యక్తులు మొదలగునవి)— చిత్రాలుగా రూపొందాయి. వీటి చిత్రీకరణ చూస్తే ఈ ప్రయత్నం ఎన్ని చిత్రాలలో సార్థకమైందో బోధపడుతుంది వేరే వ్యాఖ్యానమే అక్కరలేదు

తెనుగులో వస్తున్న ఆధునిక నవలలలో కొన్ని సినిమాలకు పనికి రావు— అందుకు కారణం 'సినిమా టెక్' మలుపులు సంఘటనలు ఆయా నవలలో లేవు అంటారు. మరికొన్ని నవలలు సినిమాలను అనుకరించి రాస్తున్నారు కేవలం ఇవి సినిమాలకు 'కాపీలు' కనుక వెంటనే "మార్కెట్ వాల్యూ" ఉండదు వెంటనే సినిమాలుగా రూపొందజాలవు అంటున్నారు. ఈ రెండు రకాల కథలలో మొదటి రకం కథలను సినిమాలకు మల్చుకోడం చేత సినిమా సాహిత్యానికి మంచి ప్రమాణాలు సాధ్యం కాగలవు

ఇంగ్లీషులో 'ఓల్డ్‌మాన్ అండ్ ది సీ' (Old man and the sea) బెంగాలీలో పథేర్‌పాంచాలీ, మొదలైన కథలు సినిమాలుగా తియ్యవచ్చునని ఎవరేనా అనుకోగలరా? కాని వాటిని ఉత్తమ చిత్రాలుగా రూపొందించ గలిగారా? లేదా? ప్రయత్నమూ, ప్రత్యేక శ్రద్ధ, ఉంటే కొంచెం పరిశ్రమతో, అవార్డులను అందుకోగల మంచి చిత్రాలు తెనుగు పరిశ్రమకు కూడా సాధ్యమవుతాయి

రచయితలు సంభాషణల విషయంలో శ్రవ్య నాటకాలలో మనం వినే సంభాషణలకన్న పొడుగైన, విపులమైన, సంభాషణలు వ్రాస్తున్నారు. నటీనటులకు వీటి కారణంగా తమ ప్రతిభను వ్యక్తం చేయగల అవకాశం కుంటుపడుతున్నది. గంభీరమైన సన్నివేశాలలో కూడా హాస్య రసాన్ని, వినోద పుష్టికై చేర్చడం ఔచిత్యానికి భంగం కలిగించడమే గాక ప్రేక్షకునికి విసుగు కూడా తెప్పించుతుంది

మన తెనుగు సినిమాలలో కథలోనూ సంభాషణలలోనూ శ్రద్ధ, పరిశీలన, పరిశోధన ప్రతిబింబించిన చిత్రాలు లేకపోలేదు. గిరీశం అన్నట్టు "మన వాళ్ళు ఉత్త వెధవాయ్‌లోయ్" అంటూ బెంగాలీ కథల వేటకు పోనక్కర లేదనీ, తమిళ సంభాషణల తీరు అలవర్చుకో నక్కర లేదని గత పదిహేను సంవత్సరాలలో విడుదలైన కొన్ని చిత్రాలు ధైర్యం చెబుతాయి మచ్చుకి కొన్ని పాత్ర రూపకల్పనలోను, చిత్రీకరణలోను, ఉదాత్తను చూపిన 'మల్లీశ్వరి', రసపుష్టిగల 'బంగారు పాప' చిత్రాలు సినిమాలు కళాత్మక మనీ, ధనాత్మకమనీ వాదించ నక్కర లేదని రుజూ చేశాయి. షావుకారు' పెద్దమనుష్యులు, తోడుదొంగలు' 'కన్యాశుల్కం' 'ఏదినిజం' లాంటి చిత్రాలు మనదీ అని పించుకున్న మంచి 'చెడ్డ' తత్వాల ప్రతిబింబాలను మనదే అని అనిపించుకోగల తీరులో చెప్పగలిగాయి. ఒక్క సినిమా

లోనే నవరసాలు, అష్టాదశపురాణాలు జొప్పించి ఒలికించాలనే ప్రయత్నంలో "చాచా" "కదంబం" కాగల చిత్రాలు విడుదల అవుతున్న దశలో 'తెనాలి రామకృష్ణ', 'బాటసారి' చిత్రాలు విడుదల అయ్యాయి

ముఖ్యమైన కథ ఒకటి పిట్టకథలు బోలెడు ఉండితీరాలి అనే వాదానికి పైన పేర్కొన్నలాంటి చిత్రాలు జవాబు చెప్పాయి 'పెళ్లినాటి ప్రమాణాలు', 'నమ్మినబంటు' చిత్రాల్లో, వినోదాన్ని, సాంఘిక చిత్రంలో 'స్థాయి' గా జొప్పించడం చూశాము నమ్మినబంటు చిత్రంలో వేర్వేరు రచయితలు తొలి మలి భాగాలను రచించినప్పుడు రాగల శైలిలోని తేడా స్పష్టంగాఉన్నా ఇటువంటి చిత్రాలు ప్రేక్షకుల అభిరుచిని తమ స్థాయిని కూడా సంతృప్తికరంగా ఎదుర్కొని నిలిచాయి.

'మాయాబజార్', 'సీతారామ కళ్యాణం' లవకుశ చిత్రాలు పౌరాణిక సినిమా కథలకు రచనకు కూడా పరిశ్రమ, పరిశోధన ఎంత అవసరమో, ఎంత దోహదమో తెలియజేసిన విజయవంతమైన చిత్రాలు. తెనుగులో మంచి ప్రయత్నాలుగా 'పదండి ముందుకు'—'తిమ్మరుసు' చిత్రాలను పేర్కొనాలి.

ఈవిధంగా చూస్తే తెనుగుసినిమా ప్రేక్షకుని అభిరుచి మంచి సినిమాలకు ప్రతిబంధకం కాదని, రచయితల పట్టుదల, నిర్మాతల పూనిక తెనుగు సినిమాకు మంచి ప్రమాణాలను తేగలదని ఆశించవచ్చును హాస్యమూ, అవాస్తవికతా లేనిదే చిత్రనిర్మాణం చేయలేమూ అనుకునే నిర్మాతలకు పూర్తిగా అటువంటి చిత్రాలనే తీయడం మేలు అనే సలహా యివ్వడానికి ఉదాహరణగా 'వద్దంటే డబ్బు', 'దేవాంతకుడు', 'ప్రక్కింటి అమ్మాయి' లాంటి చిత్రాలను పేర్కొనవచ్చును. పైన పేర్కొన్న చిత్రాలు గాక మరికొన్ని మాత్రమే యీ కోవలో పేర్కొనవచ్చును అంటే మన 'ప్రగతి' చాలదనే కదా ?

వాస్తవికంగా ఉండగల చిత్రాలలో డాక్యుమెంటరీ చిత్రాలయొక్క 'యిది' (తత్వం ఉంటుందని, సత్యజిత్‌రాయ్ లాంటి వాళ్ళు డాక్యుమెంటరీ చిత్రాలనే తీస్తారనీ అనుకునేవారు సాంఘిక చిత్రాలను మాని జానపద పౌరాణిక చిత్రాలను తీయడమే మేలు హాస్యం పేరిట ముతకశృంగారం సాంఘిక చిత్రంలో ప్రవేశపెట్టడం అనుచితమనే చెప్పాలి

తెనుగు సినిమాపాటలలో ఇటీవల మూడు విశేషాలు అగుపిస్తున్నాయి హిందీ పాటల సాహిత్యప్రభావం, కథకు అతకని పాత్రల తత్వానికి చెందని ముతక శృంగారపదజాలం అనేవి రెండు ఇవిగాక తేలికైన తేట తెనుగు పదాల కూర్పుతో పాటలను యిటీవలి రచయితలు చేస్తున్నారు వెనుక శ్రీయుతులు సముద్రాల, పింగళి, మల్లాది, కృష్ణశాస్త్రి మున్నగువారు పాటల సాహిత్యానికి ఒక ఒరవడి పెట్టారు వారిప్పుడూ రచనలు చేస్తున్నారు వారి ఫక్కీకి భిన్నంగా జంట పాదాలు అంత్యప్రాసాలు గల పాటలను యిప్పటి సినీ రచయితలలోని యువతరమంతా విజయవంతంగా చేస్తున్నారు వీరు వ్యావహారికమైన పదజాలంతో చిన్న చిన్న మాటలతో పాటలను సులువుగా చెయ్యగల కిటుకులను అలవర్చుకున్నారు. శ్రీయుతులు ఆరుద్ర, దాశరథి, నారాయణ రెడ్డి మొదలైనవారి సాహిత్యంలో, చిన్నమాటలలో పెద్ద భావాలను పొదిగే ప్రయత్నం—సుదీర్ఘమైన సమాసాలతో గాక, పొడిపొడి మాటలను ఏర్చి, కూర్చి 'వడి' సాధించగల నేర్పరితనం అగుపిస్తున్నది శ్రీ ఆరుద్ర వీరిలో ఎక్కువ గడుసుతనం చూపిస్తున్నారు శ్రీ ఆత్రేయ పాటలలో యిటీవల (ఆత్మబలం మొదలగునవి) మోతాదు మించిన శృంగారరసం అగుపిస్తున్నది. శ్రీయుతులు కొసరాజు, ఆత్రేయ రచనలలో నినాదంతోపాటు కమ్మని తెనుగు నుడికారం కూడా లేకపోలేదు.

కాని, మన సినిమాలలో పాటలలోని సాహిత్యానికి, పాత్రల తత్వానికి పొందిక సాధారణంగా కుదరడంలేదు. కారణం వేటికవే వేర్వేరు ప్రయోజనాలను ఆశించి చిత్రీకరించడం చాతనేమో ...

ఇక ఈ ఏడాది ఉగాదిలోగా విడుదలైన చిత్రాలలో పునర్జన్మ (హిందీ కథ) 'ఆత్మబలం' (బెంగాలీ అని, చిత్రంలో పేర్కొన్నారు కాని ఆంగ్లంలో 'రేజ్ ఇన్ హెవెన్' చిత్రం చూసినవారు అసలు మూలకథ అదే అనుకోవచ్చును ) 'పూజాఫలం' (పూజారి అనే తెనుగు కథ)లు మూడు చిత్రాలు ఉన్నాయి వీటిని సైకలాజికల్ చిత్రాలు అంటున్నారు కాని, మూడు చిత్రాలలోను 'మతిభ్రమణం' వస్తువుగా ఉన్నది ఈ చిత్రాలలో అది ఒక్కటే కొత్తదనంగా అగుపించినది కాని మనస్తత్వ విశేషాలు, మానసిక వ్యాధులకు చెందిన చిత్రాలు మనవాళ్ళు నిగ్రహంతో చాలినంత పరిశ్రమ చేసి నిర్మించడానికి ఇంకా కొన్ని రోజులు పట్టవచ్చునేమో తర్జుమా చిత్రాలలో మొదటి రకం ఇతివృత్తాన్ని తీసుకుని పునర్నిర్మించేవి కొన్నైతే, 'డబ్' చేసేవి రెండో రకం వీటిలో తెనుగుదనం కొరవడినా ఫర్వాలేదు తమిళ చిత్రాన్ని తెనుగులో అర్థంచేసుకోగల మేరకు సరళమైన సంభాషణలు చాలు అందుచేత డబ్బింగ్ చిత్రాలవలన సాహిత్యము, స్థాయి, చిత్రముల విలువలు పడిపోతున్నాయీ అనే వాదానికి, తెనుగు సినిమాలో సాహిత్యస్థాయి పడిపోడానికి ఎటువంటి సంబంధమూ లేదని వేరే చెప్పనక్కరలేదు తెనుగు చిత్రాలలో మంచి కథలు రావడానికి కొత్త నిర్మాతలు ప్రయత్నించడం కన్నా, పెద్ద సంస్థలు పది విజయవంతమైన చిత్రాలను నిర్మించిన భారీ నిర్మాతలూ కృషిచేస్తే, తెనుగు సినిమా ప్రతిసారి కేవలం ప్రాంతీయ సర్టిఫికేటుకే గాక, మంచి చిత్రాల అవార్డుకి కూడా పోటీ చేయగలదని ఆశించవచ్చును

'కథ' లో చైతన్యం స్వభావికత తేగల ప్రయత్నం జరిగేటంత వరకూ తెనుగు సినిమా సాహిత్యంలో కొత్త 'కళ' రాదు. అది రావాలని రాగలదని ఆశిస్తున్నాను.





ప్రప్రథమంగా
N.T.రామారావు
ద్విపాత్రాభినయం

సురేష్ ప్రొడక్షన్స్



VIJAYA PUBLICITY

# రాముడు-భీముడు





దర్శకత్వం
చాణక్య
నిర్మాత
D.రామానాయుడు
అసోసియేట్ ప్రొడ్యూసర్
జె.సుబ్బారావు..



విజయ రిలీజ్

# నీరాజనము

శ్రీ కుమార్

శ్రీవాణీ మృదు పాద పద్మయుగళిన్ సేవించి శ్రీనాథ వి
ద్యావైశద్యము మ్రొక్కి, పెక్కు తెరగుల్ తత్పాండితీ వైభవ
శ్రీవర్ణించి, తదీయ దివ్య కవితాసీమంతినీ లాస్య కే
ళీవిన్యాస విలాస వైఖరుల నోలింబూని కీర్తించెదన్.

'హరవిలాసము' మనోహర విలాస మధుర
కాసార కల్హార భాసురంబు,
'కాశికాఖండ' మఖండ భావోత్తుంగ
వీచీ మహోల్లాస విశ్రుతంబు,
'భీమఖండంబు' గంభీర మహోదార
వాగర్థ గౌరవ భాసితంబు,
'శృంగార నైషధ' శ్రీ విద్వ దౌషధ
భవ్య కావ్యంబు సంపత్కరంబు,
పాట లందు మేటి పలనాటి చరితంబు,
సీటు గోటు లడరు చాటు కవిత,
సరస మధుర వాణి 'శాలివాహన సప్త
శతి' నెసంగు సుకవి సార్వభౌమ!

భారత సత్కవిత్రితయ భంగులు సుందర సుందరంబులై
భూరి విలాస భాసురము, పూర్ణ వికాసితమై త్వదీయ వా
గ్ధోరణులందు దోచినవి, కోవిద వందిత సత్కవీంద్ర! నీ
చారు కవిత్వ సంపద పసందగు విందగు తెల్గువారికిన్.

తెలుగును సంస్కృతంబు పలుతీరుల నీ కవితా తరంగిణీ
లలిత తరంగ మాలికల లాస్య మొనర్చెడు, నేర్చికూర్చు నీ
పలుకు కడాని కానికలు వాణికి భాసుర కంఠహారముల్
తలుకుమిటారి మేల్గాయలు కుప్పలు తెప్పలు నీదు కైతలన్.

కైతల కేవలగాని బహూగాథల విశ్రుతమై రహింపు నీ
చేతలు వింతలై మదికి జేకుర జేయు ముదంబు సత్కవీ !
ఏతరినైన గాని భయ మించుకలేక జరించు వైఖరుల్
లాతికి చేతగావు, సుకళాభిగతిజ్ఞ నినుబోల దెవ్వడున్.

రాజుల కొల్వులందు కవిరాజుల గెల్చెడు దర్పరేఖయున్
తేజ మెసంగ వెల్గినది దీవ్యదఖండ తటిల్లతాభమై
లాఘలు జల్లి వైదువలు రాయులు దాగనశాఖిపీకముల్
రాజిత భంగిజేసె భళిరా ! కవిరాజ మనోజ సుందరా !

నిను వర్ణింప దరంబె నాకు కవితానీరాజనం బెత్తి నీ
ఘనతం గూరిచి నేర్చినంత యిటు పల్కంజాలు నా పూనికిన్
గనియుం జూడను నిన్నువంటి సుకవిన్ గీర్తి ప్రభామూర్తి వం
దనమున్ జేయుట కర్హమాను గదె నానాదేశ సంకీర్తితా !

నీ సౌఖ్యంబులు నీదు తీయుటను లన్నా ! నీ భోగ భాగ్యావళుల్
నానాదేశ విహారముల్ సుకవితా నాట్య ప్రకారంబులున్
నానా వాద వినోద వైఖరులు, సన్మానార్థ సంపత్తి, న
న్నానందింపగ జేయు సంతతము శ్రీనాథాంధ్ర విద్వన్మణీ !

అవునవు నబ్బురం బటవె ! యచ్చర మిన్నలు కిన్నరీ సతుల్
అవిరళ లాస్య హాస్య సముదంచిత వైఖరి సంచరించుటల్
భవ దనవాన చిత్రణల పాటలు పాడుట లాట లాడుటల్
కవికుల సార్వభౌమ ! నిను గన్న ధరిత్రి పవిత్ర మెంతయున్.



# కోహళీయ భరతము

## (కోహళీయ నాట్యం)

### శ్రీ జగన్నాధ శర్మ

భారతి యనుట సరస్వతీదేవికి—ఇంకొక్క పేరు.

తొల్లి భరతమునియొక్క పరిశ్రమవలన నెంతో ఉత్తేజకత నందినది కాఁగా భారతియనుపేరు లోకవ్యవహారమునకు అంది వచ్చినది భరత సంకలితమైన గాంధర్వవేదము నాట్యశాస్త్రము హైందవ సంగీత సాహిత్య సంస్కృతు లన్నిటికిని మూలకందం. ఈ యంశమును నాట్యశాస్త్ర వివరణ కారులయి యుండిన సనాతనులగులోల్లిట, శంకుక, భట్టనాయక— అభినవ గుప్త ప్రభృతులయొక్క యుల్లేఖనములు విశ్రుతపఱచుచున్నవి ఇట్టి దృక్పథంబుండి ప్రాచీనసంస్కృత వాఙ్మయోదంతము పట్ల పరిశోధనము నకు దొరకొందుమేని భామహ, దండి, ఉద్భట వామనరుద్రట, వల్లభదేవ— వేమిసాను, ఆశాధర, ఆనందవర్ధన, రాజశేఖర, ధనంజయ, ధనిక, కుంతల, క్షేమేంద్ర, భోజ, మహిమ్న భట్ట, మమ్మట భట్టాదులయొక్క సాహిత్యో పాసనా పరమైన బీజకీలకాదు లెల్ల భరతపరమయినవే! ముని విస్మయపడును. సంస్కృత వాఙ్మయచరిత్రముయొక్క లోతుపాతు లెఱిఁగిన శోధకు లెల్ల రును ఈ వాస్తవమును విశ్వసించియున్నారు. నాట్యశాస్త్రము అనుశాసించిన విధముగ నాయికా నాయకాది విరహితమైన రచన యిట్టి దానికి(నృత్తమునకు) నేనే కాలచక్రము—ఆ గిమస్థానమున సుఖాసన మిచ్చుచున్నది. కాబట్టి యీ నృత్తసారము ఇత్యాదులకు సంబంధించిన లక్ష్య లక్షణములను ప్రసం గింతము.

నృత్తము ఒక్కదానిని ప్రత్యేకరీతిగా అభ్యసింప బూనువారికి భర తుని నాట్యశాస్త్రము ప్రయోజనము మిక్కిలి తక్కువ. వారిని రచనముగ నున్న సంగీత మేరువు అవసరము ఎంతేని ఎక్కువ అని చెప్ప దగియున్నది శృంగియగు భట్టతండుని నృత్తవిధమును జగుగా ప్రకార ముగనకుఁ దెచ్చి నాతఁడు వి పలుకు డానికి ననుసరించెదము. శీగత్తు అను వారు పద్ధతిలోఁ బ్రయుకవగాఁ జూపట్టు చతుర్వింశతి వర్తనలు- హస్త విన్యాస రీతులు—భరతుని నాట్య శాస్త్రములోఁ జెప్పఁబడలేదు అవి కోహళునిచే వివృతము లయినవి మఱి నీ కోహళీయ ముత్తునందు వి శోభాభరసంభృతంబు లనుదగిన హస్తరేచకములు (చేతి విసురులు) తీరు మానపువంపులు నాట్యశాస్త్రమున చెప్పఁబడలేదు అట్టి రేచకపంచా శత్తును చాలకములు అను పేరఁ కోహళుఁడు స్వీకరించి యుండెను "శిలాబిం బిట్టం" అని పెద్దలవలను జెప్పఁబడుచు నున్న బరతనాట్యకుని ఆం దిన ఆటలో తఱచుగా చూపట్టు మధుపనారీలు—పాదచాలకములు ఇఱువది యొన్ని దింటని కోహళుఁ డొక్కరుఁడే సంగ్రహించి యుంచెను. త్రివిష్టప పాంప్రదాయానుగుణ్యముగా నుండు లక్ష్య గ్రంథముగా ఈ వర్తనలను—హస్త విన్యాసములను, చాలకములను (చేతి విసురులను) పదని కుట్టుకొలను అడ

వలను దివ్యర్షియగు నారదునుండి, శంభునినుండి —మతంగుని నుండి హనుమంతుని నుండి— క్షేమరాజు నుండి- లోహితభట్టు నుండి - మొదట శృంగి యగు తండునందికుఁడు ఏర్చి కూర్చిన మీదట వానిని కోహళుఁడు సేకరించి శతర్ద్యాలుఁడను నతనికి నేర్పినట్లు నాట్యవాఙ్మయ శోధనవలనఁ దెలియ వచ్చును.

భరతనాట్య ప్రసిద్ధిం దనర్చుచున్న శీయగత్తు శాస్త్రీయము సంప్ర దాయశుద్ధము నగు వర్తనాపంక్తి గలది మంచి అందచందాలు గలది. తళుకు బెళుకు కులుకు మిటారింపులతో నొప్పారునది. ఆతీ జోలో వివిధహస్త వర్తనలును వర్తనానుసరణములయిన నేత్రాలును పాదకుట్టనికములును అందులకు అనుగమించి మంచి తీరికలును ప్రదర్శితము లగును. అట్టి వర్త భ్యాస పరులకు అలవడఁజేయు క్రమమున వర్తనముల విధు అందింపఁజేయుబడు మన్నవి ఎట్లనఁగా ఉదాహరణకు 1. ఉద్వృత్త వర్తన: హంసపక్ష హస్తము లను తాలవృంతమున్నట్లు వివర పద్ధతిలోఁ జలింపఁజేయుచు వక్షస్థలాభి ముఖముగ ఒకదాని క్కటి ఎడ మొడముగాఁబట్టి అక్కడనే చేర్చి పట్టి క్రిందు మీదులకుఁ జలింపఁజేసి ఒకదానిని గుండెలమీద జేర్చి రెండవదానిని అధోముఖముగాఁ బోనిచ్చుట ఈ హంసపక్షద్వయచాలనము నతల నత్తున విడి గించుట బహుధా ఆచారము.

ఇందులకు విశ్వంకుఁడు :—

(శ్రీ. చతురస్రీ) కృతః పాణ్యోః
కృతయోర్వంస వక్షయోః
ఉత్తానోధో ప్రజత్వేనో
వక్షో ఒన్యో యాంత్యధో ముఖః
యదుస్యా తాంత ధోన్యృతౌ
తాళవృంత విరూపణే
తానేవతాళ వృంతాఖ్యా
వవదన్నృత్త కోవిదాః.

2. హంసపక్షౌ సమ్మృతౌ హస్తౌ
వ్యావృత్తౌ తాళ వృంతవత్.
ఉద్వృత్తా విత్తి—విష్ణుధర్మ భరతము.

3. ప్రాఙ్ముఖే హంసపకాభ్యా
వ్యావృత్త పరివర్తితౌ ఉద్వృత్తౌ సంగీత రత్నాకర.

4. యహోద్వృత్తౌ నృత్తహస్తౌ
పూర్వవ్రదేవ వర్తితౌ

ౖ తథ్తిౌ శ్చ వృత్తా హాసౌ
వర్తం ఉద్విరేరితే — కోపి కం.

5. హంసపక్ష కళావక్ష ప్రముఖత్వ ముపాశ్రితౌ
పరస్పరేణ విశ్లేష్టౌ కరోప్యు ద్వృత్తనామకః.

భరత కల్పలత—

6. ఉరసో గేహంసపక్షౌ వన్యోన్యాభి ముఖీకృతౌ
భవే దుద్వృత్తహస్తః ..... ..... దర్పణము.

7. అధరోత్తరయో రేక సమయే హంస పక్షయోః
ఉద్వృత్త ఇతి విఖ్యాత.— దర్పణకారుడు.

8. హంస పక్షాకృతౌ హస్తౌ
వ్యావృత్తౌ త తవృంతవత్
ఉద్వృత్తా వితి విజ్ఞేయౌ
అథవా తాలవృంతకౌ— భరత.

వ్యావృత్త చాలనము ఉరవక్షస్థలోపరి శిరః పర్యంతావధిగా హంస పక్షాకృతి ర వర్తనకు ప్రాణము. ఈ వర్తనము నారంభించునప్పుడు పతాక హస్తములను మొట్టమొదటఁ బట్టి అందుండి సర్ప శీర్షికా కృతులను రెండుచేతులకు ఒదవించి పిమ్మట హంసపక ము లనబడు ముద్రాద్వయము ప్రభవింపఁజేయుటే?

* * * *

తలముఖ వర్తన :— రొమ్మున కెదుట మీఁదికి ఎత్తబడిన పతాకలు అభిముఖమలయి చలింపఁబడఁగా అవ్వానిని పునః పున ప్రచాలనము రేచింపఁబడుట ఈ వర్తనయందు ముఖ్య లక్షణము. ముండి నర్తనము—మత్స్య నటనము—భుజంగ నాట్యము—ముఖచాళీయము ఈ విధములగు నృత్యములందు ఈ వర్తన తఱచుగా దృశ్యమగును :—

కటకా ముఖాత్మికముగా నుండు చతురశ్ర వర్తన మీఁదుగా తలముఖ వర్తన మొదలించుట కొందఱు ఆచార్యుల సంప్రదాయము. పూర్వోక్తంబైన హంసపక్ష కర ఉద్వృత్త వర్తనము యొక్క ఉత్తరరూపంబుగా తల ముఖాన వర్తన మొదలించుట పెక్కండ్రు నాట్యాచార్యుల యభిమతము.

1 చతురశ్ర కరౌ హంస పక్షౌ వన్యోన్య సన్ముఖౌ
తిర్యక్ వక్షః స్థల స్థౌతు కరౌ తలముఖే మతౌ

దిగంబర—

2. చతరశ్రీ కృతౌ హస్తౌ హంసపక్షీ కృతౌ తథా
తిర్యఙ్ముఖా పూర్ధ్వతలౌ జ్ఞేయౌ లఘుముఖావితి

— విష్ణుధర్మ భరతము—

3. చతురస్ర స్థితౌ హస్తౌ హంసపక్ష కృతౌ తథా
తిర్యక్ స్థితౌ చాభిముఖీ జ్ఞేయౌ తలముఖావితి —భరత—

4. భూతోద్వృత్తౌ పితే త్ర్యస్రౌ
హంసపక్షౌ స్వపార్శ్వయోః
జాతౌ మిథః సమ్ముఖ స్థతలౌ
తలముఖే మతౌ
బుధై రభి దధా తేతౌ
మధురే మర్దళధ్వనౌ. —నిశ్శంక వర్తనము—

5. కరౌ పతాక నామానౌ సమ్ముఖేతు పరస్పరం
పునః పునః ప్రచలితా వ్మృతస్తల ముఖాఖ్యయోః —దర్పణకార—

6. పతాకౌ—అన్యోన్యాభిముఖీ కృతౌ
చలితే చోత్తలముఖః ప్రోక్తో భరతవేదిభిః.

7. వక్షః పురస్తా దుద్వృత్తౌ
కరౌ త్వభిముఖాయది
వామ్నా తలముఖస్త్వ —భరతకల్ప లతాకారః—

ఈ రీతిగ లక్షణకారుల యర్థము నెఱిఁగి బహు సాధకము మీఁద నేర్పడు పొందికతో ఈ వర్తనలను ప్రదర్శింపఁగల యట్టి తీరు తెన్నులన్నిటి నాట్యాచార్యుఁడు విద్యార్థులచేత శ్రమ చేయింపవలసి యుండును—ఈ సందర్భములో,

క్రమోనామ నర్తన శిక్షాభ్యాస ఉచ్యతే —చెతుర.

విద్యారంభ సంప్రదాయక్రమ విధాన మిట్టిది జరిగినది మొదలుగా అభ్యాసకులను చాళీయ పద్ధతిలో అంగ ప్రత్యంగ సాధకములందుఁ ప్రవేశపెట్టఁ దగును. నర్తనము నభ్యసించు ఫక్కికలు అనేక తెఱంగులుగా నుండి ఒకదాని కొకటి పోలిక లేకుండ దేశదేశీచ లక్షణమ్ముగా నున్నది. ఇన్నిటిలో చాళీయ విధానము అభ్యాస సౌలభ్యము గలిగినదై యున్నది చిరకాలాగత బహుధా ప్రసిద్ధిగలదిగా నొప్పారుచున్నది ఈ చాళీయ శబ్దము—చారి శబ్దపర్యాయమని చెప్పవచ్చును.

"కేవల పాదాది క్రియాత్మికా చారీ" —లక్షణం.

ఈ సాధకమువలన తాండవ ఫక్కిక పాదక్రియ అందు శాస్త్రీయముగా స్థిరపడును.

"ఉద్ధత కరణాంగ విక్షేపమ్
అరభటీ వృత్తి ప్రధానం.—తాండవమ్. —లక్షణం.

తండువను నాయసవలన ఉద్ధతప్రాయ చరణ ద్వంద్వాహత ప్రయోగజనకముగా నిర్మితమ్మైన హడవల పద్ధతికి తాండవమని పేరేర్పడినది. ఈ తాండవమునకు అనుకూల ప్రతిఫక్కిక లాస్య మనఁబరుగును.

"కోమల కరణాంగ విక్షేపమ్
కైశికీ వృత్తి ప్రధానం లాస్యం" —లక్షణం.

నృత్తము అనఁగా లాస్య తాండవములు కలగలుపు అని చెప్పఁదగినది మార్గప కాతిస్వరములను గచ్చి ఎత్తిన ఆట పద్ధతి .. నృత్తమనఁబరుగును కేవలము మృదులమ్మైన ఆట వలన సదస్యులకుఁ ప్రీతి జనింపజదు కేవల ప్రౌద్ధతి వలనను జనింపదు. మృదులమ్మైన ఉరఃకటి శీర్షాపాంగ చాలనమువలన లాస్యగతి యేర్పడును. ఆ కోమల విలాస చాలనము—తుండ కైశిక మనునట్టి అల్ప ప్రౌద తిలో లీనమయి—అధిక ప్రౌద్ధతిలో విరమించును. ఈ త్రివిధ నర్తన పద్ధతిని అభ్యాసకులకు మొదటినుండియు ఆచార్యుఁడు గఱపం దగును. ఈ త్రివిధనర్తన పద్ధతినే చాళీయ తాండవ శిక్షణ ఫక్కికగాఁ ప్రాచీన కాలమునుండియు మన పెద్దలు వాకొనుచున్నారు. ఈ చాళీయ లక్షణము ఇట్లు నిర్వచింపఁబడినది.

రేఖా ప్రమాణ గాంభీర్యం
త త తాళ లయాన్వితం
ఉరఃకట శిరోపాంగం
కోమలం యదిచాలయేత్
అర్థాచాళీయ కశ్చాధ
చాళీ హస్త యుతో యుది.

ఇటు నృత్తమునకై ప్రాథమిక శిక్షణా అభ్యాసపరులకు అందింపఁదగినవి. చతురశ్రజాతి త్రిపుట—త్రిశ్రజాతి త్రిపుట యొక్క విలంబిత ద్రుతగతులలో పాద—హస్త విన్యాసములు అలోళిత శిరోవిధి—రేచిత వర్తనానుబంధము ఏం

హంసపక్ష—అలపద్మ—అలపల్లవ హస్తముల వ్యావృత్త పరివృత్త ఉద్వేష్టిత నావేష్టిత క్రియలు—అలపల్లవ వర్తనానుబంధులగు కటి గ్రీవారేచకములు—రేచితవర్తనాను సరణము గల 1 ఉద్వృత్త, 2. తలముఖ, 3. అర్ధరేచిత, 4 లతా, 5. దండపక్ష, 6 ఉరోమండల, 7 ఉద్వేష్టితాల పద్మ, 8 ఉల్బణ, 9 లలిత, 10. వళిత, 11. పర్యమాస, 12 అవహిత్థ.

## వర్తనలు

స్తుతి—వైష్ణవ సానకము. రేఖా ప్రమాణము, చతురశ్రముఖ, సౌష్ఠవము వర్తనారంభ సంప్రదాయము, సభారంభ సంప్రదాయము, చిత్తైకాగ్రత క్రియారంభ సంప్రదాయము, త్రివిధ నిర్తనములు, పూర్వరంగ ఉత్తరరంగ విజ్ఞానము, అలారింపు పుష్పాంజలి, క్షైపాడ, పీఠిక, భావ సాంప్రదాయము, లాస్యాంగములు.

శిక్షగతిలో సంప్రదాయశుద్ధముగా అభ్యాసము లంఘించిన యెడల 10—12 ఏళ్ల వయస్సు గల విద్యార్థినులకు 10 మాసముల నాటికి అమర దగిన పాఠ్య పరిమితి ఇది ఈ లెక్కను అలారింపు వఱకు నేర్పినట్లయితే అటుపిమ్మట నేర్ప దగిన గ్రంథము—జతి—శబ్దము— — తిల్లానా—వర్ణము—పదము—జావడి మున్నగునవి. అట్టి గ్రంథమంతయు పదు పదునాలు శిక్షకలు గల సాధకములయందును ఉత్కృష్టత నెపసిన పిమ్మట అభ్యసింపజేయ దగినది—సామాన్యముగా మొదటి దినాలలో విద్యార్థినులకు నడవ నేర్పునపుడు కాలి అడుగు క్రమబద్ధము గాక సమగతిలో పోకపోవచ్చును. తప్పటడుగులే వేసి రుదు రనుకొందము. అంతమాత్రాన ఆ బాలిక—నృత్య విద్యకు పనికిరాదా! అభిరుచి ఉన్నదని చెప్పి అభ్యాసికను గాని, అట్టి బాలుని గాని ఆసనశాలనుండి నిరసింప జేయ దగినదేనా? ఇది అనేక విద్యార్థులను గూర్చి నృత్యశాలలో ఆచార్యునికి తెలియగా సంక్రమించునట్టి ప్రశ్న ఇందులకు భరత మునియే ఇట్లు సదుత్తర మిచ్చియున్నాడు.

బాలానామపి కర్తవ్య
స్వచ్ఛంద పదవిక్రమా—
వర్తవ్యం సౌష్ఠవంకార్యం
ప్రమాణం న ప్రయోక్తృభిః నాట్యశాస్త్రము 12 193

"బాలానాం పీఠ—తద్భావ గమనా దితి
యథేవరూపం యోగ్యత్వం తత్త్వ తద్గతిః
విపర్యయ పరిగ్రహేచ విశేషార్థః."

—అభినవ గుప్తపాదులు.

అనిర్దిష్టమైన గతిలో బాల—బాలికలు శ్రీశివ పక్కగా అడుగుల పెట్టునా రగుటయే మిక్కిలి ప్రాయికముగా జూపట్టు లక్షణము. అట్టివారు ఆచార్యుని చేతి దండిక యొక్క సమగతి కాహతి ననుసరించి ప్రతియడుగును ఎత్తి దించి లయానుసారులు కానప్పుడు—ఆచార్యుడు అతిశ్రేష్ఠ చేయి తనచేతి దండికాహతిని—విద్యార్థినులలో ఒక్కొక్కరియొక్క అనిర్దిష్టగతి ననుసరించి విషమగతికముగా సాధకములు చేయింపవచ్చును అంతమాత్రాన అభ్యాసకులతో అవలయ స్థిరపడి పోగలదను భీతి పొంద నక్కరలేదు హెచ్చు తగ్గులుగా అడుగు విడుటలో ఆ యడుగుల జాడతో—దండికాహతిని సమీకరింపజేయుటలో ఆచార్యుడే అప్రమత్తుడు కాదగును. అట్లు చేయగల్గిన ఆచార్యుడే సమర్థుడు

సమర్థులగు నాట్యాచార్యు లరుదుగ నుందురు పూర్వాచార్యులందు గుణ విశేషము లిట్లు వినుబడుచుండును. భరత శాస్త్రాభిజ్ఞుడును—అభినయోపదేష్టయు—గాత్ర విక్షేపము మున్నగు వివిధాంగిక చాలనములను లయాశ్రయముగా నేర్పుటలో నేర్పరియైన యుండునట్టి నృత్త తత్త్వజ్ఞుడును గీతవాద్యములు రెంటియొక్క ఉపక్రమోపసంహారములను బాగుగా నెఱిఁగినవాఁడును—తాన పద్ధతిలోని సమాతాతానాగత గ్రహ పణతులనుభవ మున్న వాఁడును— వాద్యప్రకారవిజ్ఞానముగ గలిగినవాఁడును, రూపవంతుడును, శాస్త్ర సంప్రదాయ రహస్యజ్ఞుండును, నాద మాధుర్య తత్త్వవేత్తయును, రాగావయవాధిక్య న్యూనతాభిజ్ఞుఁడును—ద్రుత విలంబితాది లయల సమలోమ విలోమములుగా ఎలవఱచుకొన్నవాఁడును—లయ లయాంతర—తాళ తాళాన్తర కథనాను భవము కలవాఁడును—వాద్య ప్రబంధ నిర్మాతయు—మురజాది వాద్యోద్భవ వర్ణ సంధాన చాతుర్యము గలవాఁడును—తాళధారికిం గొలుకువ నందిచ్చు ప్రీతి గల వాఁడును—శిష్య విద్యా సంరక్షణ దక్షుఁడును—దేశిమార్గ నృత్తములు బోకడ లన్నింటి నెఱిఁగినవాఁడును—పాత్ర హృదయ సన్నివిష్ట ప్రతిభ నెలకొల్పువాఁడును జనాకర్షణముగా మంచు తెరలగున అభినయము నేర్పుటందు శాస్త్రగోష్ఠి విడువకుండువాఁడును—నృత్తదోషవిధానజ్ఞుఁడునై—తల్లక్ష్య లక్షణ తత్త్వజ్ఞ—అనుకరణములందివ్వఁ గలుగువాఁడును అయి యుండుట నాట్యాచార్యుని లక్షణము.



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7 Thambuchetty Street Madras-1. Editor. S. Sambu Prasad.

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ క్రోధినామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్యసిద్ధాన్తినః ద్వితీయ పుత్రేణ సుబ్రహ్మణ్యశాస్త్రిణా ప్రణీతమ్

సహారచయితారౌ. తత్తనయౌ చినకృష్ణమూర్తిశాస్త్రీ, సుబ్రహ్మణ్యశాస్త్రీచ

విఘ్నేశ విధిమార్తండ చంద్రేంద్రోపేంద్ర వందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే.

వేదమయీం నాదమయీం పరపదోద్య బిందుమయీం

మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం.

## గమనిక

ఈ సంవత్సరమున రాజు శని మంత్రి చంద్రుడు సర్వసస్య సముదాయమగు ౧౬ వీసములలో ౧౦ వీసములవంటు పండును బలరాముడు పశుపాలకుడు గావున సర్వదేశములయందు సువృష్టి తృణ సస్యవృద్ధి, మధ్యదేశమున అతివృష్టియు కలుగును పాటియం దార్ద్రా ప్రవేశము ఒక కుంచము వర్షము పౌష బ ౩౦ వ్య సోమ మహోదయ పుణ్యకాలము అధిక చైత్ర శు ౨ ఆదివారం గంగానదీ పుష్కరప్రవేశము ఫాల్గున బ ౪ ఆదివారం నర్మదానదీ పుష్కర ప్రవేశము జ్యేష్ఠ శు ౧౫ మ బుధవారం, మార్గశీర్ష శు ౧౫ మ శనివారం సంభవించు చంద్రగ్రహణములు ఆంధ్ర ప్రదేశమునందు కనుబడును.



## మౌఢ్యములు

అధికచైత్ర బ ౧౧ బుధవారం (8-4-1964) లగా॥ నిజచైత్ర బ ౧౩ ఆదివారం (10-5-64) వరకు గురుమౌఢ్యం. జ్యేష్ఠ శు ౬ సోమవారం 15-6-64 లగా॥ జ్యేష్ఠ శు ౧౫ (25-6-64) గురువారం పర్యంతం శుక్రమౌఢ్యం. తిరుగ మాఘ బ ౧౨ ఆది॥ 28-2-65 లగా॥ ఆవత్సరం శుక్రమౌఢ్యం.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౬౫ |
| శాలివాహనశకః | ౧౮౮౬-౮౭ |
| ఫసలీసన్ | ౧౩౭౩-౭౪ |
| హిజరీసన్ | ౧౩౮౩-౮౪ |
| క్రీస్తుశకం | 1964-65 |
| భారతస్వాతంత్ర్య శకః | 15-16 |

**ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు-1.**

## పంచాంగ పద్ధతి వివరణము

ఇందు కాలమానము యథాప్రకారముగ విజయవాడ, గుంటూరు, ఏలూరు మొదలగు ఆంధ్రప్రదేశ మధ్య భాగమునకు చూపబడినది తిథి, నక్షత్రములు ఘటికలలోను, గంటలలోను కూడ చూపబడినవి శుభ ముహూర్తములు—దుర్ముహూర్తములు—వర్జ్యములు—మహాపాతలు గంటలలో మాత్రం చూపబడినవి యోగకరణ, అమృత, గ్రహ ప్రవేశములు ఘటికలలో మాత్రం చూపబడినవి భారతప్రభుత్వముచే నియమింపబడిన కాలెండరు రిఫార్మ్ కమిటీవారి నిర్ణయము ననుసరించి ప్రకటింపబడిన ఇండియన్ ఎఫెమెరీసు—అందు నాటికల్ ఆల్మనాక్కునకు సరిపడునట్లు చూపబడినవి నూతన వేధశాలలయందు కనుగొనబడిన భూ కేంద్రమునకు సరిపడు వాస్తవిక రవి చంద్రులచే సాధించబడిన తిథ్యాధికము, గ్రహసంచారము ఇందు ప్రాధాన్యముగ చూపబడినవి ఈ తిథ్యాది గ్రహ సంచారములే పంచాంగమున వ్రాసినట్లు ఆకసమున సరిపడుచున్నవి న్యాయమును లోకము తెలుసుకొనుటకొరకు భేదమును గుర్తించగలందులకు పూర్వ పద్ధతి పంచాంగం కూడ ఇందు సంగ్రహముగ చూపబడినది. ఇందు చూపబడిన పూర్ణ శాస్త్రీయ పద్ధతియే శాస్త్రీయమని గ్రహించగునని మా నిశ్చితాభిప్రాయము ఇందు తిథ్యాది ఘటికలు, ఉదయాస్తమయము, శుభ ముహూర్తములు, విజయవాడ, గుంటూరు, ఏలూరు ప్రాంతములకు చూపబడినవి ఇందు లగ్నాంత కాలములు, నిరయణ గ్రహస్ఫుటములును చూపబడినవి దేశాంతర చక్రములును చూపబడినవి- ఇందు వేదాంగ జ్యోతిషమున సూచించబడిన అశ్విన్యాదిని గ్రహించి ఈ పంచాంగ రచన చేసియున్నాము—గావున వైదికమును సనాతనము గూడ యగుచున్నది. 10 అక్షాంశ అగాయతు 30 అక్షాంశవరకు లగ్న ప్రమాణములు ఇవ్వబడినవి. శాస్త్రమునకు ప్రత్యక్షమునకు సముచితమ్మై యొప్పు ఈ పంచాంగమును గ్రహించి శ్రౌత స్మార్త కర్మల నాచరింప గోరుచున్నాము.

## దేశాంతర చక్రము

| | చైత్ర మేష | వైశాఖ వృషభ | జ్యేష్ఠ మిథున | ఆషాఢ కర్కాట | శ్రావణ సింహ | భాద్ర కన్యా | ఆశ్వయుజ తులా | కార్తిక వృశ్చిక | మార్గశిర ధను | పౌష మకర | మాఘ కుంభ | ఫాల్గున మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మైసూరు | —౩౯ | —౪౯ | —౫౬ | —౫౯ | —౫౬ | —౪౯ | —౩౯ | —౩౦ | —౨౩ | —౨౦ | —౨౩ | —౩౦ |
| బెంగుళూరు | —౩౦ | —౩౮ | —౪౪ | —౪౭ | —౪౪ | —౩౮ | —౩౦ | —౨౨ | —౧౬ | —౧౪ | —౧౬ | —౨౨ |
| అనంతపురం | —౩౦ | —౩౪ | —౩౭ | —౩౯ | —౩౭ | —౩౪ | —౩౦ | —౨౬ | —౨౩ | —౨౧ | —౨౩ | —౨౬ |
| బళ్లారి | —౩౭ | —౪౦ | —౪౩ | —౪౪ | —౪౩ | —౪౦ | —౩౭ | —౩౪ | —౩౨ | —౩౧ | —౩౨ | —౩౪ |
| కర్నూలు | —౨౬ | —౨౭ | —౨౮ | —౨౯ | —౨౮ | —౨౭ | ౨౬ | —౨౪ | —౨౩ | —౨౨ | —౨౩ | —౨౪ |
| హైద్రాబాదు | —౨౧ | —౨౦ | —౧౮ | —౧౮ | —౧౮ | —౨౦ | ౨౧ | —౨౩ | —౨౫ | —౨౫ | —౨౫ | —౨౩ |
| వరంగల్లు | —౧౦ | — ౭ | — ౪ | — ౩ | + ౪ | — ౭ | —౧౦ | —౧౩ | —౧౬ | —౧౭ | —౧౬ | —౧౩ |
| తిరుపతి | —౧౩ | —౧౯ | —౨౪ | —౨౭ | —౨౪ | —౧౯ | —౧౩ | — ౭ | — ౨ | + ౦ | — ౨ | — ౭ |
| నెల్లూరు | — ౬ | —౧౧ | —౧౪ | —౧౬ | —౧౪ | —౧౧ | — ౬ | — ౨ | + ౨ | + ౪ | + ౨ | — ౨ |
| కుంభకోణం | —౧౨ | —౨౪ | —౩౪ | —౩౮ | —౩౪ | —౨౪ | —౧౨ | — ౦ | + ౯ | +౧౩ | + ౯ | — ౦ |
| కాంచీపురం | — ౯ | —౧౭ | —౨౪ | —౨౬ | —౨౪ | —౧౭ | — ౯ | — ౧ | + ౬ | + ౮ | + ౬ | — ౧ |
| మద్రాస్ | — ౪ | —౧౧ | —౧౭ | —౨౦ | —౧౭ | —౧౧ | — ౪ | + ౪ | +౧౦ | +౧౨ | +౧౦ | + ౪ |
| భద్రాచలం | + ౩ | + ౫ | + ౭ | + ౮ | + ౭ | + ౫ | + ౩ | + ౦ | — ౨ | — ౩ | — ౨ | + ౦ |
| బందరు | + ౫ | + ౫ | + ౪ | + ౪ | + ౪ | + ౫ | + ౫ | + ౬ | + ౭ | + ౭ | + ౭ | + ౬ |
| రాజమండ్రి | +౧౧ | +౧౩ | +౧౩ | +౧౪ | +౧౩ | +౧౩ | +౧౧ | +౧౦ | + ౯ | + ౯ | + ౯ | +౧౦ |
| విజయనగరం | +౨౮ | +౩౨ | +౩౪ | +౩౬ | +౩౪ | +౩౨ | +౨౮ | +౨౪ | +౨౧ | +౨౦ | +౨౧ | +౨౪ |
| బరహాంపురం | +౪౨ | +౪౮ | +౫౩ | +౫౫ | +౫౩ | +౪౮ | +౪౨ | +౩౬ | +౩౧ | +౨౯ | +౩౧ | +౩౬ |

### సూచన

విజయవాడనుండి భారత ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడిన చైత్రాది మాసారంభము (అనగా మేషాది సాయన మాసారంభము) ల యందు కలుగు దేశాంతర విఘటికలు యీ పై చక్రమునందు చూపబడినవి. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్ట మాసాదియందు గల విఘటికలను యీ చక్రమననుసరించి విజయవాడకు పశ్చిమదేశములయందుండువారు యీ పంచాంగమందలి తిథ్యాదులలో తీసివేయగాను, ప్రాగ్దేశములవారు కలుపగాను స్వస్థానమునకు సూర్యోదయాది తిథ్యాదికాలము లగుచున్నవి. యీ విజయవాడ యామ్యోత్తర రేఖకు సమీపమందుగల దక్షిణోత్తర దేశములవారు ఇందు ఆయామాసములలో చూపిన +,— ధనర్ణ చిహ్నలను గుర్తించి సంస్కరించుకొన వలయును - ఇందు చూపిన విఘడియలు మాసాదియందు చూపబడినవి. మాసమధ్యయందు త్రైరాశికముచే దేశాంతరమును గ్రహించి సంస్కరించినచో సూర్యోదయాది స్ఫుటతిథ్యాది కాలములగును. ఇష్టగ్రామమునకు సూర్యోదయ గంటలు పై ప్రకారము దేశాంతర విఘటికల కగు నిమిషములను ఈ విజయవాడ కగు సూర్యోదయ గంటలలో ధనర్ణ చిహ్నలకు వ్యత్యస్తముగా (అనగా విజయవాడకు పశ్చిమదేశమం దుండువారు కలుపగను, ప్రాగ్దేశవాసులు తీసివేయగను) సంస్కరించినయెడల స్టాండర్డ్ టైము ననుసరించి ఇష్టగ్రామమునకు సూర్యోదయ గంటలగును; ఈ ప్రకారము సూర్యాస్తమయ కాలమును చేయదగదు.

## లగ్నాంతసారణియందు దేశాంతర చక్రము

| | మీన | మేష | వృష | మిథు | కర్క | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మైసూరు | +19 | +22 | +24 | +23 | +20 | +17 | +13 | +10 | + 8 | + 9 | +11 | +15 |
| బెంగుళూరు | +14 | +17 | +19 | +18 | +16 | +13 | +10 | + 7 | + 5 | + 6 | + 8 | +11 |
| అనంతపురం | +13 | +15 | +15 | +15 | +14 | +12 | +11 | + 9 | + 9 | + 9 | +10 | +21 |
| బళ్లారి | +16 | +17 | +17 | +17 | +16 | +15 | +14 | +13 | +12 | +13 | +13 | +15 |
| కర్నూలు | +11 | +11 | +12 | +11 | +11 | +10 | +10 | + 9 | + 9 | + 9 | +10 | +10 |
| హైద్రాబాదు | + 8 | + 7 | + 7 | + 7 | + 8 | + 8 | + 9 | +10 | +10 | +10 | + 9 | + 9 |
| వరంగల్లు | + 3 | + 2 | + 1 | + 1 | + 2 | + 4 | + 5 | + 6 | + 7 | + 6 | + 5 | + 4 |
| తిరుపతి | + 7 | + 9 | +11 | +10 | + 8 | + 6 | + 3 | + 1 | — 0 | + 0 | + 2 | + 5 |
| నెల్లూరు | + 4 | + 5 | + 6 | + 6 | + 5 | + 3 | + 1 | — 1 | — 1 | — 1 | + 0 | + 2 |
| మదరాస్ | + 4 | + 6 | + 8 | + 7 | + 5 | + 2 | — 1 | — 4 | — 5 | — 4 | — 2 | + 1 |
| కుంభకోణం | + 9 | +13 | +15 | +14 | +11 | + 6 | + 1 | — 3 | — 5 | — 4 | — 1 | + 4 |
| కాంచీపురం | + 6 | + 9 | +10 | +10 | + 7 | + 4 | + 1 | — 2 | — 3 | — 3 | — 0 | + 3 |
| భద్రాచలం | — 2 | — 3 | — 3 | — 3 | — 2 | — 1 | — 0 | + 1 | + 1 | + 1 | + 0 | — 1 |
| బందరు | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 2 | — 3 | — 3 | — 3 | — 3 | — 2 |
| రాజమండ్రి | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 5 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 | — 4 |
| విజయనగరం | —12 | —14 | —14 | —14 | —13 | —12 | —10 | — 9 | — 8 | — 8 | — 9 | —11 |
| బరహాంపురం | —19 | —21 | —22 | —22 | —20 | —17 | —15 | —13 | —11 | —12 | —14 | —16 |

ఇందు చూపబడిన లగ్నాంతకాలములు స్టాండర్డుటైము ననుసరించి విజయవాడకు లగ్నాంతకాలము లగుచున్నవి. ఇతరదేశములవారు, ఈ చూపబడినదేశాంతర చక్రము ననుసరించి, ఆయాలగ్నాంత కాలములకు చూపబడిన నిమిషములను, విజయవాడకు పశ్చిమదేశమున నుండు వారలు ఆయా కాలములలో కలుపగాను, ప్రాగ్దేశములయం దుండువారు తీసివేయగను, స్టాండర్డు టైముననుసరించి ఇష్టమగు ఆయా నగరములకు లగ్నాంత కాలము లగును.

# భారతదేశమున ఆ యా అక్షాంశ ప్రదేశములకు మేషాది నిరయణ రాశి ప్రమాణములు — ఘటికలు-విఘటికలు-పరలు.

| అక్షాంశ | మేషము | వృషభము | మిథునము | కర్కాటకము | సింహము | కన్య | తుల | వృశ్చికం | ధనుస్సు | మకరం | కుంభం | మీనం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఘ.విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ విఘ.పర. | ఘ.విఘ.పర. | ఘ విఘ.పర. | ఘ.విఘ.పర. |
| 10 | ౪-౩౫-౧౬ | ౫- ౮-౧౦ | ౫-౨౮-౧౧ | ౫-౨౦- ౧ | ౫- ౨-౧౯ | ౪-౫౭-౫౧ | ౫-౧౧-౧౩ | ౫-౨౭-౨౧ | ౫-౨౦-౫౧ | ౪-౫౦-౧౬ | ౪-౨౨-౧౭ | ౪-౧౬-౧౪ |
| 11 | ౪-౩౩-౨౬ | ౫- ౭-౧౦ | ౫-౨౮-౩౫ | ౫-౨౧-౩౨ | ౫- ౪-౨౨ | ౪-౫౯-౫౯ | ౫-౧౩- ౪ | ౫-౨౮-౨౦ | ౫-౨౦-౨౮ | ౪-౪౮-౪౪ | ౪-౨౦-౧౪ | ౪-౧౪- ౬ |
| 12 | ౪-౩౧-౩౪ | ౫- ౬-౧౧ | ౫-౨౮-౫౭ | ౫-౨౩- ౫ | ౫- ౬-౨౬ | ౫- ౨- ౮ | ౫-౧౪-౫౫ | ౫-౨౯-౨౦ | ౫-౨౦- ౫ | ౪-౪౭-౧౨ | ౪-౧౮-౧౦ | ౪-౧౧-౫౭ |
| 13 | ౪-౨౯-౪౧ | ౫- ౫-౧౧ | ౫-౨౯-౨౦ | ౫-౨౪-౩౮ | ౫- ౮-౩౧ | ౫- ౪-౧౮ | ౫-౧౬-౪౭ | ౫-౩౦-౨౧ | ౫-౧౯-౪౨ | ౪-౪౫-౩౮ | ౪-౧౬- ౫ | ౪- ౯-౪౮ |
| 14 | ౪-౨౭-౪౮ | ౫- ౪- ౯ | ౫-౨౯-౪౪ | ౫-౨౬-౧౨ | ౫-౧౦-౩౮ | ౫- ౬-౨౮ | ౫-౧౮-౪౧ | ౫-౩౧-౨౧ | ౫-౧౯-౧౯ | ౪-౪౪- ౪ | ౪-౧౩-౫౯ | ౪- ౭-౩౭ |
| 15 | ౪-౨౫-౫౩ | ౫- ౩- ౯ | ౫-౩౦- ౭ | ౫-౨౭-౪౭ | ౫-౧౨-౪౫ | ౫- ౮-౩౯ | ౫-౨౦-౩౬ | ౫-౩౨-౨౩ | ౫-౧౮-౫౫ | ౪-౪౨-౨౯ | ౪-౧౧-౫౨ | ౪- ౫-౨౫ |
| 16 | ౪-౨౩-౫౮ | ౫- ౨- ౭ | ౫-౩౦-౩౦ | ౫-౨౯-౨౩ | ౫-౧౪-౫౩ | ౫-౧౦-౫౩ | ౫-౨౨-౩౧ | ౫-౩౩-౨౫ | ౫-౧౮-౩౧ | ౪-౪౦-౫౩ | ౪- ౯-౪౩ | ౪- ౩-౧౨ |
| 17 | ౪-౨౨- ౧ | ౫- ౧- ౩ | ౫-౩౦-౫౫ | ౫-౩౧- ౧ | ౫-౧౭- ౨ | ౫-౧౩- ౮ | ౫-౨౪-౨౮ | ౫-౩౪-౨౮ | ౫-౧౮- ౭ | ౪-౩౯-౧౬ | ౪- ౭-౩౪ | ౪- ౦-౫౭ |
| 18 | ౪-౨౦- ౩ | ౪-౫౯-౫౯ | ౫-౩౧-౨౦ | ౫-౩౨-౩౯ | ౫-౧౯-౧౩ | ౫-౧౫-౨౪ | ౫-౨౬-౨౭ | ౫-౩౫-౩౨ | ౫-౧౭-౪౨ | ౪-౩౭-౩౭ | ౪- ౫-౨౩ | ౩-౫౮-౪౧ |
| 19 | ౪-౧౮- ౩ | ౪-౫౮-౫౪ | ౫-౩౧-౪౫ | ౫-౩౪-౧౯ | ౫-౨౧-౨౬ | ౫-౧౭-౪౧ | ౫-౨౮-౨౭ | ౫-౩౬-౩౭ | ౫-౧౭-౧౭ | ౪-౩౫-౫౮ | ౪- ౩- ౯ | ౩-౫౬-౨౪ |
| 20 | ౪-౧౬- ౧ | ౪-౫౭-౪౮ | ౫-౩౨-౧౦ | ౫-౩౬- ౦ | ౫-౨౩-౪౧ | ౫-౨౦- ౧ | ౫-౩౦-౨౮ | ౫-౩౭ ౪౨ | ౫-౧౬-౫౩ | ౪-౩౪-౧౬ | ౪- ౦-౫౫ | ౩-౫౪- ౫ |
| 21 | ౪-౧౩-౫౮ | ౪-౫౬-౪౧ | ౫-౩౨-౩౬ | ౫-౩౭-౪౩ | ౫-౨౫-౫౭ | ౫-౨౨-౨౨ | ౫-౩౨-౩౧ | ౫-౩౮-౪౯ | ౫-౧౬-౨౭ | ౪-౩౨-౩౩ | ౩-౫౮-౩౯ | ౩-౫౧-౪౪ |
| 22 | ౪-౧౧-౫౨ | ౪-౫౫-౩౪ | ౫-౩౩- ౨ | ౫-౩౯-౨౭ | ౫-౨౮-౧౫ | ౫-౨౪-౪౫ | ౫-౩౪-౫౬ | ౫-౩౯-౫౭ | ౫-౧౬- ౧ | ౪-౩౦-౪౯ | ౩-౫౬-౨౧ | ౩-౪౯-౨౧ |
| 23 | ౪- ౯-౪౫ | ౪-౫౪-౨౫ | ౫-౩౩-౨౮ | ౫-౪౧-౧౪ | ౫-౩౦-౩౫ | ౫-౨౭-౧౦ | ౫-౩౬-౪౩ | ౫-౪౧- ౭ | ౫-౧౫-౩౩ | ౪-౨౯- ౩ | ౩-౫౪- ౧ | ౩-౪౬-౫౬ |
| 24 | ౪- ౭-౩౭ | ౪-౫౩-౧౪ | ౫-౩౩-౫౫ | ౫-౪౩- ౨ | ౫-౩౨-౫౮ | ౫-౨౯-౩౭ | ౫-౩౮-౫౩ | ౫-౪౨-౧౭ | ౫-౧౫- ౬ | ౪-౨౭-౧౫ | ౩-౫౧-౩౯ | ౩-౪౪-౨౮ |
| 25 | ౪- ౫-౨౫ | ౪-౫౨- ౨ | ౫-౩౪-౨౩ | ౫-౪౪-౫౨ | ౫-౩౫-౨౨ | ౫-౩౨- ౬ | ౫-౪౧- ౩ | ౫-౪౩-౨౯ | ౫-౧౪-౩౯ | ౪-౨౫-౨౫ | ౩-౪౯-౧౪ | ౩-౪౧-౫౯ |
| 26 | ౪- ౩-౧౧ | ౪-౫౦-౪౮ | ౫-౩౪-౫౨ | ౫-౪౬-౪౪ | ౫-౩౭-౫౦ | ౫-౩౪-౩౮ | ౫-౪౩-౧౭ | ౫-౪౪-౪౩ | ౫-౧౪-౧౧ | ౪-౨౩-౩౨ | ౩-౪౬-౪౭ | ౩-౩౯-౨౭ |
| 27 | ౪- ౦-౫౪ | ౪-౪౯-౩౪ | ౫-౩౫-౨౦ | ౫-౪౮-౩౯ | ౫-౪౦-౧౯ | ౫-౩౭-౧౩ | ౫-౪౫-౩౪ | ౫-౪౫-౫౮ | ౫-౧౩-౪౧ | ౪-౨౧-౩౮ | ౩-౪౪-౧౭ | ౩-౩౬-౫౩ |
| 28 | ౩-౫౮-౩౫ | ౪-౪౮-౧౭ | ౫-౩౫-౫౧ | ౫-౫౦-౩౫ | ౫-౪౨-౫౨ | ౫-౩౯-౫౦ | ౫-౪౭-౫౩ | ౫-౪౭-౧౪ | ౫-౧౩-౧౨ | ౪-౧౯-౪౧ | ౩-౪౧-౪౪ | ౩-౩౪-౧౫ |
| 29 | ౩-౫౬-౧౪ | ౪-౪౬-౫౮ | ౫-౩౬-౨౧ | ౫-౫౨-౩౫ | ౫-౪౫-౨౭ | ౫-౪౨-౩౧ | ౫-౫౦-౧౫ | ౫-౪౮-౩౩ | ౫-౧౨-౪౧ | ౪-౧౭-౪౧ | ౩-౩౯- ౯ | ౩-౩౧-౩౪ |
| 30 | ౩-౫౩-౪౮ | ౪-౪౫-౩౮ | ౫-౩౬-౫౨ | ౫-౫౪-౩౮ | ౫-౪౮- ౬ | ౫-౪౫-౧౪ | ౫-౫౨-౪౦ | ౫-౪౯-౫౪ | ౫-౧౨-౧౦ | ౪-౧౫-౩౯ | ౩-౩౬-౨౯ | ౩-౨౮-౫౧ |

N. B. పది అక్షాంశ ప్రదేశముల గల పూర్వ ప్రాంతములు మొదలు ముప్పది అక్షాంశ ప్రదేశముల గల పశ్చిమ ప్రాంతములకు ఈ మేషాది నిరయణ లగ్న ప్రమాణములను గ్రహించవచ్చును. భారతదేశమున పాలీభాగము వరకు ఈ లగ్న ప్రమాణములను మా-ది గ్రహించవచ్చును.

## విజయవాడ ప్రాంతములకు
## మేషాది నిరయణ లగ్నప్రమాణములు—పుష్కరలు

| | లగ్న ప్రమాణములు | | | పుష్కర ప్రమాణములు | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౩ | గం 1-45 | మేషము | ౩- ౪ | గం 1-14 |
| వృషభము | ౫- ౨ | గం 2-1 | వృషభము | ౨-౨౦ | గం 0-56 |
| మిథునము | ౫-౩౦ | గం 2-12 | మిథునము | ౪-౨౪ | గం 1-46 |
| కర్కాటకము | ౫-౩౧ | గం 2-12 | కర్కాటకము | ౧-౧౭ | గం 0-31 |
| సింహము | ౫-౧౬ | గం 2-6 | సింహము | ౩-౪౧ | గం 1-28 |
| కన్య | ౫-౧౨ | గం 2-5 | కన్య | ౨-౨౬ | గం 0-58 |
| తుల | ౫-౨౪ | గం 2-10 | తుల | ౪-౧౯ | గం 1-44 |
| వృశ్చికం | ౫-౩౪ | గం 2-14 | వృశ్చికం | ౧-౧౮ | గం 0-31 |
| ధనుస్సు | [illegible] | గం 2-7 | ధనుస్సు | ౩-౪౩ | గం 1-29 |
| మకరం | [illegible] | గం 1-52 | మకరము | [illegible] | గం 0-52 |
| కుంభము | ౪- ౮ | గం 1-39 | కుంభము | ౩-౧౮ | గం 1-19 |
| మీనము | ౪- ౨ | గం 1-37 | మీనము | ౦-౫౬ | గం 0-22 |

గత లగ్నాంత కాలములో ముహూర్తలగ్న సంబంధమైన పుష్కర గంటలను కలిపిన శుభ ముహూర్త లగ్నమందు పుష్కర సమయము వచ్చును.

## రాజమండ్రి ప్రాంతములకు
## మేషాది నిరయణ రాశిప్రమాణములు

| | | | |
|---|---|---|---|
| మేషస్య | ౪-౨౨ | తులాయాః | ౫-౨౪ |
| వృషభస్య | ౫- ౧ | వృశ్చికస్య | ౫-౩౫ |
| మిథునస్య | ౫-౩౧ | ధనుషః | ౫-౧౮ |
| కర్కాటకస్య | ౫-౩౧ | మకరస్య | ౪-౩౯ |
| సింహస్య | ౫-౧౭ | కుంభస్య | ౪- ౮ |
| కన్యాయాః | ౫-౧౩ | మీనస్య | ౪- ౧ |

## విజయనగర ప్రాంతములకు
## మేషాది నిరయణ రాశిప్రమాణములు

| | | | |
|---|---|---|---|
| మేషస్య | ౪-౨౦ | తులాయాః | ౫-౨౭ |
| వృషభస్య | ౫- ౦ | వృశ్చికస్య | ౫-౩౬ |
| మిథునస్య | ౫-౩౧ | ధనుషః | ౫-౧౭ |
| కర్కాటకస్య | ౫-౩౩ | మకరస్య | ౪-౩౮ |
| సింహస్య | [illegible] | కుంభస్య | ౪- ౫ |
| కన్యాయాః | [illegible] | మీనస్య | ౩-౫౮ |

